KANU

Kanu

# ఏరిన ముత్యాలు

★ యవ్వనంలో మన విశ్వాసాలు మనం ఎక్కిచూసే కొండలు, మధ్యవయసులో అవి మనం దాక్కునే గుహలు

-సెనెకా

★ గొప్ప వ్యక్తుల అనుభవాలు సాధారణ వ్యక్తులకు ఉదాహరణలు

-డీ. హర్లీ

★ తాము చేస్తున్నది ప్రతివారికీ తెలుసునని ఖచ్చితంగా తెలుసుకున్నప్పుడు అధిక ప్రజలు నిశ్శబ్దంగా బాధపడటానికి లెఖ్ఖచేయరు.

-జె.ఆర్.డీ.టాటా

★ ఒక సబ్బు మాదిరిగా దురదృష్టం కొంత పెద్దదిగా మొదలవుతుంది. కానీ చిన్నది గానే మారిపోతుంది.

-గోథే

★ ఒక కళ చేతిలో ఉన్న వ్యక్తి అంతటా ఒక భాగం కలిగి ఉంటాడు.

-అరబిక్ సూక్తి

★ ఇతరులతో పోల్చుకోకుండా నీ జీవితాన్ని అనుభవించు

-శామ్యూల్ స్మైల్

★ ఎక్కడైతే అత్యున్నతమైన సత్యాలు ఆచరణీయాలుగా రూపొందుతాయో, ఆ సమాజం అత్యంత ఘనతగలది.

-వివేకానంద

★ విశ్రాంతి అనే తియ్యదనం శ్రమ అనే చేదునుంచి లభిస్తుంది.

-అల్జీరియా సూక్తి

★ ప్రతి ప్రజాస్వామ్యంలో ప్రతిభతో, జ్ఞానంతో, శీలంతో కూడిన ఒక సంపన్న వర్గం ఉండి తీరాలని నేను నమ్ముతాను

-ఎన్.ఏ.పాల్ఖీవాలా

★ ఒక వివేకవంతుడు నెమ్మదిగా వెళ్ళినా తన లక్ష్యానికి నిశ్చయంగా చేరుకుంటాడు.

-ఇరాకీ సామెత

★ ప్రారంభపు లోపాలను చిట్టచివరి విజయాలుగా మార్చుకునే సామర్థ్యం ఒక ఆశా వాదికే ఉంది.

-డా॥ రాధాకృష్ణ

★ శ్రద్ధ ఒక నిశ్శబ్దమైన మరియు నిరంతర పొగడ్త

-సిసెరో

★ సామాన్యులు కాలయాపన చేస్తే, వివేకులు సద్వినియోగానికి ప్రయత్నిస్తారు.

-జేమ్స్ ఎలెన్

★ కొంపలు అంటుకుని మండిపోతుంటే, నీటికై నూతులు తవ్వడం అవివేకం.

-వివేకానంద

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతురర కతలు

## ఔరా...!

"ఆ మీరు చెప్పేది నిజమా?" అక్కడున్న వాళ్లందరి నోళ్లూ ఆశ్చర్యంతో తెరుచుకున్నాయి.

అందులో అంత ఆశ్చర్యపోవాల్సినదేముందో జగన్నాధానికి అర్థం కాలేదు "అవునండీ నిజమే! మీ అమ్మాయి వాణి హాస్టల్ వదిలేసి ఓ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ కొలీగ్‌తో కలిసి రూమ్ తీసుకుని వుంటోంది. వాళ్లిద్దరూ స్కూటర్‌మీద ఆఫీస్‌కు, షాపింగ్‌కు, సినిమాలకు వెళ్లడం నేను కళ్లారా చూశాను"

"కళ్లారాకాక నోరారా, చెవులారా చూస్తారా ఎవరయినా? అయినా చూసినవాళ్లు ఇది మంచిది కాదని మందలించలేకపోయారా? మీలాంటి తెలిసిన వాళ్లున్నారనేగా మా ఇంట్లో ఎవరికీ ఇష్టం లేకపోయినా దాన్ని వంటరిగా బెంగుళూరు పంపింది" వాణి తండ్రి గొంతులో కోపం, బాధ.

"అయ్యో అదికాదండీ! మీరు పొరబడుతున్నారు. వాణితో వుంటున్న ఇంజనీరు..." జగన్నాధం మాట పూర్తి చేయకుండానే వాణి బామ్మ అందుకుంది.

"నువ్విప్పుడు చెప్పేదేంటి? ఆ ఇంజనీరు మంచివాడు. బాగా సంపాదిస్తున్నాడు. కలిసి తిరిగితే తప్పేముంది? పెళ్లి చేసెయ్యొచ్చు అంటావు. నీకేం? అదే నీ కూతురైతే తెలిసుండేది. అప్పటికీ నేచెప్తూనే వున్నాను. ఆడపిల్లకు అసలు చదువు, చట్టుబండలేమీ వద్దని. వింటేగా? ఉద్యోగాల్జేసి ఊళ్లేలాలని దాన్ని ముక్కూ మొహం తెలియని బెంగుళూరు పంపారు. ఇప్పుడెవడితోనో ఊరేగుతోంది. ఏడుస్తూ చావండి"

జగన్నాధానికి పరిస్థితినెలా టాకిల్



చేయాలో తెలియడంలేదు. ఆయన ఉదయం బెంగుళూరు నుండి రాగానే వాణి యోగక్షేమాల గురించి ఆమె తల్లిదండ్రులకు చెప్పాలని రాజారెడ్డి ఇంటికి వచ్చాడు. వాణి వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో ఆ చప్పిడి తిండి తినలేక ఎలా వుంటుందో అని ఆమె తల్లి బాధ పడుతుంటే అంత విచారించాల్సిన అవసరం లేదనీ, కొన్నాళ్ల క్రితమే వాణి హాస్టల్లోంచి బయటకొచ్చి తన కొలీగ్ అయిన ఓ ఇంజనీర్‌తో కలిసి రూమ్ తీసుకుని వుంటోందని చెప్పడంతో అక్కడ దుమారం చెలరేగింది. జగన్నాధానికి మాట్లాడే ఛాన్స్ ఇవ్వకుండా ఎవరి అభిప్రాయాల్ని వారు సంకీర్ణ ప్రభుత్వంలో పార్టనర్స్‌లా వినిపిస్తున్నారు.

అప్పుడే అక్కడకొచ్చిన వాణి బాబాయ్ గోపీనాధ్ అపోజిషన్‌లోంచి డిఫెక్ట్ అయిన ఎంపీలా అదరగొట్టే స్టేట్‌మెంట్ ఇచ్చాడు. "సిటీల్లో అమ్మాయిలు, అబ్బాయిలు కలిసి తిరగడం వింతేమీ కాకపోయినా మరీ బరితెగించి ఒకే రూములో కలిసి వుండడం టూమచ్. నాకెప్పుడో తెలుసు. స్త్రీ వాద తిక్క ముదిరిన మన వాణి ఇలాంటి పనేదో తప్పకుండా చేస్తుందని, ఇంక చేసేదేముంది! వెంటనే ఉద్యోగం మాన్పించి ఇంటికి తీసుకొచ్చేద్దాం"

వాణి తండ్రి రాజుగారూ, ఆయన భార్య సుభద్ర తమ కూతురు ఇలాంటి పని చేసిందంటే నమ్మలేనట్లు తల పట్టుక్కూర్చున్నారు. ఆ విషయం ఆ చిన్న ఊళ్లో తెలిస్తే తలెత్తుకుని తిరగ్గలమా అన్న బాధ వారి మొహాల్లో కొట్టొచ్చినట్టు కనబడుతోంది.

తనేదో ఒకటి చెయ్యకపోతే ప్రమాదం ముంచుకువచ్చే అవకాశముందని గ్రహించిన జగన్నాధం గొంతు పెంచి చెప్పాడు.

"మీరంతా కాసేపు నోళ్లు మూసుకుని నేను చెప్పేది కాస్త వింటారా?"

ఇక నువ్వేమిటి చెప్పేదన్నట్టు బామ్మ ఆయనవైపు కోపంగా చూసింది.

"మీరెందుకిలా లేనిపోనివి వూహించుకుని బంగారంలాంటి వాణిని అనుమానిస్తారు. తను ఓ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌తో కలిసి వుంటోందన్నానేగాని ఓ అబ్బాయితో కలిసి కాపురం చేస్తోందనలేదుగా! ఏం ఆడవాళ్లు సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు కాకూడదా? మీ అమ్మాయే ఓ కంప్యూటర్ ఇంజనీర్ కదా? అది మీకు తట్టలేదా? వాణితో వుండేది తన కొలీగ్, ఫ్రెండ్ అయిన మాలతి. ఇప్పుడైనా మీ ఊహాగానాలు మానుతారా?"

అంతే! నలుగురూ ఒక్కసారి తెల్లబోయారు.

—డాక్టర్ పి.వెంకటరామిరెడ్డి

---

## 'శునకభాష'

ఆరోజు పొద్దుటే వరండాలో ఈజీ ఛేర్‌లో కూచుని చుట్ట తాగుతున్నాడు అవధాని.

ఆయన మనవడు పార్థు కింద చాపమీద కూచుని తెలుగు వాచకంలో 'ధూమపానం' పై ఉన్న పాఠం చదువుకుంటున్నాడు.

వాళ్ళ పెంపుడు కుక్క 'జాకీ' వీధిలో కనిపించిన కుక్కల్ని చూసి మొరుగుతూ వాటి వెంటబడి వీధి చివరిదాకా తరిమికొట్టి వచ్చి తాతా మనవళ్ళకి ఎదురుగా తోకాడిస్తూ కూచుంటోంది.

"తాతయ్యా! జాకీ ఆ కుక్కలమీద అలా అరిచి వచ్చిందెందుకు?" అనడిగేడు పార్థు పాఠం చదువుకోవడం ఆపి.

"మా వీధికెందుకొచ్చారు. మీకేమైనా బుద్ధుందా లేదా మళ్ళీ వచ్చారో ఖబడ్దార్ అని ఆ కుక్కల్ని తిట్టి వచ్చిందన్నమాట" అని అర్థం చెప్పాడు అవధాని తన చుట్టతాగే కార్యక్రమానికి ఫుల్‌స్టాప్ పెట్టి.

"కుక్కల భాష నీకు తెల్సా?"



పార్థు ప్రశ్నతో అవధానికి గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లైంది. అయినా బింకంగా,

"అందులో పెద్ద తెలీటానికేముందీ, ఇప్పుడు జాకీ తోకాడిస్తూ మనముందలా కూచుందంటే దానిక్కూడా వేరే అర్థముంది తెల్సా? "

"నువ్వే చెప్పు తాతయ్యా. నాకు తెలీదు"

"తను ఆ కుక్కల్ని తిట్టి, బెదరకొట్టి వచ్చింది కదా. గొప్పపన్జేసేను, నాకో బిస్కట్ ఇవ్వండి, అంటోందిరా" అలా వివరించి మళ్లీ చుట్టతాగటం మొదలెట్టాడు అవధాని.



పార్థు ఇంట్లోకి వెళ్ళి ఓ డాగ్ బిస్కెట్ తెచ్చి జాకీకి అందించి, మళ్లీ తెలుగు పాఠం చదువుకోవడం మొదలెట్టాడు.

★ ★ ★

ఓ రోజు చుట్టతాగుతున్న అవధానివేపు చూసి, జాకీ మొరగసాగింది.

"తాతయ్యా! జాకీ ఇప్పుడు ఎందుకు మొరుగుతోందో చెప్పనా" అన్నాడు పక్కనే ఉన్న పార్థు.

"అప్పుడే నీకు కుక్కలభాష అర్థమైపోయిందేవిట్రా" ఆశ్చర్యంతో అడిగాడు అవధాని మనవణ్ణి, ఓ వైపు చుట్టకాలుస్తూనే!

"మనింటి దగ్గరేమో జాకీ ఉంది. మా స్కూల్ దగ్గర కూడా బోల్డు కుక్కలున్నాయ్ తాతయ్యా! అంచేత వాటి భాష నాకు బాగా అర్థమైపోతోంది" అన్చెప్పేడు పార్థు.

"ఓహో! అలాగా. ఐతే ఇప్పుడు జాకీ ఎందుకు మొరుగుతోందంటావ్? "

"ఏం లేదు తాతయ్యా! నువ్వు చుట్ట తాగుతున్నావు కదా. చుట్ట తాగటం ఆరోగ్యానికి మంచిది కాదు. తాగొద్దు. తాగావో ఖబర్దార్ అని జాకీ నిన్ను చూసి మొరుగుతోంది" అన్జెప్పేసి ఇంట్లోకి తుర్రుమన్నాడు పార్థు.





ఆ వెనకే జాకీ కూడా లోపలికి పరిగెత్తింది

"ఆరిభడవా! తాతకి దగ్గులు నేర్పేటంతటి వాడవయ్యావుట్రా నువ్వు" అంటూ అవధాని విస్తుపోయాడు.

–అంపేరాయని వెంకట చంద్రశేఖరరావు

---

# మ్యాచ్ ఫిక్స్

"కొండను తవ్వినా ఎలుకను పట్టలేని వాళ్ళు ఎవరు? " బస్సులో బాతాఖానీ వేసుకున్నారు ఇద్దరు కుర్రాళ్ళు. ఆ సంభాషణ వెనకసీట్లో కూర్చుని వింటున్నాడు మర్కటరావు.

పౌరుషం వచ్చింది. కారణం అతడు ఈమధ్యే సి. బి. ఐ. లో జాయిన్ అయ్యాడు.

ప్చ్... పాపం భారత్ క్రికెట్ బ్యాట్ కెన్ని బుకీల చెదలు పట్టాయి? ఒలింపిక్స్‌లో ఒక్క మెడలూ రానందుకు గగ్గోలు పెట్టే ఈ జనం, క్రికెట్ ఆడకుండానే క్రికెట్‌లో కోటీశ్వరులైన ఆటగాళ్ళను చూసి సంతోషించరేం?



"తెలీదు. నువ్వు చెప్పరా" అన్నాడో కుర్రాడు.

"సి. బి. ఐ. వాళ్ళు"

"ఎందుకని? "

"మొన్న మ్యాచ్ ఫిక్సింగ్‌లో దోషుల్ని కొంతమందినే పట్టుకున్నారు. కోట్లకొద్దీ డబ్బు ప్రవహించే ఆ ఆటలో నేరస్థులు నామమాత్రంగా నలుగురేనా? బజారుద్దీన్, గోంగియా, గజ్జిశర్మ..."

వాళ్ళమాటలు వింటున్న మర్కటరావుకి

అయినా క్రికెట్ ఫిక్సింగ్‌లో ఇంకా కొందరు పేరున్నవాళ్ళని కూడా కనిపెట్టి సి. బి. ఐ. కి మంచి పేరు తెప్పించాలని ఆశపడ్డాడు మర్కటరావు.

బస్ స్టేడియం దగ్గర ఆగగానే దిగాడు. ఆ స్టేడియంలో భారత్, పాక్ మ్యాచ్ జరు

గుతోంది. ప్రతీసారి పాక్‌తో మ్యాచ్ అంటే కార్గిల్ టైపు యుద్ధంలా ఫీలవుతారెందుకో ఈ ప్రజలు. అంతగా దేశభక్తి వుంటే తుపాకీ పట్టుకొని మంచుకొండలవైపు వెళ్ళొచ్చుగా అనుకున్నాడు.

"స్టేడియంలోని ఆటగాళ్లకొచ్చే ఫోన్‌కాల్స్ మీద కన్నేసి ఉంచితే మ్యాచ్ ఫిక్సర్‌లెవరో కనిపెట్టవచ్చు" అనుకున్నాడు మర్కటరావు.

ఆట అయిదు నిముషాలలో ప్రారంభం అవుతుందనగా భారత్ కెప్టెన్ 'గింగిలీ'కి ఫోన్‌కాలొచ్చింది. అట్నుంచి "మ్యాచ్ ఫిక్సయింది. గింగిలీకి చెప్పండి" అని ఫోన్ పెట్టేశారెవరో.

దొరికాడు దొంగ ఈ దెబ్బతో సి. బి. ఐ. పేరూ నా పేరూ మారుమోగుతుంది. టాప్ క్రికెటర్‌ని రెడ్‌హేండెడ్‌గా పట్టుకోవడం మాటలుకాదు అనుకుంటూ,

గ్రౌండ్‌లోకెళ్ళి గింగిలీతో "ఐ యామ్ ఫ్రమ్ సి. బి. ఐ. యూ ఆర్ అండర్ అరెస్ట్" అన్నాడు ఇంగ్లీష్ సినిమాలో జేమ్స్‌బాండ్ లాగా.

"వై సర్" ఆందోళనగా అన్నాడు గింగిలీ.

"ఇప్పుడే మీరో ఫోన్ కాల్ రిసీవ్ చేసుకున్నారు గదా. అందులో మ్యాచ్ ఫిక్సయ్యింది. అని ఎవరో మెసేజ్ ఇచ్చారుకదా. కమాన్ చెప్పండి. ఎవరువాళ్ళు... మాఫియానా? "

"ఓ! అదాసార్... పకపకా నవ్వాడు గింగిలీ. నేను చూసి వచ్చిన పెళ్ళి సంబంధాన్ని ఫిక్స్ చేశారు. ఆ ఫోన్ చేసింది మా డాడీ. మ్యాచ్ ఫిక్సయింది అంటే సంబంధం ఖాయమయిందని. అనుమానముంటే వాళ్ళ ఫోన్ నంబరూ... అడ్రసూ చెప్తా. వెళ్ళి ఎంక్వయిరీ చేసుకోండి" అని తాపీగా బ్యాట్‌తో పిచ్‌వైపు వెళ్ళాడు.

మర్కటరావు కెవ్వున అరిచి కిందపడ్డాడు.

–డా. కె. శివసుబ్బారావు

---

## స్వగృహం

బియ్యం కడిగి కుక్కర్లో పడేద్దాం అనుకుంటూ వుండగా ఫోన్ రింగైంది. రిసీవర్ ఎత్తింది సరస్వతి.

"హలో నేనూ!"

"మీరా!"

"ఆ... నేనే. రాత్రికి భోజనానికి రావడం లేదు"

"ఏం? "

"నా ఫ్రెండ్ వెంకట్ వచ్చాడు. ఇద్దరం హోటల్లో డిన్నర్ చేస్తాం"

"నాకు తెలుసులెండి. మీ వెంకట్ వస్తే ఇద్దరూ కలిసి బీర్ కొడతారని. అదేదో ఇంట్లో కొట్టొచ్చుగా. నేనేవన్నా వద్దన్నానా. ఇదివరకు ఎన్నిసార్లు కొట్టలేదూ!"

"నీకెందుకులే ఇబ్బంది"

"నాకేం ఇబ్బంది. మహా అయితే చికెన్ వండమంటారు. ఆమ్లెట్ వెయ్యమంటారు. అంతేగా? "

"అది కాదులే. తర్వాత చెప్తా!" అని శేఖర్ ఫోన్ పెట్టేశాడు.

రాత్రికి చాలా లేటుగా వచ్చాడు శేఖర్. బీరు వాసన రాకుండా కిళ్ళీ నములుతూ వచ్చాడు. స్నానం చేసి వచ్చాడు. సరస్వతిని దగ్గరకు తీసుకోబోయాడు.

"పాడు వాసన, దూరంగా పొండి" అంది.

"ఇంకేం వాసనోయ్. ఎప్పుడోపోయింది. అయినా నీకొక విషయం తెలుసా? బీర్ అంటే లేడీస్ డ్రింక్ అని అందరూ చెప్పుకుంటారు"





"గొప్పేలే"

"ఉన్న మాటేనోయ్. పెద్దపెద్ద హైసొసైటీ లేడీస్ బీర్లు తాగుతారట మా వెంకట్ చెప్పాడు"

"అవునూ మీ వెంకట్‌ని ఇంటికి తీసుకురాలేదే. ఎప్పుడూ తీసుకొచ్చేవాళ్ళుగా? " అడిగింది సరస్వతి.

"ఇదివరకంటే అద్దె ఇంట్లో వుండే

దిగిన హోటల్ వాడికి వాస్తు ప్రకారం కౌంటర్ మార్చమన్నాడు. ఎంట్రన్స్ వేరే దిక్కున వుండాలట. వంటగది పడగొట్టమన్నాడు. వాళ్ళ మేనేజర్ ఏమన్నాడో తెలుసా? 'ఈసారి మా హోటల్లో రూమ్ ఖాళీఉండదు సార్. పక్క వీధిలో మా రైవల్స్ హోటలుంది, అక్కడ దిగండి' అన్నాట్ట."

సరస్వతి పడీపడీ నవ్వింది.



వాళ్ళం. ఇప్పుడేదో సొంత ఇల్లు కట్టుకుని వుంటున్నాం అందుకని తీసుకురాలేదు" చెప్పాడు శేఖర్.

"విడ్డూరంగా వుందే మీరు చెప్పేది. సొంత ఇల్లు కట్టుకుని ఫ్రెండ్‌కి చూపించరా! మీరేమైనా అతనికి బాకీ వున్నారా ఏం? " ఆశ్చర్యంగా అడిగింది సరస్వతి.

"బాకీ లేదూ పాడూలేదు. అసలు సంగతి చెప్పలేదు కదూ! వాడు చదువుకునే రోజుల్లోనే వాస్తు పుస్తకాలు బోలెడు స్టడీ చేశాడు. అడిగిన వాడికి, అడగని వాడికి గూడా వాస్తు చెబుతాడు. వాడు

"ఇప్పుడు తెల్సిందా వాడిని ఎందుకు తీసుకురాలేదో? తీరా వచ్చాక వంటగది మార్పించు, బెడ్‌రూమ్ పడగొట్టు, ఎంట్రెన్స్ ఇలా కాదు అని మొదలు పెట్టాడనుకో. అలా చేయించినా లేకున్నా లోలోపల మనసు పీకుతూనే వుంటుంది అశుభం అని. ఎందుకొచ్చిన గోల అని వాడిని తీసుకురాలేదు" చెప్పాడు శేఖర్.

— వాణిశ్రీ

# చతుర

ఫిబ్రవరి 2001 సంపుటి: 24 సంచిక: 1

అతని వయసు ముప్పైమాత్రమే అయినా అతను చేసిన నేరాలకు పదిసార్లు జైలుశిక్ష అనుభవించాల్సి వుంటుంది.

కానీ రెండేసార్లు జైలుకి వెళ్ళివచ్చాడతను.

దొంగతనం వృత్తే అయినా, అవసరమయినప్పుడు మాత్రమే వెళ్ళే ప్రవృత్తి అతనిది.

ఘోరనేరం చేసి కూడా తాపీగా సిగరెట్ కాలుస్తూ పోలీసులముందునుంచే నిదానంగా నడిచి వెళ్ళే తెగువ అతనిది.

అంతటి సాహసవంతుడూ ఓ దుర్దినాన భయంకరమైన నేర గాళ్ళ ముఠా వలలో చిక్కుకున్నాడు.

తమ స్వార్థంకోసం వాళ్ళు అతన్ని ఉపయోగించుకున్న తీరుతెన్నులెలాంటివి?

ఎత్తుకు పైఎత్తులేయగల మేధావిలాంటి ఆ వ్యక్తి చివరకు ఏమయ్యాడు?

ఆపకుండా చదివించే ఆసక్తికర సంఘటనల అక్షరమాల

## మంజరి రచన పగ

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

బద్ధకంగా తిరుగుతున్న ఫ్యాన్లకింద ప్రయాణీకులు ఆదమరిచి నిద్రపోతున్నారు. తెల్లారడానికి రెండుగంటల సమయం మాత్రమే ఉంది. కోణార్క్ ఎక్స్‌ప్రెస్ వస్తున్నట్టు ఎనౌన్స్‌మెంట్ వినపడింది. కొందరు ప్రయాణీకులు హడావిడిగా ప్లాట్‌ఫాం చివరకు నడిచారు.

పది నిమిషాల్లో కోణార్క్ బరంపురం రైల్వే స్టేషన్‌లోకి వచ్చింది.

ఇంజన్ పక్కనున్న జనరల్ కంపార్ట్‌మెంట్‌నుంచి ప్లాట్‌ఫాం పైన కాలు మోపాడు ద్వివేది. జనాన్ని తప్పించుకుని అవతలకు వెళ్ళి చుట్టూ పరిశీలనగా చూశాడు. మూడు సంవత్సరాల క్రితం అదే రైలు ఎక్కడానికొచ్చినప్పుడు ఎలా వుందో అలాగే కనిపించింది స్టేషన్. సిమెంట్ బెంచీల స్థానం ప్లాస్టిక్ కుర్చీలు ఆక్రమించాయి. అదే అతని కంటికి కనిపించిన మార్పు.

ఎయిర్ బ్యాగ్ తగిలించుకుని క్యాంటీన్‌లోకి ప్రవేశించాడు. టీ తాగి బ్రెడ్‌తోపాటు టిఫిన్ ప్యాక్ చేయించాడు. సిగరెట్ పాకెట్ కొనుక్కుని ట్రైన్ దగ్గరకు వచ్చి కంపార్ట్‌మెంట్ ఎక్కాడు. అవతలి ద్వారం నుంచి పట్టాలమీద దిగి, అవి దాటి రెండో ప్లాట్‌ఫాం అధిగమించి రోడ్డు చేరుకున్నాడు. అక్కడనుంచి పొలాల్లోకి దారితీశాడు. కొంతదూరం వెళ్ళిన తరువాత మసక చీకట్లో నిర్వికారంగా కనిపించిందో పాడుపడిన బిల్డింగ్.

అతను బిల్డింగ్‌ద్వారం సమీపించి అగ్గిపుల్ల వెలిగించాడు. తలుపుకి తుప్పుపట్టిన తాళంకప్ప వేలాడుతోంది. కీ తో తాళం తెరిచి గడియలాగి తలుపు వెనక్కి నెట్టాడు. చాలారోజులనుంచి తెరవకపోవడంవల్ల తలుపులు కిర్రుమని చప్పుడు చేశాయి. మరో అగ్గిపుల్ల వెలిగించి నేలని పరీక్షించాడు. గచ్చుమీద అరచేతి మందం పేరుకుని వుంది దుమ్ము. విషపురుగులు సంచరించిన జాడ కనిపించకపోవడంతో తృప్తిపడి లోపలకు అడుగేశాడు.

బ్యాగ్‌నుంచి కొవ్వొత్తులు తీసి వెలిగించాడు. గదంతా వెలుగు పరుచుకుంది. ఒక మంచం, ట్రంకుపెట్టె తప్ప గదిలో మరో సామానులేదు. బ్యాగ్ అల్మారాలో పెట్టి గది శుభ్రం చేసే పని చేపట్టాడు. ఆ పని పూర్తయ్యేసరికి శరీరం చెమటతో తడిసింది. వెనుక తలుపు తీసి బావి వద్దకు వెళ్ళి స్నానం చేసి వచ్చాడు.

అప్పటికి పూర్తిగా తెల్లారింది.

రెండురోజుల క్రితం ముంబయ్‌లో రైలు ఎక్కాడతను. ప్రయాణ బడలిక తీరాలంటే కడుపు నింపుకుని అర్జంటుగా నిద్రపోవాలి.

లుంగీ కట్టుకుని తెచ్చుకున్న ఆహార పదార్థాలు తిని సిగరెట్ వెలిగించాడు. లేచి కొవ్వొత్తులు ఆర్పి సిగరెట్ పీక గదిమూలకు విసిరి మంచంపైన నడుం వాల్చాడు.

వెంటనే నిద్రపట్టేసింది.

★ ★ ★

ద్వివేది మేలుకునేసరికి చీకటిపడింది. లేచి మొహం కడుక్కుని బట్టలు వేసుకుని బయటకొచ్చాడు. రైల్వేస్టేషన్ ముందుకి వెళ్ళాలంటే చుట్టూ తిరిగి రెండు కిలోమీటర్లు నడవాలి. ఎప్పుడూ ఉపయోగించే అడ్డదారి అంటే... ఉదయం ట్రైన్ దిగి వచ్చిన మార్గంలో స్టేషన్‌దాటి అవతలికి చేరుకుని ఒక టీ కొట్టులో జొరబడ్డాడు.

"ఎప్పుడొచ్చావయ్యా?" టీ కొట్టు యజమాని పలకరించాడు.

అతనివైపు నవ్వుతూ చూసి చెప్పాడు ద్వివేది,

"ఉదయం..."

"ఎక్కడుంటున్నావ్?"

"ముంబయ్‌లో..."

"అమ్మఎలా వుంది?"

అతని మొహంలో చిరునవ్వు అదృశ్యమైంది.

"బాగుంది..." చెప్పాడు. ఎంత అదుపు చేసుకున్నా గొంతులో విషాదజీర ఆపలేక





పోయాడు.

"మమ్మల్ని వదిలి ఎందుకెళ్ళిపోయావ్? ఇక్కడ నీకు ఏం కష్టం వచ్చింది?"

చప్పున తల తిప్పి చూశాడు ద్వివేది.

అతన్ని గుర్తుపట్టిన రైల్వే కూలీలు, రిక్షా కార్మికులు టీ కొట్టు ముందు మూగారు. వాళ్ళల్లోని ఓ వృద్ధ కూలీ మాటలు అవి.

పదిహేను సంవత్సరాలు ఆ మనుషుల మధ్య పెరిగాడు. రోజుకొకరు ఇంటికి పిల్చుకుపోయి అన్నం పెట్టేవారు. ఆ నిరుపేదలు సాటి మనిషిని అభిమానించడంలోని తియ్యదనం రుచి చూపించారు. అక్కడ కొస్తే తన రాక అందరికీ తెలిసిపోతుంది. అయినా తనని ప్రేమించేవారిని తప్పించుకుని తిరగడానికి మనస్కరించలేదు. అక్కడ గుమికూడిన వారిని చూసి ద్వివేది కళ్ళు చెమ్మగిల్లాయి.

"మిమ్మల్ని వదిలి వెళ్ళే వుద్దేశ్యం నాకు లేదు. కాని అప్పుడు అలా వెళ్ళకపోతే నా జీవితం శాశ్వతంగా చీకటి పాలయ్యేది. అందుకే మీకెవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాను" చెప్పాడు.

"అమ్మ ఎక్కడుంది?"

"ముంబయ్‌లో..."

"నీతో తీసుకురాలేదా?"

"లేదు"

"ఎందుకని?"

"త్వరలో వస్తుంది"

వారి సందేహాలు తీర్చి టీ తాగి అక్కడ నుంచి బయటపడ్డాడు. మెయిన్‌రోడ్డు పక్కగా నిలబడి సిగరెట్ ముట్టించాడు.

విద్యుద్దీపాల కాంతిలో నగరం సర్వాంగ సుందరంగా కనిపిస్తోంది. అక్కడే పుట్టిపెరగడంవల్ల నగరాన్ని చూస్తుంటే ప్రాణం లేచొచ్చినట్టనిపిస్తోంది. సిగరెట్ కాలుస్తూ కదలకుండా వుండిపోయాడు. ఎవరో తనని నిశితంగా గమనిస్తున్నారనే ఆలోచన హఠాత్తుగా బుర్రలోకి ప్రవేశించింది.

చుట్టూ కలియచూశాడు.

అనుమానించదగ్గ మనుషులెవరూ కనిపించలేదు. అసలు అటువంటి వూహ ఎందుకొచ్చిందో అర్థంకాక ఆశ్చర్యపోయాడు. చాలారోజుల తరువాత నగరంలోకి అడుగుపెట్టడంవల్ల మనసు భ్రమిస్తోందని సరిపెట్టుకుని సిగరెట్ పడేసి వాచీ చూశాడు.

తొమ్మిదయింది.

అక్కడనుంచి కదిలి రోడ్డుదాటి ఒక సందులోకి ప్రవేశించాడు. ఎవరో తనని అనుసరిస్తున్నారనే భావన కలిగింది. చెవులకు మెత్తటి అడుగుల చప్పుడు వినిపిస్తోంది. ఆగి వెనక్కి చూశాడు. ఆ వీధి చివరవరకూ నిర్మానుష్యంగా కనిపించింది. నొసలు ముడివేసి తిరిగి నడవసాగాడు.

మళ్ళీ అదే చప్పుడు. రబ్బరు బూట్లతో అడుగులో అడుగులేస్తూ నడుస్తున్న మెత్తటి శబ్దం.

అగ్గిపెట్టె జారవిడిచి అది అందుకోవడానికి వంగి దృష్టి వెనక్కి సారించాడు. క్రీనీడలోకి నిశిత దృక్కులు మళ్ళించి అగ్గిపెట్టె అందుకుని, ఎవరూ కనిపించకపోవడంవల్ల కలిగిన ఆశ్చర్యం అణుచుకుంటూ అడుగులు వెయ్యసాగాడు. తనని అనుసరిస్తున్న విషయం నిజమైతే ఆ నైపుణ్యాన్ని మెచ్చుకు తీరాలని అనుకున్నాడు.

అతని వయసు ముప్పై సంవత్సరాలుంటుంది. రెండుసార్లు జైలుకి వెళ్ళివచ్చాడు. నిజం చెప్పాలంటే అతను చేసిన నేరాలకు పదిసార్లు జైలుశిక్ష అనుభవించాలి. తెలివితేటలతో మిగతా నేరాలనుండి తప్పించుకున్నాడు. దొంగతనం అతని వృత్తి. అయినా కూడా అవసరం కలిగినప్పుడు మాత్రమే దొంగతనానికి బయలుదేరతాడు. నేరం చేసి సిగరెట్ కాలుస్తూ తాపీగా పోలీసుల ముందునుంచి నడిచి వెళ్ళే తెగువ అతని సొంతం.

మూడు సంవత్సరాల క్రితం రెండోసారి శిక్ష అనుభవించి జైలునుంచి విడుదల

య్యాడు.

పోలీసులు వేటకుక్కల్లా వెంటపడ్డారు. తప్పుడు కేసులు బనాయించి జైలుకి పంపడం అనేది కొరుకుడు పడని నేరస్తుల విషయంలో పోలీసులు అనుసరించే పద్ధతి. ఆ నేరస్తుని జీవితం కోర్టుల చుట్టూ తిరగ డానికే సరిపోతుంది. పోలీసులు తనమీద దృష్టి నిలిపారని, చెయ్యని నేరాలు మోపి తిరిగి జైలుకి పంపే ప్రయత్నంలో వున్నా రని గ్రహించి అదేరోజు కోణార్క్ ఎక్కి ముంబయ్ వెళ్ళిపోయాడు.

ముంబయ్‌లో చాలా ఇబ్బందులు పడ్డాడు. దొంగతనాలు ఆర్థిక ఇబ్బందిని తొలగించలేకపోయాయి. ఇప్పుడతనికి పెద్ద మొత్తంలో డబ్బు అవసరమొచ్చింది. మరో దారి కనిపించక డబ్బు సంపాదించాలని ఇక్కడికి వచ్చాడు.

ఆలోచనలతో సతమతమవుతూ ఒక బార్‌లోకి నడిచాడు. విశాలమైన హాలులో కస్టమర్లు వున్నారు. కిటికీ ప్రక్క మసక చీక టిలో ఒక టేబుల్ ఖాళీగా వుండటం గమ నించి వెళ్ళి కూర్చున్నాడు.

"లార్జ్‌పెగ్ విస్కీ..." బేరర్‌తో చెప్పి సిగ రెట్ వెలిగించాడు.

బేరర్ తెచ్చిన విస్కీలో ఐసుముక్కలు వేసి కొద్దిగా షోడా కలిపి సిప్ చేశాడు. తనని వెంటాడిందెవరు అనే ప్రశ్న మనసు లోకి ప్రవేశించింది. పోలీసులుకాదని అత నికి నమ్మకంగా తెలుసు. అనుమానితుడ్ని స్టేషన్‌కి తీసుకుపోయి నాలుగు తగిలించి తమకి కావాల్సిన విషయం తెలుసుకునే ప్రయత్నం చేస్తారు తప్ప అంత ఓపిగ్గా వెంటాడి సమయం వృధా చెయ్యరు పోలీ సులు.

అయితే ఎవరు?

వెంటనే తంగవేలు గుర్తొచ్చాడు.

ఒక ఇంట్లోని ఇనప్పెట్టె తెరవడానికి అతన్ని తీసుకెళ్ళాడు. అంతకుముందురోజు దొంగతనానికి వెళ్ళినప్పుడు ఆ ఇనప్పెట్టె తనవల్ల కాదని గ్రహించి తంగవేలుని కాంటాక్ట్ చేశాడు. సిద్ధహస్తుడైన అతను కూడా దానిని తెరవలేకపోయాడు. ఇద్దరూ నిరాశగా వెనక్కి వచ్చేశారు.

ద్వివేదికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఆ ఇంటి యజమాని అప్పులిచ్చి నిరుపేదల్ని జలగలా పీడించే వడ్డీ వ్యాపారి. ఎప్పటి నుంచో అవకాశంకోసం చూస్తున్న ద్వివేదికి అతను ఢిల్లీ వెళ్ళిన విషయం తెలిసి దొంగ తనానికి వెళ్ళాడు. ఆ ఇనప్పెట్టెలోని నగదు కంటే అప్పులిచ్చి రాయించుకున్న పత్రాలు ముఖ్యం.

మరునాడు ఉదయం రైల్వేస్టేషన్ వద్ద అతని చెవులకు సోకిందోవార్త. రాత్రి ఎవరో అదే ఇనప్పెట్టె తెరిచి మొత్తం వూడ్చుకుపో యారట. ద్వివేది వెంటనే తంగవేలుని కల వడానికి వెళ్ళాడు. రాత్రి అతను ఇంటికి రాలేదని తెలియచేసింది తంగవేలు భార్య.

రెండురోజుల తరువాత కలకత్తాలోని ఒక హోటల్లో తంగవేలు ముందు ప్రత్యక్ష మయ్యాడు ద్వివేది. ఒక కాలు విరిచిన పిదప నిజం చెప్పాడతను. ఆరోజు రాత్రి ఎవరి దారిని వాళ్ళు విడిపోయిన అనం తరం తిరిగివెళ్ళి ఇనప్పెట్టె తెరిచి డబ్బు మూటకట్టుకుని ఇంటికి కూడా వెళ్ళకుండా కలకత్తా వచ్చేశాడు తంగవేలు. అతనివద్ద మిగిలిన సొమ్ము స్వంతం చేసుకున్నాడు ద్వివేది. విరిగిన కాలు బాగుచేయించుకోడా నికి నానా తిప్పలు పడ్డాడతను. అది మన సులో పెట్టుకుని అనుసరించే ధైర్యం అత నికి లేదు.

మరయితే ఇంకెవరు అనుసరించింది?

అంతకుమించి శత్రువు అంటూ బరంపు రంలో ఎవరూలేరు. తను నగరంలోకి ప్రవే శించిన వార్త పోలీసులకు తెలిసిందా?

ఏ క్షణంలో ఏం చేస్తాడో తనకే తెలి యదు. పరిస్థితులు గమనించి పనిపూర్తిచేసి క్షణాలలో అక్కడనుంచి అదృశ్యమవుతాడు. అందుచేత పోలీసులు ప్రవేశించే అవకాశం





ఏమాత్రంలేదు.

కందిరీగల్లా మెదడును దొలిచేస్తున్న ఆలోచనలు తొక్కిపెట్టి మరో లార్జ్‌పెగ్‌కి ఆర్డరిచ్చాడు. అది పూర్తయ్యేసరికి బార్ క్లోజ్ చేసే సమయం దగ్గర పడినట్టు హెచ్చరించాడు బేరర్. పది నిముషాల్లో డిన్నర్ ముగించి బిల్లు చెల్లించి బయటకొచ్చాడు.

నిర్మానుష్యంగా వున్న వీధిలో తాపీగా నడవసాగాడు.

★ ★ ★

రామ్ బెహరా సోఫాలో వెనక్కి వాలి కూర్చున్నాడు.

అతను చాలా సేపటినుంచి తాగుతున్నట్టు కళ్ళు మత్తుగా వున్నాయి. బిస్కట్‌కలర్ ప్యాంట్‌పైన అదేరంగు చెక్స్ షర్ట్ టక్ చేశాడు. సన్నటి చేతులమీద నల్లటి వెంట్రుకలు. అతని వయసును అంచనా వెయ్యడం కష్టం.

టీపాయ్‌మీద విస్కీసీసా, సోడాలు, విస్కీ నింపిన గ్లాసు, దానిపక్కన టెలిఫోన్ వున్నాయి. యాష్‌ట్రే సిగరెట్ పీకలతో నిండిపోయింది. కుడిచేతి వేళ్ళమధ్య కాలుతున్న సిగరెట్‌నుండి వెలువడుతున్న పొగ గదంతా ఆక్రమించుకుంది.

రామ్ అసహనంగా ఫోన్‌వైపు చూశాడు.

గ్లాస్ అందుకుని అందులోని ద్రవం గొంతులో వంపుకుని ఖాళీ గ్లాసు టీపాయ్ మీద పెట్టి కర్చీఫ్‌తో పెదాలు తుడుచుకున్నాడు. సిగరెట్ పెదాలమధ్య ఇరికించుకుని ఓ దమ్ములాగి దానిని యాష్‌ట్రే పైన పెట్టి టాయిలెట్‌వైపు మళ్ళాడు. ఒక నిమిషం తరువాత వచ్చి కూర్చుని ఫోన్‌వైపు మరోసారి విసుగ్గా చూశాడు. క్షణక్షణానికి అసహనం పెరిగిపోతుంటే కాలం నెమ్మదిగా కదిలిపోతోంది.

హఠాత్తుగా ఫోన్ రింగయింది.

దానికోసమే చూస్తున్నట్టు రిసీవర్ అందు

కున్నాడతను.

"అక్కడ చలేస్తోందా? " ఓ గొంతు అడిగింది.

"లేదు. మంచుపడుతోంది"

"సరుకు లోడయింది... ట్రైన్ బయలుదేరింది"

"గుడ్..." అని రిసీవర్ పెట్టేసి వాచీ చూశాడు.

ఎనిమిది దాటి పదినిమిషాలయింది.

గ్లాసులో విస్కీపోసి షోడా కలిపి వెనక్కి వాలాడు. అప్పటికి యాష్ట్రే పైన పెట్టిన సిగరెట్ చివరివరకూ కాలి ఆరిపోయింది. పది నిమిషాల తరువాత ఒక నెంబరు డయల్ చేశాడు. అటువైపు రిసీవర్ లిఫ్ట్ చేశారు.

"అక్కడ చలేస్తోందా? " అడిగాడు.

"లేదు. మంచుపడుతోంది"

"ఇప్పుడు ఎనిమిది గంటల ఇరవై నిమిషాలైంది. సరిగ్గా తొమ్మిదికి ఇచ్ఛాపురం బోర్డరు దగ్గర రోడ్డు పాడైనచోట వెయిట్ చెయ్యి. పదిగంటలు కాకుండా జీప్ ఆ దార్లో వస్తుంది. నెంబరు గుర్తుందా? "

"ఆ..."

"గుడ్... ఎట్టి పరిస్థితుల్లోనూ టార్గెట్ మిస్ కాకూడదు. ఎలాంటి సందడి సృష్టించకుండా పని ముగిస్తే బోనస్ దొరుకుతుంది"

"ఓ. కే..."

ఆ గొంతులో తొణికిన వుత్సాహం గుర్తించి ఫోన్ పెట్టేశాడతను. రెండుక్షణాల తరువాత మరో నెంబరు తిప్పాడు.

"అక్కడ చలేస్తోందా? " అడిగాడు.

జవాబు విని ప్రశ్నించాడు.

"రెడీనా? "

"రెడీనే..."

"వెంటనే బయలుదేరి కొత్తవలస రైల్వేస్టేషన్ చేరుకోండి. విశాఖపట్నం వెళ్ళే గూడ్సు ఒకటి తెల్లవారుజామున అక్కడ ఆగుతుంది. ఇంజన్‌వెనుక నున్న బోగీ నెంబరు నైన్‌ని జాగ్రత్తగా గమనించండి. మనవాళ్ళు సరుకు అక్కడ దించుతారు. అదే సమయంలో సబ్ ఇన్‌స్పెక్టర్ సూరి వాళ్ళని పట్టుకోడానికి వస్తాడు. అతన్ని కాల్చి చంపండి..." చెప్పి ఓ క్షణం తరువాత అడిగాడు.

"ఎనీ డౌట్? "

"అతను రాకపోతే? "

ఆమాట వినడం ఇష్టంలేనట్టు తల అడ్డంగా వూపాడు బెహరా.

"గూడ్సు కదిలేవరకూ వెయిట్ చేసి వచ్చేయండి. తెల్లవారేసరికి సూరి చచ్చిపోయాడనే వార్త తెలిస్తే కొంతకాలం అండర్‌గ్రౌండ్‌లో వుండడానికి రెడీకండి. ఫోన్‌చేసి పేమెంట్ పంపుతాను" చెప్పి రిసీవర్ పెట్టేశాడు.

గ్లాసు అందుకుని ద్రవాన్ని ఒకే గుక్కలో తాగేసి అలవాటుగా పెదాలు తుడుచుకున్నాడు. మరో సిగరెట్ ముట్టించాడు.

అతను డబ్బుకోసం హత్యలు చేస్తాడు.

అద్భుతమైన పథకం రూపొందించి హత మారుస్తాడు.

తన వృత్తిలో అతనెప్పుడూ ఎదురుదెబ్బ తినలేదు.

అందుకే ధీమాగా సిగరెట్ పొగ వదులుతున్నాడు.

★ ★ ★

సమయం తొమ్మిది దాటింది.

డైరీ తెరిచి చూశాడు సబ్‌ఇన్‌స్పెక్టర్ సూరి. స్టేషన్‌నుండి వెళ్ళేముందు అతను చేసే చివరిపని అది. ఉదయం తల్లికి జన్మదిన శుభాకాంక్షలు తెలియచెయ్యడం, పదిన్నరకి ఒక కేసులో సాక్ష్యం ఇవ్వడానికి కోర్టుకెళ్ళడం మరునాడు చెయ్యాల్సిన పనులు.

సూరి తండ్రి సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగి. అతను ఒరియావాడైనా వుద్యోగ రీత్యా ఆంధ్రప్రదేశ్‌లో వుండేవాడు. అప్పుడే అతను తెలుగమ్మాయిని ప్రేమించి పెళ్ళి




చేసుకున్నాడు. సూరి పూర్తిపేరు శరత్ చంద్ర సూరి. ఎప్పుడో తల్లికిచ్చిన మాటప్రకారం తన మొదటి సంతానాన్ని తల్లివద్ద వదిలాడు సూరి తండ్రి. ఆ తరువాత పిల్లలు కలగకపోయినా తన బిడ్డని తీసుకెళ్ళే ప్రయత్నం చెయ్యలేదు. అలా చేస్తే తల్లి పిచ్చిదైపోతుందని భావించాడతను.

సూరి పెంపకం, చదువు పూర్తిగా నాయనమ్మ ఆధ్వర్యంలో జరిగింది. డిగ్రీ పూర్తయిన తరువాత సబ్ ఇన్స్పెక్టర్‌గా వుద్యోగం వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో సెటిలవ్వాలనుకుంటున్న తండ్రి ఆలోచనకి భిన్నంగా సూరి బరంపురంలో ఉద్యోగం చేస్తున్నాడు.

తల్లిదండ్రులు దూరమయ్యారనే భావన అధిగమించడానికి ప్రతివారం వాళ్ళతో ఫోన్‌లో మాట్లాడతాడు సూరి. రెండురోజులు వరుసగా శలవు వస్తే చిన్న సూట్‌కేస్ పట్టుకుని తెల్లవారుఝామున ఎక్స్‌ప్రెస్ దిగుతాడు తండ్రి. ఆయన వెనుక తల్లి వుంటుంది.

ఆ రెండురోజులు వాళ్ళిద్దరూ చేసే హడావిడి అంతాఇంతాకాదు. పనిలోపడి భోజనానికి వెళ్ళడం ఆలస్యమైతే స్టేషన్‌కి వచ్చేస్తాడు తండ్రి. కలిసి భోజనం చేస్తేతప్ప ఆయనకి తృప్తి వుండదు. ఏ కూరగాయలో ఏ విటమిన్ వుందో, అది శరీరానికి ఎంత అవసరమో, అది లోపిస్తే వచ్చే వ్యాధులు వివరిస్తాడు వడ్డించిన పదార్థాలు చూపించి. తల్లిదండ్రులను చూసి గర్వపడతాడు, అలాగే ఇబ్బంది పడతాడు కూడా!

ఉదయం మార్నింగ్ వాక్‌కి వెళ్ళినప్పుడు ఫోన్‌చేసి తల్లికి జన్మదిన శుభాకాంక్షలు చెప్పాలనుకుని డైరీ సొరుగులో పడేసి బయటకొచ్చాడు సూరి. అప్పటికే సిబ్బంది నైట్ డ్యూటీలకు వెళ్ళడంవల్ల సెంట్రీ, మరో కానిస్టేబుల్ తప్ప స్టేషన్‌లో ఎవరూలేరు.

సూరి బైక్ స్టార్ట్ చెయ్యబోతుండగా సెంట్రీ గబగబావచ్చి చెప్పాడు,

"సార్... ఫోన్..."

బైక్ స్టాండ్‌వేసి వెళ్ళి రిసీవర్ తీసుకున్నాడు.

"సబ్ ఇన్స్పెక్టర్ సూరిని మాట్లాడుతున్నాను..."

"పదినిమిషాల క్రితం గూడ్సు ఒకటి బరంపురం రైల్వేస్టేషన్ దాటి ఇచ్ఛాపురం వైపు బయలుదేరింది. ఇంజన్ వెనుక బోగీ నెంబర్ నైన్‌లో బొగ్గుకింద గోనె సంచులతో మద్యం సీసాలు రవాణా అవుతున్నాయి..." ఓ గొంతు మత్తుగా చెప్పింది.

"అవి ఎక్కడకి వెళ్తున్నాయి? "

"ఆంధ్రప్రదేశ్‌లోని కొత్తవలస రైల్వేస్టేషన్‌లో అన్‌లోడవుతాయి"

"ఎవరు పంపుతున్నారు? "

"తెలియదు"

"పోలీస్ డిపార్ట్‌మెంట్‌కి సహాయపడే మీలాంటి బాధ్యతగల పౌరునికి అభినందనలు తెలియచేస్తున్నాను. సమాచారం అందించినవారికి మా డిపార్ట్‌మెంట్ ప్రోత్సాహక బహుమతి ఇస్తుంది. మీ చిరునామా చెప్పండి? " అడిగాడు సూరి.

బదులుగా ఫోన్ డిస్‌కనెక్ట్ అయింది.

నొసలు ముడివేసి ఫోన్ క్రెడిల్ చేశాడు సూరి. ఆ వ్యక్తి చిరునామా చెప్పడని ముందే అనుకోవడంవల్ల ఎలాంటి ఆశ్చర్యం కలగలేదు.

మద్యం ఎక్కడ్నుంచి ఏ స్టేషన్‌లో దించుతున్నదీ తెలిసినవాడికి ఎవరు పంపుతున్నారో తెలియదా?

బరంపురానికి కొత్తవలస రైల్వేస్టేషన్ రెండువందల కిలోమీటర్లకు పైనే వుంటుంది. గూడ్సు ట్రైన్ ఆ స్టేషన్ చేరడానికి ఆరేడు గంటలు పడుతుంది. అంటే తెల్లవారుఝామున అక్కడకెళుతుంది. నేరస్తులకు అది చాలా అనువైన సమయం. మధ్యలో గూడ్సు ఆపి చెక్‌చేస్తే సరుకు దొరుకుతుంది తప్ప నేరస్తులు చిక్కరు. సరుకు దించే సమయంలో వాళ్ళని పట్టు



# సచిత్ర విచిత్రం





## ది అగ్లీ క్లింట్ ఈస్ట్‌ఉడ్

'ది గుడ్', 'ది బ్యాడ్', 'ది అగ్లీ' అనే కౌబాయ్ చిత్రంలో హీరో పాత్ర వేసిన క్లింట్ ఈస్ట్ వుడ్ ఎడం మోకాలు కింది భాగం మాత్రం ఇప్పుడు అగ్లీగా కనిపిస్తుంది.

వెరికోస్ వీన్స్ అనే ఈ రోగ లక్షణం రక్తనాళాలు చర్మంమీంచి పొడుచుకు వచ్చినట్టు కనిపించడం. అయిదారువేల డాలర్ల ఖర్చుతో వాటిని తీయించుకోవచ్చుగానీ క్లింట్ ఈస్ట్‌వుడ్ ఆ పని చేయడంలేదు. "ఏదైనా సినిమాలో అవి కనపడకూడదంటే ఆ చిత్ర నిర్మాతలే ఆపరేషన్ ఖర్చు భరిస్తారు." అంటాడు 68 ఏళ్ల ఈస్ట్‌వుడ్. అమెరికాలో 15 శాతం మందికి ఈ వ్యాధి వస్తుంటుందిట.

కుంటే మొత్తం ముఠా దొరుకుతుంది.

గూడ్సుకంటే ముందు కొత్తవలస చేరటం అంత సులభంకాదు. గతుకుల రోడ్డులో ప్రయాణించి శ్రమ తీసుకుని వెళ్ళాలి. అక్కడ నేరస్తులు చిక్కితే ఆంధ్రా పోలీసుల అనుమతి పొంది వారిని బరంపురం చేర్చాలి. లేదా వారిని అక్కడే అప్పగించాలి. ఇదంతా పూర్తిచేసి తను కోర్టు సమయానికి తిరిగి రాలేడు. ఇన్వెస్టిగేషన్‌కోసం వెళుతున్నట్టు కోర్టుకి సమాచారం పంపి వెళ్ళవచ్చు. అలాచేస్తే కేసు వాయిదా పడుతుంది. ఇప్పటికే ఎన్నో అడ్డంకులు అధిగమించి కేసు విచారణకొచ్చేసరికి చాలా రోజులు పట్టింది.

ఏం చెయ్యాలి?

రెండునిమిషాలు ఆలోచించి ఓ నిర్ణయం తీసుకున్నాడు.

గోడకి తగిలించిన చార్ట్‌నుండి రెండు ఫోన్ నెంబర్లు నోట్‌బుక్‌మీద రాసుకుని స్టేషన్‌నుంచి బయలుదేరాడు. యస్.టి.డి. బూత్‌వద్ద బైక్ ఆపి ఒక కాల్ చేశాడు. రెండో కాల్ చెయ్యడానికి పావుగంట పట్టింది.

అక్కడనుంచి తన రూమ్ చేరుకున్నాడు.

ఇప్పుడతని మనసు ప్రశాంతంగా వుంది.

★ ★ ★

వైట్ కలర్ మారుతి హోటల్ ముందున్న పార్కింగ్ ప్లేస్‌లో ఆగింది.

అరవై సంవత్సరాల నిహ్లాని డ్రైవర్ సీటు నుంచి దిగి డోర్ లాక్‌చేసి కీస్ జేబులో వేసుకున్నాడు. అతని జుట్టు తెల్లగా పండిపోయింది. గ్లాస్కో పంచె, లాల్చీ ధరించాడు. కుడిచేతి చిటికెన వేలికి వజ్రపుటుంగరం మెరుస్తుంటే మెడలో గోల్డ్ చెయిన్ వేలాడుతోంది. చేతికున్న ఖరీదైన వాచ్ అతను ఎంతో జాగ్రత్త గల మనిషిగా సూచిస్తోంది. పదిమందిని శాసించేవాడిలా మొహంలో వెలుగు. ఆరోగ్యం గురించి శ్రద్ధ తీసుకుంటున్నట్టు ఆ వయసులో కూడా చకచకా నడిచి లోపలికి వెళ్ళాడు.

రిసెప్షనిస్ట్ విష్ చేసినా గమనించనట్టు లిఫ్ట్‌వైపు వెళ్ళి మూడో అంతస్తు చేరుకున్నాడు. ఒక రూమ్ సమీపించి కాలింగ్‌బెల్ మూడుసార్లు ప్రెస్‌చేసి వెయిట్ చెయ్యసాగాడు. ఎవరైనా చూసినా కాలింగ్‌బెల్ నొక్కడంలోని ప్రత్యేకత గ్రహించలేరు.

కొన్నిక్షణాల వ్యవధిలో తలుపు తెరుచుకుంది. నిహ్లాని లోపలకు వెళ్ళి వెంటనే తలుపు మూశాడు. గదిని ఆక్రమించుకున్న సిగరెట్ పొగకి అప్రయత్నంగా మొహం చిట్లించాడు. యాష్‌ట్రే నిండుగా కనిపిస్తున్న సిగరెట్ పీకలమీద, విస్కీ బాటిల్‌మీద అతని దృష్టి పడింది. తల పంకించి ఫ్యాన్ స్పీడ్ పెంచి, కిటికీ రెక్కలు తెరిచి తనవైపు చూస్తున్న రామ్‌బెహరాని ఒరియాలో అడిగాడు.

"ఎంతవరకూ వచ్చింది? "

బెహరా మందహాసం చేసి సిగరెట్ వెలిగించబోయి నిహ్లాని మొహంలో మారిన భావాలు గమనించి ఆ ప్రయత్నం విరమించాడు.

"కాస్సేపట్లో రిజల్ట్ వస్తుంది" చెప్పాడు.

నిహ్లాని కళ్ళల్లో సన్నని వెలుగురేఖ కదిలి మాయమయింది. సోఫాలో కూర్చుని రిలాక్సింగ్‌గా వెనక్కి వాలాడు.

"మీరు డ్రింక్ తీసుకుంటారా? " బెహరా అడిగాడు.

నిహ్లాని తల అడ్డంగా వూపాడు.

తన గురించి అతనికి తెలిసింది స్వల్పమని నిహ్లానికి తెలుసు. నిజం చెప్పాలంటే అతను టీ, కాఫీ కూడా తాగడు. ఉదయం వుడకపెట్టిన బఠాణీలు, పచ్చి క్యాబేజీ, కేరట్ తిని ఓ గ్లాసు మజ్జిగ తాగుతాడు. మధ్యాహ్నం వరి అన్నంలోకి పప్పు, బంగాళాదుంపకూర తప్ప మరోటి తినడు. గోధుమ రొట్టెలు, ఆకుకూర డిన్నర్. తరచుగా ఇచ్చే పార్టీల్లో కూడా ఒక గ్లాసు లెమన్ జ్యూస్ తప్ప కూల్‌డ్రింక్ కూడా



తీసుకోడు.

నియమ నిష్టలతో కూడిన జీవితం అతనిది

బరంపురంలోని వస్త్రవ్యాపారుల జాబితా తయారుచేస్తే నిహ్లాని మొదటిస్థానం ఆక్రమిస్తాడు. అలాగే ధనవంతుల లిస్టు రూపొందిస్తే అతని పేరునే ముందుగా రాయాలి.

నిహ్లానికి ఒక్కడే కొడుకు ఆ కొడుకుని ఎంతో గారాబంగా పెంచాడతను. చదువు స్వల్పంగాను, వ్యసనాలు అధికంగాను వంటబట్టాయతనికి. డబ్బుకి వెనుకాడాల్సిన అవసరం లేకపోవడం, స్వేచ్ఛ ఎక్కువగా లభించడం పతనానికి కారణమయ్యాయి. వ్యాపారం చేసుకోమని తండ్రి చెప్పిన మాటలు అతని చెవికెక్కలేదు. నిహ్లాని తప్పు గ్రహించేసరికి కొడుకు పూర్తిగా చేజారిపోయాడు.

కొడుకు అలవాట్లలో ప్రధానమైంది అమ్మాయిలతో తిరగడం. తను అనుభవించిన అమ్మాయిపైన ఎవరైనా కన్నేశారని తెలిస్తే సహించేవాడుకాదు. ఒక యువతిని ఎవరో టాకిల్ చేస్తున్నాడని తెలిసి, తాగి తెల్లవారుజామున రోడ్డుమీద అతన్ని పొడిచి చంపాడు నిహ్లాని కొడుకు.

హత్యానేరంనుండి కొడుకుని తప్పించడం నిహ్లానికి పెద్దపనికాదు. అటువంటి పలుకుబడి, డబ్బు అతనికుంది. అయితే ఒక వ్యక్తి నిహ్లానికి అడ్డంపడ్డాడు.

అతను సబ్ ఇనస్పెక్టర్ సూరి!

తెల్లవారుజామున అలవాటుగా జాగింగ్‌కి బయలుదేరిన సూరి రోడ్డుమీద జరిగిన హత్య చూశాడు. వెంటనే హంతకుడ్ని పట్టుకుని స్టేషన్‌లో అప్పగించాడు. అతనే ఆ కేసులో ప్రత్యక్షసాక్షి. అందుచేత బ్రీఫ్‌కేస్‌తో సూరిని కలుసుకున్నాడు నిహ్లాని. పదినిమిషాల తరువాత పాలిపోయిన మొహంతోను, పట్టుకెళ్ళిన బ్రీఫ్‌కేసుతోను తిరిగొచ్చాడు. రాజకీయ పలుకుబడి ఉపయోగపడలేదు కనీసం కొడుకుని బెయిల్ పైన విడిపించడం కూడా సాధ్యపడలేదు.

ప్రస్తుతం కేసు విచారణకొచ్చింది. రేపు కోర్టులో సూరి సాక్ష్యం చెప్పబోతున్నాడు. అతన్ని ఆపకపోతే కొడుక్కి శిక్షపడటం ఖాయం. అందుకే ప్రొఫెషనల్ కిల్లర్ రామ్‌బెహరాని కాంటాక్ట్ చేశాడు. ఇక సూరికి భూమిపైన నూకలు చెల్లిపోయాయనే వార్త తెలియడం ఒక్కటే మిగిలి వుంది.

"ఈపని ఏవిధంగా చేస్తున్నారు? " కుతూహలంగా అడిగాడు నిహ్లాని.

చిన్నగా నవ్వి తన పథకం వివరించి చెప్పాడు బెహరా. అంతా విన్న తరువాత ప్రశ్నించాడు నిహ్లాని.

"గూడ్సులో మద్యం రవాణా అవుతుంటే సూరి ఎందుకెళతాడు? "

తల పంకించి జవాబిచ్చాడు బెహరా.

"మరొక పోలీసు అధికారి అయితే వెళ్ళకపోవచ్చు కాని సూరి స్వభావం అదికాదు. నేరం జరుగుతున్నదని తెలిస్తే వదిలిపెట్టడు. అతనికి పేరుప్రఖ్యాతులు సంపాదించుకోవాలనే తపన అధికం. ఆ లక్షణానికి తగినట్టు ప్లాన్ రూపొందించాను. రాష్ట్ర సరిహద్దు దాటిన తరువాత ఆంధ్రప్రదేశ్‌లో హత్య జరిగితే అనుమానం మీపైకి రాదు..."

అతని ముందు చూపుకి మెచ్చుకోలుగా తలూపాడు నిహ్లాని. అయినా మనసులో మరో సందేహం తలెత్తింది.

"బరంపురం, కొత్తవలసల మధ్య ఎన్నో స్టేషన్లు వున్నాయి. ఏదో స్టేషన్‌లో బండి ఆపి చెక్ చేస్తే? "

బదులుగా నవ్వాడు తప్పితే సమాధానం ఇవ్వలేదు బెహరా. మద్యం రవాణాకోసం ఎన్నుకున్న వ్యాగన్ పక్క వ్యాగన్లలో ఒకమనిషి రహస్యంగా ప్రయాణం చేస్తున్నాడు. ఎక్కడైనా గూడ్సు ఆపి ఆ వ్యాగన్ దగ్గరకు సూరి వెళితే అతను కాల్చి చంపుతాడు.

బెహరా ప్లాన్ తయారుచేస్తే పెర్‌ఫెక్ట్‌గా వుంటుంది.

"పథకం రూపొందించి హతమార్చే బాధ్యత నాకప్పగించారు. ఇక మీరు నిశ్చింతగా వుండొచ్చు తెల్లవారకముందే సబ్ ఇనస్పెక్టర్ సూరి చచ్చిపోయాడనే వార్త వస్తుంది. దానితోపాటు డబ్బుకోసం నేనొస్తాను..."

నిహ్లాని తల పంకించి మౌనంగా వుండిపోయాడు.

గ్లాసులోని విస్కి తాగి సిగరెట్ వెలిగించాడు బెహరా. నిజానికి ఎదుటవాడిని లెక్కచేసే స్వభావం కాదతనిది. ఆ వాసన భరించలేక కిటికీ దగ్గరకు నడిచాడు నిహ్లాని. అమావాస్య కావడంవల్ల బయట చీకటి అలుముకుని వుంది. విద్యుద్దీపాల కాంతి ఆకాశంవైపు పాకుతున్నట్టుంది.

నలభై సంవత్సరాల క్రితం చిన్నబట్టల దుకాణంతో వ్యాపారం ప్రారంభించాడు. తక్కువకాలంలోనే మిగతా వ్యాపారులకు పోటీగా తయారయ్యాడు. ఇప్పుడు తనకి ఆస్తి ఎంతుందో ఖచ్చితంగా చెప్పలేడు. బాధ్యతలన్నీ కొడుక్కి అప్పగించి విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్న సమయంలో ఈ ఉపద్రవం వచ్చిపడింది.

సూరిని తప్పిస్తే కొడుకుని నిర్దోషిగా నిరూపించడం చాలా తేలిక. కడుపులోకి కత్తి దిగినప్పుడు హతుడు కత్తిపిడిని పట్టుకున్నాడు. రక్తంతో కత్తి తడవడంవల్ల వేలిముద్రలు చెరిగిపోయాయి. కొడుక్కి హతునితో ఎలాంటి పరిచయం లేదు. ఒక అమ్మాయి విషయంలో హత్య జరిగిందని నిరూపించడం అంత తేలికకాదు.

నిహ్లాని వాచీ చూశాడు.

పదిన్నర దాటింది.

ఇంతలో ఫోను రింగయితే అందుకున్నాడు బెహరా.

"లేదు... మంచుపడుతోంది..." చెప్పాడు.

అవతలివాళ్ళు ఏంచెప్పారో బెహరా మొహం వాడిపోయింది. రిసీవర్ పెట్టేసి షాక్ తగిలినవాడిలా కొన్ని క్షణాలు కూర్చుండిపోయాడు. రెండు నిమిషాల తరవాత ఫోన్ అందుకున్నాడు.

"నేను..." అని ఓ క్షణం ఆగి చెప్పాడు.

"నువ్వు వెంటనే సబ్‌ఇనస్పెక్టర్ సూరి ఇంటికెళ్లు. సెకండ్‌షో సినిమా విడిచిపెట్టే వరకూ ఆ ఇంటిని గమనించు. ఇంట్లో అతనొక్కడే వుంటాడు. రోడ్లు నిర్మానుష్యమైన తరువాత తలుపుకొట్టు. అతనికి ఎలాంటి అవకాశం ఇవ్వకుండా పొడిచిపారేయ్. తెల్లారేసరికి సూరి బతికుండకూడదు"

బెహరా రిసీవర్ పెట్టేశాడు.

"ఏమయింది?" నిహ్లాని అడిగాడు.

"అతను గూడ్సు కాచ్ చెయ్యడానికి వెళ్ళలేదు. అంతదూరం వెళ్ళి నేరస్తుల్ని పట్టుకుని ఇక్కడకు తీసుకురావడం కష్టమని భావించి వుండాలి. అందుకే కొత్తవలస పోలీసులకు ఫోన్‌ద్వారా సమాచారం అందించాడు"

ఇద్దరిమధ్యా నిశ్శబ్దం చోటుచేసుకుంది.



నెమ్మదిగా నడుస్తున్నాడు ద్వివేది. తాగిన విస్కీ రక్తంలో కలిసి నరాల్లో

ప్రవహించడంవల్ల శరీరం తూలుతోంది. అందుకే లెక్కపెడుతున్నట్టు అడుగులు జాగ్రత్తగా వేస్తున్నాడు. అయినా మెదడు మాత్రం ఆలోచిస్తోంది. బలహీనుడి మీద మేరుపర్వతం కూలితే చెయ్యగలిగిందేమీ లేదు, నిస్సహాయంగా చూడడం తప్ప! వారంక్రితం జీవితంలో ఎదురయిన క్లిష్ట మైన ఓ సమస్య తీరాలంటే డబ్బు కావాలి. అదేం చిన్నమొత్తంకాదు.

సరిగ్గా రెండు లక్షలు!

ముప్ఫై రోజుల్లో ఆ డబ్బు సంపాదించాలి. అదేపనిమీద బరంపురం వస్తే ఎవరో అనుసరించడం మొదలుపెట్టారు. వాళ్ళేదో చేస్తారనే భయం లేకపోయినా ఎందుకు వెంటాడుతున్నారో తెలుసుకోకపోతే మన శ్శాంతి వుండదు. పాము ప్రవేశించిన ఇంట్లో సంసారం చెయ్యడం ఎంత కష్టమో నేరస్తుని మనసులోకి అనుమానం జొరబడితే సంచరించడం అంతకంటే ఎక్కువ కష్టం. తనని వెంటాడుతున్నదెవరో తెలుసుకోవడం ఇప్పుడు సమస్యకాదు.

అసలు సమస్య రెండు లక్షలు సంపాదించడం!

డబ్బు సంపాదన అనేది అంత తేలికయిన విషయంకాదు. దొంగతనానికి వెళితే ఎంత దొరుకుతుందో తెలియదు. రెండు లక్షలు కావాలంటే తిరుగులేని పథకం రూపొందించాలి. సమాచారం సేకరించి అడుగెయ్యాలి.

ఆలోచిస్తూ నడుస్తున్న ద్వివేది చప్పున రెండడుగులు పక్కకు వేసి వీధిదీపం కాంతి పడని ఓ బిల్డింగ్ అరుగుపైకి జరిగాడు. అక్కడ నిలబడి జాగ్రత్తగా చీకట్లోకి చూశాడు. పదడుగుల దూరంలో ఒక ఇంటి పక్కన ఇద్దరు నక్కి కూర్చుని కనిపించారు. అక్కడేం చేస్తున్నారు? పదినిమిషాలపాటు వాళ్ళని గమనించి దొంగతనానికి వచ్చారని నిర్ధారించుకున్నాడు.

ఏ ఇంట్లోకి ప్రవేశించి దొంగతనం చేస్తారో చూడాలనే కుతూహలం మనసులో రేగింది. నిశ్శబ్దంగా నిలబడినచోటనే కూర్చుండిపోయాడు. సిగరెట్ కాల్చాలనే కోరిక అణుచుకుని వాళ్ళనే చూడసాగాడు.

హఠాత్తుగా గురువు రూపం కళ్ళముందు ప్రత్యక్షమయింది.

అతనికి అరవై సంవత్సరాలుంటుంది వయసు. సన్నగా గాలికి ఎగిరిపోయే ఆకారంతో పరమసాత్వికునిలా కనిపిస్తాడు తప్ప దొంగతనాలు చేసేవాడిలా వుండడు. ఎటువంటివారినైనా ఆకట్టుకునే రూపంతోపాటు చక్కటి మాటతీరు అతనిది. బలమైన వూచలు సైతం వంచగల నైపుణ్యం, శక్తి పూచికపుల్ల వంటి అతని చేతుల ప్రత్యేకత. ఎలాంటి తాళాలనైనా తృటిలో తెరవగల నేర్పరి.

దొంగతనం చెయ్యడం అతని వృత్తి. అయినా ఎప్పుడుపడితే అప్పుడు దొంగతనానికి వెళ్ళడు. అవసరం వచ్చినప్పుడు మాత్రమే చోరీకి బయలుదేరతాడు. దోచుకోవాలనుకున్న వారి వివరాలు సేకరిస్తాడు. ఆడవాళ్లను, ముసలివాళ్లను, రోగులను మినహాయించేవాడు. అడ్డదారిలో సంపాదించే వాళ్లు అతని టార్గెట్.

అలాంటి వ్యక్తి విచిత్రంగా ద్వివేదికి పరిచయమయ్యాడు.

ఒకరోజు అర్థాంతరంగా స్కూలుకి శలవు ప్రకటించడంతో సిటీబస్సులో ఇంటికొస్తున్నాడు ద్వివేది. ఓ వృద్ధుడు పక్కవాడి జేబులోని పర్సు కొట్టేయడం చూసి బిగ్గరగా అరిచాడు. అబద్ధం చెప్పకూడదని, దొంగతనం చెయ్యడం పాపమని బడిలో చెప్పిన మాటలు మనసులో గాఢంగా నాటుకున్న వయసు అది. ఆ అరుపుకి బస్సు ఆగిపోయింది.

వృద్ధుడు తన కలవరపాటుని నేర్పుగా కప్పిపుచ్చుకుని మౌనంగా చూస్తుండిపోయాడు. అతన్ని చూపించి పర్సుకొట్టేయడం గురించి అందరికీ చెప్పాడు ద్వివేది. ఆ

ప్రయాణికుడు జేబులు తడుముకుని పర్సు పోయినట్టు గుర్తించాడు. కండక్టర్ ఆ వృద్ధుని దుస్తులు తనిఖీ చేశాడు. అతని వద్ద కొద్దిపాటి చిల్లర తప్ప ఏమీలేదు. బస్సంతా గాలించినా పర్సు కనిపించలేదు.

బస్సును తిన్నగా పోలీసు స్టేషన్‌కి తీసు కెళ్ళి జరిగిన విషయం చెప్పాడు కండక్టర్. సబ్ఇనస్పెక్టర్ అడిగిన ప్రశ్నలకు తొణ క్కుండా సమాధానాలు ఇచ్చాడు వృద్ధుడు. ప్రభుత్వ ఆసుపత్రికి వెళ్ళొస్తున్నట్టు రుజు వుగా అవుట్‌పేషెంట్ స్లిప్ అతని వద్ద వుంది బస్సులోని మిగతావారిని కూడా క్షుణ్ణంగా సోదా చేశారు పోలీసులు. ఎవరి వద్దా పర్సు లేదు.

మతిపోయినవాడిలా వుండిపోయాడు ద్వివేది. వృద్ధుని చెయ్యి అత్యంత లాఘ వంగా ప్రయాణీకుని పాకెట్‌లోకి వెళ్ళి పర్సుతో బయటకు రావడం చూసి అరి చాడు. అందులో ఎలాంటి సందేహంలేదు.

మరి పర్సు ఏమయింది?

ప్రయాణీకుని వద్ద కంప్లైంట్ తీసుకుని వృద్ధుని చిరునామా నోట్ చేసుకుని బస్సు పంపివేశాడు సబ్ఇనస్పెక్టర్. ద్వివేది తన స్టాప్‌లో దిగి దిగులుగా ఇంటివైపు నడవసా గాడు. జరిగిన సంఘటన నుండి ఆ పసి హృదయం ఇంకా తేరుకోలేదు. కొంత దూరం నడిచిన తరువాత ఎవరో పిలిచి నట్టు వినిపించి వెనక్కిచూశాడు.

ఆ వృద్ధుడు ఆగమన్నట్టు సైగచేశాడు.

ద్వివేది గుండె క్షణంపాటు ఆగి తిరిగి కొట్టుకోసాగిం౦డ. తనని ఏదో చెయ్యడానికి అతనొస్తున్నాడనే ఆలోచన వచ్చి అక్కడ నుంచి పారిపోవాలనే పిచ్చికోరిక ఒకటి మనసులో పుట్టింది. అయినా కాళ్ళు నేలకు అతుక్కుపోయినట్టు కదల్లేకపోయాడు.

"నీ పేరేమిటి? " చిరునవ్వుతో అడిగాడా వృద్ధుడు.

"ద్వివేది..." భయపడుతూనే చెప్పాడు.

"ఏం చదువుతున్నావ్? "

"సెవెంత్ క్లాస్..."

"మన కళ్లు మనని మోసం చేస్తాయని నీకెవరన్నా చెప్పారా? " ప్రశ్నించాడు.

ద్వివేది సమాధానం చెప్పలేదు.

"నేను పర్సు తియ్యడం నువ్వు చూశావు. అయినా పర్సు నావద్దలేదు. అంటే నీకళ్ళు మోసం చేసినట్టు కాదూ? "

"మీరు తీశారు..." స్థిరంగా బదులిచ్చాడు ద్వివేది.

వృద్ధుడు చిన్నగా నవ్వాడు. కష్టపడి మాటలు నేర్పితే తప్పుగా పలుకుతున్న మనవడ్ని చూసి తాత నవ్వినట్టుందా నవ్వు.

"అయితే పర్సు నా వద్ద లేదేం? " అడిగి తెలివిగా చూశాడు.

ద్వివేది వద్ద జవాబు లేకపోవడంతో నిస్సహాయంగా చూస్తూ వుండిపోయాడు.

"పర్సు ఎక్కడుందో చూపించనా? "

ద్వివేది తలూపాడు.

అతను ఒకడుగు ముందుకేసి ద్వివేది స్కూలుబ్యాగ్‌లో చెయ్యిపెట్టి పర్సు బయ టకు తీసి చూపించి అన్నాడు.

"నువ్వే దొంగవి..."

"అబద్ధం..." అదిరిపడి అరిచాడు ద్వివేది.

"నువ్వు చెప్పింది నిజమని ఎలా నమ్మడం? వస్తువు నీవద్ద దొరికింది కాబట్టి అందరూ నిన్ను దొంగ అంటారు. పర్సు పోగొట్టుకున్న మనిషి గవర్నమెంట్ డాక్ట రని, ఒక పేషెంట్‌కు ఆపరేషన్ చేసి తీసు కున్న లంచం డబ్బు ఇందులో పెట్టుకున్నా డని, దానిని నేను దొంగిలించానని ఎవరు రుజువు చేస్తారు? "

ద్వివేది మొహం మరింతగా కళ తప్పింది. అతనే తన బ్యాగ్‌లో పర్సు పడే శాడని ఊహించాడు.

"పైన దేవుడున్నాడు..." ఆకాశంవైపు చూపించి అన్నాడు ద్వివేది.

"నిజమే... కాని ఇటువంటి వాటిలోకి

ఆయన తలదూర్చడు"

ఆ మాటలకి కోపం వచ్చింది ద్వివేదికి.

"మీరు మంచివాళ్ళు కాదు... పోలీసులు నా బ్యాగ్ వెదికితే నేనే దొంగనని జైల్లో పెట్టేవాళ్ళు" విసురుగా అన్నాడు.

అతను బిగ్గరగా నవ్వాడు.

"అలా ఎప్పటికీ జరగదు. నా నేరాన్ని ఇతరుల మీదకు నెట్టి తప్పించుకునే మనిషిని కాదు. ఒకవేళ నువ్వన్నట్టు నీ బ్యాగ్ చెక్ చెయ్యడం జరిగితే మొదటిసారి పిక్‌పాకెటర్‌గా నేను అందరి దృష్టిలో పడేవాడిని" అని పర్సునుంచి డబ్బు బయటకు తీసి ఖాళీపర్సు డ్రైనేజిలోకి విసిరాడు. రెండు వంద కాగితాలు ద్వివేది జేబులో కుక్కాడు.

"బాగా చదువుకో... ఎప్పుడైనా నీకు అవసరం వస్తే రైల్వేస్టేషన్ దగ్గరకు వచ్చి నంబియార్ కావాలని అడుగు..." అంటూ బుగ్గలు కుడిచేత్తో సున్నితంగా తట్టి అక్కడ నుంచి వడివడిగా వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళిన చాలా సేపటివరకూ ద్వివేది తేరుకోలేదు. జేబులోని వందకాగితాలు తీసి చూశాడు. ఆ కొత్త నోట్లని ఏం చేసుకోవాలో అర్థంకాలేదు. ఇంటికెళ్ళి తల్లి కంట పడకుండా గత సంవత్సరపు నోట్ బుక్ మధ్య వాటిని దాచి పుస్తకాల అడుగున పడేశాడు. నంబియార్‌కి వాటిని తిరిగి ఇచ్చివేయాలని నిర్ణయించుకున్నాడు. కాని అలా చెయ్యాలనుకున్నప్పుడల్లా ఏదో బెరుకు గుండెల్ని ఆక్రమించుకునేది. క్రమంగా వాటి గురించి మర్చిపోయాడు.

ద్వివేది తండ్రి తాపీపని చేసేవాడు. ఒక్కడే సంతానం కాబట్టి కొడుకుని చదివించాలని బడిలో చేర్చాడు. అతను తెచ్చే కూలి డబ్బులపైన ముగ్గురు సభ్యుల ఆ చిన్నికుటుంబం బతకాలి. ఉదయం గంజితాగి భోజనం పట్టుకుని కూలికెళ్ళి చీకటిపడిన తరువాత ఇంటికొచ్చేవాడతను. ఇంటికి సరుకులతోపాటు కొడుక్కి తినుబండారాలు తెస్తాడు. సరుకులకోసం ద్వివేది తల్లి, తినుబండారాలకోసం ద్వివేది గుమ్మంలో కూర్చుని ఎదురుచూస్తారు.

ఆ దినం ద్వివేది పుట్టిన రోజు.

పన్నెండు వెళ్ళి పదమూడు వచ్చిన ద్వివేది ఎప్పటిలా గుమ్మంలో కూర్చుని తండ్రి రాకకోసం చూస్తున్నాడు. నిజానికి తండ్రి తెచ్చే తినుబండారాలు అతనికి ముఖ్యం కాదు. సందుమలుపు తిరిగిన తండ్రిని చూసి జువ్వలా పరిగెడతాడు ద్వివేది. రోడ్డుమీద అలా పరిగెత్తకూడదని తండ్రి చెప్పిన మాట ఆ సమయంలో గుర్తుండదు. ఎదురొస్తున్న కొడుకుని చూసి ఆ తండ్రి కళ్లు సంతోషంతో మెరుస్తాయి. ఒకచేత్తో క్యారేజి పట్టుకుని మరో చేత్తో కొడుకును అక్కున చేర్చుకుంటాడు. అంతవరకూ పడిన కష్టం చప్పున అదృశ్యమౌతుంది.

తండ్రినుంచి లభించే ఆ ఆప్యాయత ఎన్నిసార్లు అనుభవించినా తనివి తీరదు. దానికోసమే గుమ్మంలో కూర్చుని ఎదురు చూస్తాడు.

ద్వివేది తల్లిదండ్రులకు తమ పుట్టినరోజు తెలియకపోయినా కొడుకు పుట్టినరోజు మాత్రం గుర్తుంటుంది. ఆరోజు తండ్రి చీకటి పడకముందే ఇంటికొస్తాడు. ముగ్గురూ కలిసి సినిమాకి వెళ్లడం రివాజు. గోడలమీద అంటించిన వాల్‌పోస్టర్లు పరిశీలించి ఏ సినిమా చూడాలో నిర్ణయిస్తాడు ద్వివేది.

ఉదయం పనికెడుతూ పెరిగిన కూలి డబ్బులతో మంచి పెన్ను కొని తెస్తానని చెప్పాడు తండ్రి. అందుచేత ద్వివేది ఆలోచనలు తండ్రి తీసుకురాబోయే పెన్ను చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఆ కానుక స్కూల్లో స్నేహితులకు గర్వంగా చూపెట్టాలనే ఆశ మనసుని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది.

చీకటి పడిపోయింది.

తల్లిలేచి వెళ్లి దీపంబుడ్డి వెలిగించి వచ్చి కూర్చుంది. తండ్రి రాకపోవడంతో చేతిలోని




పుస్తకం కిందపెట్టి అసహనంగా కదిలేడు ద్వివేది. అదిచూసి చిన్నగా నవ్వుతూ రెండు చేతులూ ముందుకుపోనిచ్చి పొట్టని పెనవేసుకుని ప్రేమగా కొడుకుని దగ్గరకు లాక్కుందామె. ఆ చర్యలోని మాధుర్యం రుచి చూస్తూ తల్లిమీద వాలిపోయి రోడ్డు వైపు చూడసాగాడు.

తండ్రికోసం కళ్లు కాయలు కాచేటట్టు చూస్తున్న ద్వివేది, ఆ వీధిలోకి రెండు లైట్లు ప్రవేశించడం గమనించాడు. అవి తిన్నగా వచ్చి తల్లీకొడుకుల ముందు ఆగాయి. ఆ లైట్లకు చెందిన వాహనం వెనుకతలుపు తెరుచుకుని ఒకతను దిగాడు. మరో అతను లోపలనుంచి సాయం చేశాడు. ఇద్దరూ ఓ ఆకారాన్ని మోసుకొచ్చి గుమ్మంలో దించారు.

"మజుందార్ భార్య ఎవరు? " ఒకతను ప్రశ్నించాడు.

"నేనే..." చెప్పింది ద్వివేది తల్లి.

"ఇక్కడ సంతకం చెయ్యండి..." ఒక కాగితం చూపించి అన్నాడతను.

"దేనికి? " ఆశ్చర్యంగా అడిగిందామె.

"మజుందార్‌ను మీకు అప్పగిస్తున్నం దుకు"

"ఆయన్ను నాకు అప్పగించడమేమిటి? "

అతను రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఉండి పోయి చిన్న గొంతుతో చెప్పాడు.

"సాయంకాలం బిల్డింగ్ పైనుంచి కాలు జారి కింద పడిపోయాడు మజుందార్. అతని తలకి బలమైన గాయం తగిలింది. హాస్పటల్‌లో చేర్చిన కాసేపటికి ప్రాణం పోయింది. మజుందార్ బాడీని..." అతను ఇంకేదో చెప్పాడు.

ఆ మాటలు బుర్రకెక్కలేదు. అక్కడ పేరుకున్న నిశ్శబ్దం క్షణం తరువాత ఒక్కసారిగా బద్దలైంది. చెరువు గట్టుతెగి నీరు ఉరికినట్టు ద్వివేది తల్లి గొంతునుండి హృదయవిదారక ఆర్తనాదం వెలువడింది. ఆమె గుండెలు బాదుకుంటూ రోదిస్తుంటే జనం చుట్టుముట్టారు.

ద్వివేది గుండె భయంగా కొట్టుకోసాగింది. అతను అప్రయత్నంగా గుడిసెలోకి వెళ్ళి కిరసనాయిలు దీపం తెచ్చాడు. ఆ వెలుగులో తలకి తెల్లటి కట్టుతో కళ్ళు మూసుకున్న తండ్రి రూపం కనిపించింది. తను పిలిచినా పలకడు? అనుకుంటూ కొద్దిగా ముందుకి జరిగాడు. తండ్రి చొక్కా జేబుకి పెన్ను కనిపించింది. క్యాప్ పైనున్న మెటల్ మెరుస్తోంది.

అప్పుడొచ్చింది ఉప్పెనలా దుఃఖం.

ఇహమీదట తను తండ్రి కోసం గుమ్మంలో కూర్చుని ప్రతిరోజూ ఎదురుచూడాల్సిన అవసరంలేదని గ్రహించేసరికి అక్కడ పరిస్థితి దారుణంగా వుంది. రెక్కల కష్టం పైన జీవించే ఆ ఇంట్లో శవాన్ని తీసుకెళ్ళేందుకు అవసరమైన డబ్బులేదు. నంబియార్ ఇచ్చిన రెండు వందలు గుర్తువచ్చాయి ద్వివేదికి. పాత నోట్ బుక్ నుండి వాటిని బయటకు తీశాడు. అతికష్టంమీద కార్యక్రమాలు పూర్తయ్యాయి.

పెద్దని పోగొట్టుకున్న ఆ ఇల్లు నిశ్శబ్దంగా రోదిస్తోంది. ద్వివేది తల్లి గొంతునుండి వెలువడే ఏడుపు ఆ నిశ్శబ్దాన్ని చెదరగొడుతోంది.

తండ్రి చొక్కానుండి తీసుకున్న పెన్ను చూసినప్పుడల్లా ద్వివేది కళ్ళు అశ్రువులతో నిండిపోతాయి. సాయంకాలం పనిముగిసే సమయంలో తండ్రికి ప్రమాదం జరిగింది. అప్పటికే పెన్ను జేబులో వున్నదంటే మధ్యాహ్నం దొరికిన కొద్దిపాటి విశ్రాంతి సమయంలో దానిని కొని వుండాలి. ఆ సమయం కూడా తనకోసం వెచ్చించిన తండ్రి గుర్తొచ్చి బుగ్గలమీద కన్నీళ్ళు ఏకధాటిగా స్రవిస్తాయి.

యజమాని చనిపోతే కుటుంబంలో మార్పు రావడం సహజం. గొప్పవారి గృహంలోను, పేదవాడి ఇంట్లోను కనిపించే మనిషిలేనిలోటు ఒక్కటే అయినా రెక్కాడితే

కాని డొక్కాడని కొంపలో జీవితాలు తారు మారవుతాయి

సరిగ్గా ద్వివేది పరిస్థితి కూడా అదే! పిచ్చి పట్టినట్టు తల్లి ఓ మూల పడుకుని లేవ ట్లేదు ఆదరించి ఆదుకునే బంధువులు లేరు. రెండురోజులు సహాయపడిన పరిచ యస్తులు తమ పనుల్లో మునిగి పట్టించుకో వడం మానేశారు. దిక్కుతోచని ద్వివేది స్కూలుకి వెళ్ళడంలేదు. తండ్రి పోయిన బాధకి ఆకలి తోడయింది.

ఒకరోజు సాయంకాలం రైల్వేస్టేషన్‌కి వెళ్ళి ఓ కిళ్ళీషాపతన్ని నంబియార్ గురించి అడిగాడు అతను మనిషిని తోడిచ్చి రైల్వే స్టేషన్ అవతల పాడుపడిన ఇంటికి పంపాడు అక్కడ చుట్టూ కూర్చున్న మను షుల మధ్య కనిపించాడు నంబియార్. ద్వివేదిని చూసి చప్పున లేచొచ్చాడతను. ఆప్యాయంగా భుజంపైన చెయ్యివేసి కళత ప్పిన మొహంచూసి బుజ్జగించి ద్వివేది నుండి విషయం రాబట్టాడు.

"నీకేం భయంలేదు... నేనున్నాను" చెప్పాడు ద్వివేది మనసులోని దిగులు చేత్తో తీసేసినట్టు.

పెద్ద శబ్దంతో ఒక వాహనం దూసుకుపో వడంతో ద్వివేది ఆలోచనలు తెగిపో యాయి.

తను అక్కడెందుకు కూర్చున్నాడో గుర్తుతె చ్చుకోవడానికి రెండు క్షణాలు పట్టింది. అంతకుముందు ఇంటిపక్కన చూసిన ఆకా రాలు కనిపించలేదు. సరిగ్గా అప్పుడే సినిమా జనం రాసాగారు. ద్వివేది కొద్దిగా వెనక్కి జరిగి మరింత జాగ్రత్తగా పరిసరా లను చూశాడు. ఒక ఇంటి అరుగుపైన ఎవరో పడుకుని వుండటం లీలగా కనిపిం చింది. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చు కున్నాయి. అలికిడి అయినప్పుడు నేరం చెయ్యడానికి వచ్చినవాళ్ళు కదలకుండా నిద్ర నటించడం కొత్త ట్రిక్కేం కాదు.

పదిహేను నిముషాల్లో వీధి నిర్మానుష్య మైంది. నిద్ర నటిస్తున్న ఆకారాలు లేచి కూర్చుని పరీక్షగా చుట్టూ చూశాయి.

సినిమా వదలడానికి ముందే వచ్చి జనం వెళ్ళేవరకూ ఆగారంటే అదంతా ముందే అంచనావేసి వచ్చారు. దొంగతనం చెయ్య డానికి ముందు పరిసరాలను పరిచయం చేసుకోవాలనేది దొంగలు నేర్చుకునే పాఠం. ఎక్కడ ఏముందో, చుట్టుపక్కల ఎవరు నివ సిస్తున్నారో తెలుసుకోవడం అవసరం. విజ యవంతంగా దొంగతనం చేసిన ఇతర రాష్ట్రాల నేరస్తులు దారులు తెలియక దొరికి పోయిన సందర్భాలు అనేకం వున్నాయి.

ఆకారాలు అరుగు దిగి రోడ్డుపైకి వచ్చాయి. దుస్తుల చాటున దాచిన కత్తులు తీసి రోడ్డుదాటి ఒక ఇంటిని సమీపించడం, అవతలిపక్క వెలుగుతున్న స్ట్రీట్‌లైట్ కాంతిలో కనిపించింది. ఆ ఇంటి తలుపు తట్టిన రెండు నిమిషాలకు తెరుచుకుంది.

"అమ్మా..."

బాధతోకూడిన అరుపు ఆ నిశ్శబ్ద నిశీ ధిలో మారుమోగింది.

ఆకారాలు కత్తులు తీసినప్పుడే ద్వివేది భ్రుకుటి ముడివడింది. కూర్చున్న చోటు నుంచి చప్పున లేచాడు. ప్రమాదకరమైన పనుల్లోకి తలదూర్చడం మంచిది కాదనే హెచ్చరిక మనసులోకి ప్రవేశించింది. అయినా కూడా ఆ హెచ్చరిక లక్ష్యపెట్ట కుండా అటువైపు దూసుకుపోతున్నప్పుడు అరుపు వినిపించింది.

ద్వివేది వెళ్ళేసరికి ఒకతను కిందపడు న్నాడు. కత్తిదెబ్బ తిన్నట్టు పొట్టచేత్తో అదు ముకున్నాడు. ఆకారాలు కత్తులు మరోసారి అతనిమీద ప్రయోగించబోతున్నాయి. ద్వివేది అదే ఊపున ముందుకి దూకి ఆ ఇద్దరి షర్టులు వెనకనుంచి పట్టుకుని విసు రుగా లాగాడు. వాళ్ళు తలుపు వరకూ తూలి నిలదొక్కుకుని ఒకేసారి ఇద్దరూ ద్వివేదిపైన దాడిచేశారు.

వాళ్ళు అలాగే కదులుతారని ఊహించిన





ద్వివేది, కత్తివేటు నేర్పుగా తప్పుకుని కుడి కాలు విసిరాడు. బరువైన వస్తువుతో పక్క టెముకలను మోదినట్టు ఆ దెబ్బకి అరుస్తూ గోడను గుద్దుకున్నాడా ఆగంతకుడు. గుండె లపైకి దూసుకొచ్చిన కత్తిని రెప్పపాటులో పక్కకునెట్టి రెండో అతని పొట్టమీద తన్నాడు. అదే సమయంలో గాయపడిన వ్యక్తి తేరుకుని ద్వివేది పక్కకొచ్చి నిలుచు న్నాడు.

పరిస్థితి విషమించిందని గ్రహించి ఆగం తకులు మెరుపులా బయటకు పరిగెత్తారు. ద్వివేది వాళ్ళని అనుసరించి వెళ్ళి ఆ ఇద్దరూ చీకటి సందులో అదృశ్యం కావడం చూసి తిరిగొచ్చాడు.

"పారిపోయారు..." అని చెప్పి ఆ వ్యక్తిని పరిశీలనగా చూశాడు ద్వివేది. పొట్టకి కుడి వైపున కత్తిచేసిన గాయం కనిపిస్తోంది.

"కత్తి కాస్త ఇవతల తగిలితే ప్రాణం పోయేది"

ఆ వ్యక్తి చిన్నగా నవ్వాడు. చెమటలు పట్టిన ద్వివేది మొహం చూసి అడిగాడు.

"మంచినీళ్ళు ఇమ్మంటారా?"

"మర్యాదలు తరువాత... ముందు గాయానికి డ్రెస్సింగ్ చేయించాలి..."

ఇద్దరూ రెండు వీధులు దాటి ఒక డిస్పె న్సరీకి వెళ్ళి డాక్టర్ని లేపారు. రక్తం చూసి అనుమానంగా అడిగాడు డాక్టర్.

"గాయం ఎలా తగిలింది?"

"కత్తితో పొడవడం వల్ల తగిలింది..." బదులిచ్చాడు ద్వివేది.

"అయితే పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళండి..."

"అవసరంలేదు...డ్రస్సింగ్ చెయ్యండి..." చెప్పాడా వ్యక్తి.

"ఈ కేసు నేను చెయ్యకూడదు. స్టేషన్‌కి వెళ్ళి రిపోర్టు ఇస్తే వాళ్ళే ప్రభుత్వ ఆసుప త్రికి పంపి వైద్యం చేయిస్తారు. అసలే ఈ ఏరియా సబ్ ఇన్‌స్పెక్టర్ మంచివాడు కాదు" చెప్పాడు డాక్టర్.

గాయపడిన వ్యక్తివైపు ప్రశ్నార్థకంగా చూశాడు ద్వివేది.

"ఈ ఏరియా సబ్ ఇన్‌స్పెక్టర్ మంచి వాడు కాడని అంత ఖచ్చితంగా మీరెలా చెబుతున్నారు?" ఆ వ్యక్తి డాక్టర్ని అడి గాడు.

డాక్టర్ నిట్టూర్చాడు.

"ఒక రోజు అర్ధరాత్రి కడుపునెప్పితో వచ్చిన పేషెంట్‌కి మా కాంపౌండర్ మాత్రలు ఇచ్చాడు. అలా వైద్యం చెయ్యడం నేరమని అతనిమీద కేసుపెట్టాడు సబ్ ఇన్ స్పెక్టర్. నేను ఫోన్ చేసి రిక్వెస్ట్ చేసినా వినలేదతను. డాక్టర్లకి ఫీజు చెల్లించి వైద్యం చేయించుకోలేని నిరుపేదలు కాంపౌండ ర్లను, నర్సులను ఆశ్రయిస్తారు. మానవతా దృష్టితో మందులిచ్చిన వారిపైన కేసు పెడితే లాభమేమిటి? నేరస్తుల్ని పట్టుకో వడం మానేసి 'పని లేనివాడు పిల్లితల గొరి గినట్టు' మా కాంపౌండర్‌మీద కేసు పెట్టాడు సబ్ ఇన్‌స్పెక్టర్"

డాక్టర్‌వైపు నిదానంగా చూశాడావ్యక్తి.

"బెటాడిన్ టాబ్లెట్ దేనికి ఉపయోగి స్తారు డాక్టర్?" అడిగాడు.

ఆ ప్రశ్నకి డాక్టర్‌తోపాటు ద్వివేది కూడా ఆశ్చర్యపోయాడు.

"స్త్రీలలో ఏర్పడే కొన్ని రకాల ఇన్‌ఫెక్షన్స్ పోవడానికి యోని మార్గంలో ఆ టాబ్లెట్ అమరుస్తారు" చెప్పాడు డాక్టర్.

"మీ కన్సల్టింగ్ ఫీజు ఎంత?"

డాక్టర్ వింతగా చూసి జవాబిచ్చాడు.

"పాతిక రూపాయలు..."

"మీ కాంపౌండర్ మీద పెట్టిన కేసు వివ రాలు చెప్పండి?"

డాక్టర్ తెల్లమొహం వేశాడు. ఆ వ్యక్తి అంతరంగంలో ఏముందో అంతుబట్టలేదు ద్వివేదికి.

"కడుపునెప్పితో వచ్చిన రోగినుండి యాభై రూపాయలు తీసుకుని రోజుకి రెండుసార్లు గ్లాసు మజ్జిగతో మింగమని మీ కాంపౌం డర్ ఇచ్చిన మాత్రల పేరు బెటాడిన్"



షాక్ తిన్నట్లు విభ్రాంతిగా చూశాడు డాక్టర్. ద్వివేది కూడా అతని వైపు విస్మయంగా చూస్తుండిపోయాడు.

"ఈ వివరాలు మీకెలా తెలుసు? " డాక్టర్ అడిగాడు.

"కాంపౌండర్‌మీద కేసుపెట్టిన సబ్ ఇన్‌స్పెక్టర్ని నేనే. నా పేరు సూరి..."

తృళ్ళిపడ్డాడు డాక్టర్.

ద్వివేది మాత్రం వులికిపాటు నేర్పుగా కప్పిపుచ్చుకున్నాడు. ప్రమాదకరమైన పనుల్లోకి తల దూర్చవద్దని మనసు ఎందుకు హెచ్చరించిందో అప్పుడు బోధపడిందతనికి. తొందరగా అక్కడనుంచి తప్పుకోవడం మంచిదని తోచింది. అతని ఆలోచనలు పూర్తికాకముందే సూరి గొంతు వినిపించింది.

"కష్టపడి చదివి డాక్టర్ డిగ్రీ తీసుకున్న మీవద్ద పనిచేస్తూ మందులతో ఏర్పడిన పరిచయంతో ఎలాంటి డిగ్రీ లేకుండా ఇంటి దగ్గర వైద్యం చేస్తారు కాంపౌండర్లు. ప్రజలకు సహాయపడేవారి వల్ల ఎలాంటి ప్రమాదం రాదు. డాక్టర్ దగ్గరనుండి మందులు తస్కరించి రోగంతో సంబంధం లేకుండా అమ్ముకునే కాంపౌండర్లనుండే ప్రమాదం అంతా. ప్రజల ప్రాణాలతో చెలగాటమాడే వ్యక్తిని వదిలేయమని మీరు ఫోన్ చేశారు"

డాక్టర్ తేరుకోవడానికి రెండు క్షణాలు పట్టింది.

"అయామ్ సారీ" అన్నాడు.

"ఇట్సాల్‌రైట్"

డాక్టర్ మాట్లాడకుండా యాంటీ టిటనస్ సీరమ్ సిరంజ్‌లో లోడుచేసి ఇంజక్షన్ చేశాడు. గాయం శుభ్రం చేసి కట్టుకట్టి చెప్పాడు,

"రేపొచ్చి డ్రస్సింగ్ మార్పించుకుని ఇంజక్షన్ చేయించుకోండి"

"థాంక్యూ వెరీమచ్" కృతజ్ఞతలు చెప్పి డాక్టర్ వారించినా వినకుండా ఫీజు చెల్లించి బయటకొచ్చాడు సూరి.

"మీ పేరు? " పక్కన నడుస్తున్న ద్వివేదిని అడిగాడు.

"ద్వివేది మజుందార్"

"ఈరోజు మీరు నా ప్రాణాలు రక్షించారు. నా తల్లికి జన్మదిన శుభాకాంక్షలు తెలియజెయ్యడానికి ప్రాణాలతో వున్నానంటే అది మీ చలవే. మీ రుణం తీర్చుకునే అవకాశం ఆ భగవంతుడు నాకిస్తాడని నమ్ముతున్నాను"

"మీలాంటి అధికారికి సహాయపడే అవకాశం ఇచ్చి ఆ భగవంతుడు నాకు మేలుచేశాడు" ద్వివేది అన్నాడు.

సూరిని ఇంటివద్ద వదిలి రైల్వేస్టేషన్ వైపు బయలుదేరాడు ద్వివేది. కొంతదూరం వెళ్ళి ఆగి సిగరెట్ ముట్టించుకుని అడుగులు వెయ్యసాగేడు. పాడుపడిన ఇల్లు చేరుకోవడానికి పదిహేను నిముషాలు పట్టింది. తలుపుమూసి నిశ్శబ్దంగా కిటికీ వైపు కదిలాడు. ఓ రెక్క చప్పుడు కాకుండా తెరిచి బయటకు చూశాడు.

వెక్కిరిస్తున్నట్టు నిర్మానుష్యంగా కనిపించింది నడిచివచ్చిన మార్గం!

అనవసరంగా తను అనుమానాలు పెంచుకుంటున్నాడా?

ఆ సందేహానికి జవాబుగా తల అడ్డంగా కదిలించాడు. ఎవరో చాకచక్యంగా తనని అనుసరిస్తున్నారనడంలో ఎలాంటి అనుమానంలేదు. కొవ్వొత్తి వెలిగించే ప్రయత్నం చెయ్యకుండా అలాగే మంచంపైన వాలిపోయాడు.

వెంటనే నిద్రపట్టింది.

★ ★ ★

రిసీవర్ పెట్టేసి విస్కీబాటిల్ ఎత్తి గడగడా రెండు గుక్కలు తాగాడు బెహరా. హత్యాప్రయత్నం విఫలమైందనే వార్త విని కంట్రోలు తప్పాడు. వృత్తిలో ఎన్నడూ తగలని ఎదురుదెబ్బ అది. అప్పుడు మూడు గంటలైంది సమయం. బెహరా ధోరణి





మారడం గమనించి అడిగాడు నిహ్లాని.

"ఏం జరిగింది? "

"ఈసారి కూడా అతను తప్పించుకున్నాడు"

"ఎలా? "

"తలుపు తెరిచిన సబ్ ఇన్స్పెక్టర్ సూరిని మనవాళ్ళు పొడిచారట. పక్కకి తప్పుకోవడంతో గాయపడి వెనక్కి పడిపోయాడు. మళ్ళీ పొడవాలనుకుని ముందుకెళ్ళిన సమయంలో ఎవడో వెనుక నుంచి దాడిచేశాడట. డాక్టర్ దగ్గరకు వెళ్ళి ఇప్పుడే రూమ్‌కి సూరి వచ్చాడట. ఇప్పుడు నేను వెళ్ళి వాడిని హతమారుస్తాను" చెప్పి రివాల్వర్ బయటకు తీసి మెగ్జిన్ చెక్ చేశాడు.

"వద్దు" సాలోచనగా అన్నాడు నిహ్లాని.

ప్రశ్నార్థకంగా చూశాడు బెహరా.

"ఇప్పటికి రెండుసార్లు అతను తప్పించుకున్నాడు. అంటే ఈరోజు అతన్ని మనం ఏమీ చెయ్యలేము. తాగిన మత్తులో నువ్వెళ్ళినా పని కాదు" అని రెండు క్షణాల తరువాత "కేసు వాయిదాపడితే మనకి మరింత సమయం లభిస్తుంది కదా" అన్నాడు.

అతని మనసులో ఏదో ఆలోచన రూపుదిద్దుకుందని గ్రహించి అంగీకారంగా తలూపాడు బెహరా.

జేబులోంచి సెల్ తీసి ఒక నెంబరు డయల్ చేసి మాట్లాడసాగాడు నిహ్లాని. అతను మాట్లాడే భాష ఏమిటో బెహరాకి అర్థంకాలేదు. ఓనిముషం తరువాత సెల్ క్లోజ్ చేసి చెప్పాడు.

"కాసేపు వెయిట్ చేద్దాం"

బెహరా సీసాలోని విస్కీ పూర్తిచేసి సిగరెట్ వెలిగించాడు. ఆ వాసనకి వూపిరి సలపనట్టు లేచి కిటికీ దగ్గరకు వెళ్ళాడు నిహ్లాని. తెల్లవారుజామున వీచే చల్లటిగాలి మొహానికి తగిలింది.

సబ్ ఇన్స్పెక్టర్ సూరి!

కొడుకుని రక్షించుకోవడానికి బెహరాని కాంటాక్ట్ చేశాడు తప్ప సూరిమీద ఎలాంటి ద్వేషం లేదతనికి! బరంపురంలో నివసించే పౌరునిగా, అతని స్టేషన్ పరిధిలోని ఒక వ్యాపారిగా సూరి గురించి తెలుసు. గతంలో ప్రతీ వ్యాపారి పోలీస్‌స్టేషన్‌కి మామూలు కింద కొంత సొమ్ము చెల్లించాల్సివచ్చేది. సూరి ఆ స్టేషన్‌కి వచ్చిన తరువాత అలాంటి పద్ధతులు పోయాయి. నిజాయితీ విలువ నిహ్లానికి తెలియనిదేం కాదు.

అతని ఆలోచనలు చెదరగొడుతూ సెల్ మోగింది. ఓ నిముషంపాటు మాట్లాడి సెల్ జేబులో పెట్టుకుని బెహరాతో చెప్పాడు.

"కేసు వాయిదా పడుతుంది"

"ఏ విధంగా? "

"కొన్ని విషయాలు ముచ్చటించకుండా వుంటేనే బాగుంటుంది. ఈ వ్యవస్థ మీద ఆ మాత్రం గౌరవం కూడా పోతే బతకలేం" నవ్వి అన్నాడు.

కేసు వాయిదా పడుతుందని తెలిసేసరికి బెహరా టెన్షన్ తగ్గింది. నిహ్లాని వెళ్ళిపోయిన కొంతసేపటికి రూమ్ ఖాళీ చేశాడతను.

★ ★ ★

ఐదు గంటలకు అలారమ్ మోగింది.

బద్ధకంగా కదిలి అటు తిరిగి పడుకున్నాడు సూరి. పొట్టపైన తగిలిన కత్తి గాయం బాధ తెలుస్తోంది. ప్రతి రోజూ ఆ సమయానికి నిద్రలేచి గ్రౌండ్‌కి వెళతాడు. ఆరోజు వెళ్ళాలనిపించలేదు.

రాత్రి రెండు గంటలవరకూ డ్యూటీ చేసినప్పుడు కూడా తోటి అధికారులు పెరేడ్ గ్రౌండ్‌కి ఆయాసపడుతూ వస్తుంటే, అప్పటికే గ్రౌండ్‌లో వుంటాడు సూరి. అతను వృత్తిని ప్రేమిస్తాడు, గౌరవిస్తాడు. సర్వీస్ కొంచెమే అయినా చాలా స్టేషన్లలో పనిచేసిన అనుభవముంది. ముక్కు సూటిగా నడిచే స్వభావంవల్ల ఎక్కడా ఎక్కువ రోజులు వుండలేదు.

పైఅధికారులు పనిగట్టుకుని ట్రాన్స్‌ఫర్

చేయించిన సందర్భాలు అనేకం. అవినీతి, పక్షపాతం అతనికి శత్రువులు. కోటీశ్వరుడు స్టేషన్‌కొచ్చినా, కూటికి గతిలేనివాడు వచ్చినా ఒక్కలాగే చూస్తాడతను. ఎక్కడ పనిచేసినా మంచి పేరు సంపాదించుకుంటాడు. అది సహించలేని పై అధికారులు బదిలీకి రికమెండ్ చేస్తారు.

సూరి పని చేస్తున్న స్టేషన్ నుండి కోర్టు కెళ్ళిన కేసు కొట్టివేయడం అనేది అరుదు. దర్యాప్తుచేసి ఛార్జిషీట్ పకడ్బందీగా సమర్పిస్తాడు. ఎవరైనా వ్యక్తి బరంపురం బంధువుల ఇంటికొస్తే, వెళ్ళేటప్పుడు సూరి గురించి తెలుసుకుని మరీ వెళతాడనడంలో అతిశయోక్తిలేదు.

అతని గురించి స్పష్టంగా అందరికీ తెలియడానికి కారణమైన ఓ కేసు గురించి ప్రముఖంగా చెప్పుకుంటారు ప్రజలు.

ఒకరోజు గ్రౌండ్‌కి వెళ్ళి ఏడుగంటలకు ఎప్పటిలా ఇంటికొచ్చాడు సూరి. గేటువద్ద ఇద్దరు స్త్రీలు నిలుచుని వుండడం దూరం నుంచే గమనించాడు. ఒకామెకి వయసు యాభై. మరొకామెకి పాతిక సంవత్సరాలు వుంటుంది. దగ్గరనుంచి చూస్తే ఇద్దరూ తల్లీ కూతుళ్లని అర్థమవుతుంది.

"ఎవరికోసం వచ్చారు?" వాళ్ళని అడిగాడు సూరి.

"ఇక్కడ సబ్ ఇన్‌స్పెక్టర్ సూరి వుంటున్నారట. వారిని కలవాలని వచ్చాం" చెప్పింది పెద్ద వయసు స్త్రీ.

"నేనే సూరిని..."

ఆమె నమస్కారం చేసింది..."మీతో మాట్లాడాలి"

"రిపోర్టు ఇవ్వడానికొచ్చారా?"

ఆమె తలూపింది. పక్కన వున్న యువతి మొహం పీక్కుపోయి, బుగ్గలమీద కన్నీటి చారలు కనిపిస్తున్నాయి. వాళ్ళు ఏదో కష్టంలో వున్నారని గ్రహించాడు.

"స్టేషన్‌లో రిపోర్టు ఇస్తే నేను వచ్చి చూస్తాను..." చెప్పాడు, ఆ కాస్త వ్యవధిలో స్నానం చెయ్యవచ్చుననే ఆలోచనతో.

"ఆలస్యంచేస్తే సాక్ష్యాలు లభించవు" నమ్రతగా అందామె.

మారుమాట్లాడకుండా తాళం తీసి వాళ్ళిద్దర్నీ లోపలికి పిలిచాడు.

"నా పేరు సావిత్రి, ఇది నా కూతురు సంధ్య" పరిచయం చేసుకుని రెండు క్షణాలు మౌనంగా, చెప్పదల్చుకున్న విషయానికి మాటలు పోగుచేసుకుంటున్నట్టు వుండిపోయిందామె.

రాత్రి పదకొండు గంటలకు పక్కపోర్షన్‌లో అద్దెకుంటున్న వ్యక్తి సావిత్రిని నిద్రలేపి చెప్పాడు.

"నీకు ఫోనొచ్చిందమ్మా!"

తనకి ఆ సమయంలో ఫోను చేసిందెవరో అర్థంకాక ఆశ్చర్యపడిందామె. వేగంగా నడవాలనుకున్నా కాళ్ళు సహకరించకపోవడంతో నెమ్మదిగానే వెళ్ళి రిసీవర్ తీసుకుంది.

"హల్లో..." అంది.

రెండుక్షణాలు నిశ్శబ్దం.

"సంధ్యని..." కూతురు గొంతు నెమ్మదిగా వినిపించింది.

ఆ గొంతులో గూడుగట్టిన దుఃఖాన్ని సావిత్రి మనసు గుర్తుపట్టింది. ఎంతో అవసరమైతే తప్ప ఆ సమయంలో ఫోను చెయ్యదు.

"ఎలా వున్నావు తల్లీ?" ఆప్యాయంగా అడిగింది.

"మమ్మీ! అయామ్ ట్రాప్డ్" గద్గదంగా వినిపించింది గొంతు.

"ఏమయిందమ్మా?" మనసులోని ఆందోళన మాటల్లో వ్యక్తం కాకుండా జాగ్రత్తపడి ప్రశ్నించింది.

కూతురు చెబుతున్న విషయం వింటున్నప్పుడు ఆమె మొహం బాధతో ముడుచుకుపోయింది. గుండె పగిలే ఆ విషయం జీర్ణించుకోలేక బలహీనమైన గుండె ఓ క్షణం ఆగి కొట్టుకోసాగింది. రిసీవర్ పట్టుకున్న





చెయ్యి స్వల్పంగా వణుకుతోంది. మనసులోని బాధకి గుర్తుగా కళ్ళల్లో నీళ్ళు వస్తున్నా శక్తి మొత్తం కూడదీసుకుని నిగ్రహించుకుంది.

"నువ్వు అనవసరంగా వర్రీకాకు" అని ఫోన్ యజమాని లేడని నిర్ధారించుకుని ఏం చెయ్యాలో చెప్పి ఫోన్ కట్ చేసింది.

రెండు క్షణాలు ఆలోచించి రైల్వేస్టేషన్‌కి, బస్‌స్టాండ్‌కి ఫోను చేసి ఆ సమయంలో బరంపురం వెళ్ళడానికి ఏమున్నాయో తెలుసుకుంది. ఫోన్ యజమానిని పిలిచి తలుపు వేసుకోమని చెప్పి తన పోర్షన్‌లోకి వచ్చింది. సంచిలో జతబట్టలు వేసుకుని బస్‌స్టాండ్ చేరుకుంది.

సావిత్రి భర్త మరణించాడు. ఇంటి నిర్మాణంకోసం చేసిన అప్పును, చదువుకుంటున్న కూతుర్ని మిగిల్చిపోయాడతను. ఇంట్లో కొంత భాగం అద్దెకిచ్చి, శుభకార్యాలకు వంటలు చేసి అప్పు తీరుస్తూ కూతుర్ని డిగ్రీ చదివించిందామె. తల్లి పడుతున్న కష్టం గమనించిన సంధ్య డిగ్రీ చేతికొచ్చిన వెంటనే ఉద్యోగప్రయత్నం మొదలుపెట్టింది. బరంపురంలోని ఓ తేయాకు సప్లై కంపెనీలో టైపిస్టుగా సెలెక్ట్ అయింది. తల్లిని వదిలిపెట్టి వెళ్ళడానికి సందేహిస్తుంటే సావిత్రి ప్రోత్సహించి ఉద్యోగానికి పంపింది.

బరంపురంలో చిన్న గది తీసుకుని ఉద్యోగంలో చేరింది సంధ్య. ఎక్కువ జీతం వచ్చే ఉద్యోగంకోసం అప్లికేషన్లు పంపసాగింది. భార్య మరణించిన ఓ బిజినెస్‌మాన్ కొడుకుని చూసుకోవడానికి మంచి నడతగల చదువుకున్న యువతి కావాలనే ప్రకటన ఒకటి పేపరులో చూసి అప్లై చేసింది.

పదిరోజుల తరువాత కాల్ లెటరు వచ్చింది. ఆదివారం ఒక హోటల్లో జరిగిన ఇంటర్‌వ్యూకి పదిమందితో పాటు హాజరైంది సంధ్య. బస్‌స్టాప్ దగ్గర పరిచయమైన ఓ యువతి కూడా ఆ ఇంటర్‌వ్యూకి రావడంతో సంతోషించింది. ఇద్దరూ పక్కపక్కనే కూర్చుని ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నారు.

ఒకేవ్యక్తి చేసిన ఆ ఇంటర్‌వ్యూ సాయంకాలం నాలుగు గంటలకు ముగిసింది. సంధ్యని ఎన్నికచేసినట్టు ఆ వ్యక్తి తెలియజేశాడు. స్నేహితురాలు అభినందనలు చెబుతుంటే తన ఆర్థిక సమస్యలు తీరిపోయినట్టు భావించింది సంధ్య.

మరునాడు వుద్యోగంలో చేరాలని, తన ఇల్లు చూపించి ఏఏ బాధ్యతలు నిర్వర్తించాలో వివరిస్తానని అతను చెప్పాడు. సంధ్య కోరిక కాదనలేక స్నేహితురాలు కూడా వాళ్ళతో బయలుదేరింది. కటక్ వెళ్ళే దారిలో ఒక తోటలోకి ప్రవేశించింది వాళ్ళు ప్రయాణిస్తున్న కారు.

"మీ హౌస్ సిటీకి చాలా దూరం" అతనితో అంది స్నేహితురాలు.

అతను బదులుగా నవ్వాడు. ముప్పై దాటివుంటుంది వయసు. మంచి పర్సనాలిటీతో హుందాగా వున్నాడు.

"ఇది రెసిడెన్స్ కాదు, ఫాం హౌస్. వాచ్‌మాన్‌తో మాట్లాడేపనుంది" కారు ఆపి చెప్పాడతను.

"మీరు లోపలకు వెళ్ళి కూర్చోండి. నేను ఓసారి తోట చూసి వాచ్‌మాన్‌తో మాట్లాడి వస్తాను. జస్ట్ కాఫీ తీసుకుని వెళ్ళిపోదాం. నేను తీసుకురాబోయే మనిషిని చూడాలని ఇంటివద్ద నా కొడుకు ఆత్రంగా ఎదురు చూస్తుంటాడు. డబ్బు, పలుకుబడి వున్నా వాడికి తోడులేదు. ధనం అన్నీ సమకూరుస్తుందనుకుంటారు కాని మనశ్శాంతిని ఇవ్వలేదు. ఆ పని డబ్బు ఎందుకు చెయ్యలేదో చెప్పగలరా? "

ఆ ప్రశ్న తనని వుద్దేశించి అడగడంతో తల అడ్డంగా వూపింది సంధ్య.

"డబ్బుని మనం సృష్టిస్తే, మనసుని భగవంతుడు సృష్టించాడు కాబట్టి" అని తోట వైపు సాగిపోయాడు.



అతన్నే చూస్తుండిపోయింది సంధ్య.

"రా.." స్నేహితురాలి పిలుపు విని కదిలింది.

బయటకు మామూలుగా కనిపిస్తున్నా లోపల ఖరీదైన పర్నిచర్‌తో గెస్ట్‌హౌస్ మాదిరిగా వుంది అక్కడి వాతావరణం. అమర్చిన ప్రతి వస్తువు ఆ వ్యక్తి ఐశ్వర్యాన్ని సూచిస్తున్నాయి.

ఇద్దరూ సోఫాలో కూర్చున్నారు.

ఒక వృద్ధుడు ట్రేతో రెండు కప్పులు తెచ్చి చెరొకటి ఇచ్చి, ఫ్యాన్ స్విచ్ నొక్కి వెళ్ళిపోయాడు.

కాఫీ తాగి కప్పు టీపాయ్‌మీద పెట్టి రిలాక్స్‌గా వెనక్కి వాలి పైన వేలాడుతున్న షాండ్లియర్‌వైపు కొద్దిసేపు చూసి కళ్ళు మూసుకుంది సంధ్య. ఇప్పుడు చేస్తున్న ఉద్యోగంవల్ల వచ్చే జీతంలో పదిశాతం మిగల్చడం కష్టమవుతోంది. ఉచిత వస్తువులు, భోజన సదుపాయం వుంటుంది కాబట్టి ఈ ఉద్యోగంలో తొంభైశాతం జీతం మిగులుతుంది. మొదటి నెల జీతంతో తల్లిని ఆశ్చర్యచకితురాల్ని చెయ్యాలి.

ఆలోచించడం మాని కళ్ళు తెరిచింది.

చిక్కటి చీకటి,

హటాత్తుగా చీకటెలా వచ్చింది? అక్కడకొచ్చినప్పుడు ఇంకా చీకటి పడలేదు. ఆలోచనల్లో తేలిపోతూ తను మొద్దులా వుండిపోయిందా? చిన్న అలికిడి కూడా వినిపించడంలేదు. ఒకవేళ తను నిద్రపోయినా స్నేహితురాలు లేపుతుంది కదా? గొంతు తడారిపోయినట్టు శరీరమంతా చెమటతో తడిసిపోయినట్టు, ఎక్కడలేని నిస్సత్తువ ఒంట్లోకి ప్రవేశించినట్టు అనిపించింది. చెయ్యి గుండెలమీద వేసుకుని షాక్ కొట్టినట్టు లేచి కూర్చుంది.

బట్టలేమయ్యాయి?

తను పరుపుమీదకెలా వచ్చింది?

ఏం జరిగిందో అర్థమయ్యేసరికి నిశ్చేష్టురాలయింది.

దుఃఖం గుండెని పిండేస్తుంటే బలవంతంగా నిగ్రహించుకుని మంచం దిగింది. బట్టలు కాళ్లకి తగిలాయి. వాటిని శరీరానికి అడ్డదిడ్డంగా చుట్టుకుని తడుముకుంటూ బయటకొచ్చింది. కన్ను పొడుచుకున్నా కనిపించని గాఢాంధకారం. గొంతెత్తి సహాయం కోసం అరవబోయి సందేహంతో ఆ ప్రయత్నం విరమించుకుంది.

గేటు దాటి రోడ్డు చేరుకుంది.

దూరంగా బరంపురంలోని దీపాలు కనిపించాయి. అటువైపు అడుగులు వెయ్యసాగింది. తనని దాటుకుపోతున్న వాహనాలను పట్టించుకోకుండా సాగిపోతోంది. చీకటిలో దెయ్యంలా సంచరించే మగవాడి నిజస్వరూపం స్పష్టంగా చూపించే దీపాలు ఎదురుగా వున్నట్టు, ఎలాగైనా వాటిని చేరుకోవాలనే తలంపు పుట్టినట్టు అడుగులు వేస్తోంది.

సిటీ చేరుకోవడానికి ఎంతసేపు నడిచిందో తెలియదు. ఒకచోట యస్.టి.డి. బూత్ కంటపడి లోపలకు వెళ్ళింది. ఆశ్చర్యపోతున్న అటెండెంట్‌ని పట్టించుకోకుండా భువనేశ్వర్ రింగ్ చేసి తల్లితో మాట్లాడింది. రిస్ట్‌వాచ్‌లో టైమ్ చూసుకుని, దానిని అటెండెంట్‌కిచ్చి డబ్బులు తీసుకుని ఆటోలో రూమ్ చేరుకుని అలాగే కుర్చీలో వాలిపోయింది.

అదంతా ఎలా జరిగిందో, ఎందుకు జరిగిందో తెలియదు. కాని తను శీలం పోగొట్టుకున్నానని గ్రహించి కుళ్ళికుళ్ళి ఏడవసాగింది. ఆమె ఏడ్పు చల్లారకముందే తెల్లవారిపోయింది.

తలుపు చప్పుడు విని వెళ్ళి తీసింది.

గుమ్మం బయట చీకటిని పారదోలుతున్న తొలి వెలుగులో నవమాసాలు మోసిన తల్లి కనిపించింది. భోరున విలపిస్తూ ఆమె గుండెలపైన వాలిపోయింది సంధ్య.

ధైర్యం చెబుతున్నట్టు కూతురి వీపు




# రచయితలకు మనవి



★ ‘చతుర’లో నవలకు వేసే చిత్రాలు, ‘చతురకతలు’, ‘చతుర ప్రపంచం’వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని ‘చతుర’కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు ‘చతుర’కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల ‘చతుర’లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**‘ఈనాడు’ కాంపౌండ్ హైదరాబాద్-500 482.**

# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలుబడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీ లోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంప్లెక్స్, హైదరాబాదు-500 082 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రూ.100/- ప్రథమ బహుమతి, రూ. 75/- ద్వితీయ బహుమతి, రూ. 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఫిబ్రవరి **చతుర** నవల **పథకం**

సమీక్షకుని పేరు : ____________________

చిరునామా ____________________

____________________

____________________

తట్టింది అప్పుడే బస్సు దిగి వచ్చిన సావిత్రి.

★ ★ ★

తను స్నానం చెయ్యాలనే విషయం మర్చిపోయి, వెంటనే వాళ్ళని తీసుకుని ఫాంహౌస్‌కి వెళ్లాడు సబ్ ఇన్‌స్పెక్టర్ సూరి.

సంధ్యకి కాఫీ ఇచ్చిన వృద్ధుడ్ని అదుపులోకి తీసుకున్నాడు. సోఫాలో బ్యాగ్, సర్టిఫికెట్స్ ఫైల్ వున్నాయి. టీపాయ్‌మీద ఖాళీ కప్పులు దొరికాయి. వృద్ధుని నుండి రాబట్టిన సమాచారం ప్రకారం ఆ ఫాంహౌస్ మరొకరిది. వృద్ధునికి డబ్బిచ్చి అమ్మాయిని తీసుకొచ్చాడతను. తోటలోకి వెళ్ళినట్టు నటించి వెనుకనుంచి కిచెన్‌లోకి ప్రవేశించాడు. కాఫీలో తెల్లటి పొడరు కలిపి అది సంధ్యకి ఇమ్మని చెప్పాడు. అతను చెప్పినట్టు చేసి వృద్ధుడు డబ్బులు తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

ఇంటర్‌వ్యూ నిర్వహించిన హోటల్‌కి వెళ్ళి ఆదివారం రూమ్ తీసుకున్న వ్యక్తి చిరునామా తీసుకుని నిద్రలేవకముందే అతన్ని అరెస్ట్ చేశాడు సూరి. సంధ్యతోపాటు ఫాంహౌస్‌కి వెళ్ళిన యువతిని పట్టుకుని తీసుకొచ్చేసరికి మధ్యాహ్నం అయింది.

స్నానంచేసి టీతాగి ఇంటరాగేషన్ ప్రారంభించాడు. విభ్రాంతికరమైన వాస్తవాలు ఇంటరాగేషన్‌లో వెలుగు చూశాయి.

ఒకరోజు రోడ్డుమీద పోతూ బస్‌స్టాప్‌లో నిలుచున్న సంధ్యని ఆ వ్యక్తి చూశాడు. ఆమె అందం అతని మతిపోగొట్టింది. ఎలాగైనా ఆమెని పొందాలని నిర్ణయించుకున్నాడు. తన ప్రియురాలికి ఆమె గురించి చెప్పి పరిచయం చేసుకోమని పురమాయించాడు. సంధ్యని బస్‌స్టాప్‌లో పరిచయం చేసుకుందామె.

సంధ్య పరిస్థితి తెలుసుకుని ఆకర్షణీయమైన ప్రకటన ఒకటి పేపరులో ఇచ్చాడు. సదరు ప్రకటన సంధ్య చూస్తుందో లేదో అనే సందేహంతో ప్రియురాలి ద్వారా తెలిసే ఏర్పాటు చేశాడు. అనుమానాలకు తావులేకుండా ఇంటర్‌వ్యూకి పదిమందిని పిలిచి సంధ్యని ఎన్నిక చేశాడు. అదంతా తనకోసమే సిద్ధంచేసిన బలమైన వల అని తెలియని సంధ్య తేలిగ్గా చిక్కుకుపోయింది.

సంధ్య వేలిముద్రలున్న కాఫీ కప్పులో మత్తుమందు కలిసిందని కెమికల్ రిపోర్టులో తేలింది. తిరుగులేని సాక్ష్యాలు సమర్పించడంవల్ల ఆ వ్యక్తికి ఏడు సంవత్సరాలు, సహకరించిన ఇద్దరికీ చెరోమూడు సంవత్సరాలు శిక్ష పడింది.

సావిత్రి కృతజ్ఞతలు చెప్పినప్పుడు సూరి అన్నాడు.

"ఈ కేసులో నేను చేసింది చాలా స్వల్పం. జరిగిన దానికి కృంగిపోయి ఇంట్లో కూర్చుని దుఃఖించకుండా ఓ తల్లిగా మీరు చూపిన తెగువ, సమయస్ఫూర్తి తక్కువ వ్యవధిలో నేరస్తులు దొరకడానికి కారణం. మీవంటి స్త్రీ మూర్తికి చేతులెత్తి నమస్కరించాలి"

ఆ మాటలకు తన పెద్దపెద్ద కళ్ళతో మొదటిసారి సబ్ ఇన్‌స్పెక్టర్ సూరిని చూసింది సంధ్య.

ఆ కేసు బరంపురంలో సంచలనం కలిగించింది. తీర్పు చెప్పిన మెజిస్ట్రేట్ దర్యాప్తు అధికారిని ప్రత్యేకంగా అభినందించాడు. ఒక పోలీసు ఆఫీసర్‌కి ప్రజలు బ్రహ్మరథం పట్టడం అక్కడ పోలీసు డిపార్ట్‌మెంట్ చరిత్రలో అదే ప్రథమం.

★ ★ ★

ఫోన్ చెయ్యాలని గుర్తొచ్చి మంచం దిగి బయటకొచ్చాడు సూరి.

చీకటి పల్చబడి ఆకాశం తెల్లగా కనిపిస్తోంది. జన సంచారం మొదలయిన దానికి గుర్తుగా అక్కడక్కడా మనుషులు తిరుగుతున్నారు. సెంటర్‌లోని టెలిఫోన్‌బూత్‌లోకి ప్రవేశించాడు సూరి. రక్తంతో తడిసిన బట్టలు విప్పేయడంవల్ల గాయం తగిలినట్టు పైకి కనిపించడంలేదు. అటెండెంట్ విష్ చేశాడతన్ని. చిరునవ్వుతో తలూపి రిసీవర్

అందుకుని నెంబరు డయిల్ చేశాడు సూరి

రింగయిన మరుక్షణం ఫోన్ లిఫ్టయింది సూరి కళ్ళు సంతోషంతో మెరిశాయి ప్రత్యేక రింగ్ సిస్టమ్‌వల్ల అది యస్.టి.డి కాల్ అని అవతలి వారికి తెలుస్తుంది ఆ కాల్ కోసమే నిరీక్షించడంచేత మొదటి రింగ్‌కే రిసీవర్ ఎత్తారు.

"హల్లో..." తల్లి గొంతు వినిపించింది

"హ్యాపీ బర్త్‌డే మమ్మీ!"

"థాంక్యూమై బాయ్..." ఆమె గొంతులో వాత్సల్యం.

వారానికి ఒకసారి మాట్లాడకపోతే తల్లి ఆందోళన పడుతుందని తెలుసు. అందుకే సరిగ్గా సమయానికి ఫోనుచేస్తాడు.

"డాడీ లేచారా మమ్మీ?"

"నా పక్కనే వున్నారు. రిసీవర్ ఇమ్మని మోచేత్తో పొడుస్తున్నారు"

నవ్వాడు సూరి. తల్లిదండ్రుల మధ్య కనిపించే ఆత్మీయత చూసి ఆశ్చర్యపోతాడు. కాసేపు తల్లి కనపడకపోతే,

"మమ్మీ ఏదిరా?" అడుగుతాడు తండ్రి.

వంటగదిలో వున్నదని చెబితే ఏదో ముఖ్యమైన పని వున్నట్టు లోపలకు వెళతాడు.

కాసేపాగి తను వెళ్ళి చూస్తే పీటవాల్చుకుని కూర్చున్న తండ్రి కనిపిస్తాడు. భార్యని వదిలి అరగంట వుండలేడు. మరి ఆఫీస్‌లో పని ఎలా చేస్తాడో బోధపడదు.

తల్లి కూడా అంతే.

"డాడీ ఎక్కడున్నార్రా?" ప్రశ్నిస్తుంది. గార్డెన్‌లో కూర్చుని పేపరు చదువుతున్నారని చెబితే గబగబా అక్కడకు వెళుతుంది.

"మీరిక్కడుంటే నాకెవరు సాయం చేస్తారు?" అడుగుతుంది.

ఇంతకీ ఆయన చేసే సాయం ఏమిటయ్యా అంటే, వంట గదిలో ఆమె కెదురుగా పీట వాల్చుకుని కూర్చోవడం. ఆ పని చేసినందుకు అప్పుడప్పుడూ ఆయనకి టీ అందించాలి. మనుషుల మధ్య ఆత్మీయత వెల్లడించే విషయాలు చిన్నవి. వాటిలోని గాఢత కళ్లతో కాకుండా మనసుతో పరికించాలి.

తల్లిదండ్రులు తనని నాయనమ్మ వద్ద వదలడానికి ఎంత మథనపడ్డారో అంచనాకి దొరికేది కాదు. తల్లికిచ్చిన మాటకి కట్టుబడిన తండ్రికంటే ఆ నిర్ణయాన్ని గౌరవించిన తల్లి వ్యక్తిత్వం మరింత వున్నతమైందని గ్రహించకపోలేదు సూరి. అతనికి ఉద్యోగం వచ్చిన కొత్తలో నాయనమ్మ చనిపోయింది. రెండు నెలలు శెలవు తీసుకొని తల్లిదండ్రులు సూరిని అంటిపెట్టుకుని వున్నారు. అప్పుడే వారి గురించి వివరంగా తెలుసుకోవడం సాధ్యమైందతనికి.

"ఎలావున్నావురా?" తండ్రి అడిగాడు.

"బాగున్నాను... మీరు శనివారం వస్తున్నారా?"

"లేదు... ఆదివారం ఓ మిత్రుడు తిరుపతిలో కూతురు మేరేజి చేస్తున్నాడు. మేము వెళ్ళకపోతే బాధపడతాడని రెండు బెర్తులు తీసుకున్నాను. పైగా తిరుపతి వస్తానని మీ మమ్మీ మొక్కుకుందిట. ఒకరోజు ముందు వెళితే ఆ పని కూడా అవుతుందని శుక్రవారం రాత్రికి రిజర్వు చేయించాను. అది సరే... సంబంధాలు వస్తున్నాయి, పిల్లని చూడడానికి రమ్మంటున్నారు..."

"నన్ను కట్టిపడేయాలనుకుంటున్నారు?"

తండ్రి పకపకా నవ్వాడు.

పెళ్ళి చేసుకోకపోతే జీవితంలో ఎంతో సాధించేవాడినని తరుచుగా పరిచయస్తులకు చెప్పి విచారిస్తుంటాడాయన. స్కూల్లో అతను వేసిన బొమ్మకి బహుమతి వచ్చిందట. అది కంటిన్యూ చేసివుంటే పికాసో అంతటి వాడినయ్యేవాడినని చెబుతుంటాడు. ఆ ధోరణిని ఇప్పుడు కొడుకు ఇలా కొనసాగించేసరికి నవ్వొచ్చింది తండ్రికి.

"పెళ్లి చేసుకోవడం అనేది మగవాడిని కట్టిపడేయడం అనడంలో ఎలాంటి సందేహం పెట్టుకోకు. కాని పెళ్లి చేసుకోక




పోతే ఏకాకిగా మిగిలిపోతావని కూడా మర్చిపోకు..."

"తొందరేముందిలెండి..." అని తల్లితో మరోసారి మాట్లాడి రిసీవర్ పెట్టేశాడు.

ఉత్సాహంగా నాలుగడుగులు వేసిన తరువాత రాత్రినుంచి కలవరపరుస్తున్న ప్రశ్న తిరిగి బుర్రలో ఉదయించింది.

తనమీద హత్యాప్రయత్నం చేసిందెవరు?



ఉదయం రైల్వేస్టేషన్ దగ్గరకొచ్చాడు ద్వివేది. రైల్వేకూలీలు, రిక్షాకార్మికులు ఒక తోపుడుబండి చుట్టూచేరి అక్కడ లభించే అతిచౌక ఆహారపదార్థాలు ఆరగిస్తున్నారు. బిజీగా వున్న బండి అతను ద్వివేదిని పలకరించాడు.

"ఎప్పుడొచ్చావ్?"

"నిన్న"

"టిఫిన్ ఇమ్మంటావా?"

అందుకే వచ్చినట్టు తలూపాడు ద్వివేది.

అక్కడ వున్న చాలామంది అతన్ని పలకరించారు. వాళ్ల మాటల్లో అతనిమీద అభిమానం వ్యక్తమవుతోంది. నంబియార్ సామ్రాజ్యంలో వాళ్ళందరూ సభ్యులు. ఎలాంటి కష్టమొచ్చినా నంబియార్‌కి చెప్పుకుని సహాయం పొందేవారు. తాగివచ్చి అల్లుడు కూతుర్ని కొట్టినా, కట్నం చాలక పెళ్లి మధ్యలో ఆగిపోయినా వెళ్లి పరిష్కరించేవాడు. నంబియార్ దొంగతనాలు చేస్తాడని, ఆదాయంలో అధిక మొత్తం తమని ఆదుకోవడానికి ఉపయోగిస్తాడని వాళ్ళకి తెలియదు. అతను పోయిన తరువాత ముళ్లకిరీటం వంటి ఆ బాధ్యత చాలాకాలం ద్వివేది నిర్వహించాడు.

బండియజమాని ఆకుతో ఇచ్చిన టిఫిన్ తినడం ప్రారంభించాడు ద్వివేది. రోజూ ఉదయం అక్కడ టిఫిన్ తినే అలవాటుతోపాటు నంబియార్ లక్షణాలు కొన్ని ద్వివేదికి సంక్రమించాయి.

హటాత్తుగా తల్లిరూపం కళ్ళముందు ప్రత్యక్షమయింది.

"నన్నొదిలి ఎక్కడి కెళతావురా?" ఆమె దీనంగా అడిగిన ప్రశ్న చెవుల్లో మారుమోగింది.

ఏదో అడ్డుపడినట్టు టిఫిన్ గొంతు దిగలేదు. ఆకు డస్ట్‌బిన్‌లో పడేసి చెయ్యి కడుక్కున్నాడు. కళ్ళల్లోని తడి అక్కడివారు గమనించకముందే రోడ్డు చివరకు వచ్చి సిగరెట్ వెలిగించాడు. తల్లి తప్ప ఎవరూ లేరు. ఆమెను దక్కించుకోకపోతే జీవించడంలో అర్థంలేదు.

కష్టం వచ్చినప్పుడు విచారించడం మనిషి లక్షణమే అయినా నిజానికి దానివల్ల కష్టం తీరదని నంబియార్ అనేవాడు. ఆ మాటలు గుర్తొచ్చి విచారం వదిలించుకుని ఆలోచనల్లో మునిగిపోయాడు.

రాత్రి తనని అనుసరించిన అడుగుల చప్పుడు ఎవరిది? అది తనకేమయినా సమస్యలు సృష్టిస్తుందా? వెంటనే అతని పెదవులమీద చిరునవ్వు ఉదయించింది. సమస్యలు ఎదురుకావడం కొత్తేం కాదు. అదెప్పుడో వస్తుందని ఇప్పుడు మనసు పాడుచేసుకోవాల్సిన అవసరం లేదు. ఊహకందని రీతిలో సమస్య వచ్చినప్పుడే మనిషి

సత్తా ఏమిటో తెలిసేది.

అటువంటి స్వభావం వల్లనే ద్వివేది పేరు చెబితే దొంగలు సలాం చేస్తారు. పోలీసులు తనపైన దృష్టి నిలిపారని తెలుసుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు. కాని, నిజానికి అక్కడ జీవితం సాఫీగా సాగిపోతోంది. అప్పుడు బరంపురంనుంచి అదృశ్యం కాకపోతే చెయ్యని నేరాలకు ఈపాటికి జైల్లో వుండేవాడు.

కందిరీగల్లా మెదడ్ని తొలిచేస్తున్న ఆలోచనలనుండి బయటపడి చివరిదమ్ము పీల్చి సిగరెట్ పడేసి నడవసాగాడు. ఆర్.టి.వో. కార్యాలయం చేరడానికి పావుగంట పట్టింది. రోడ్డుపక్క చిన్న చిన్న చెక్కబల్లలు వేసుకుని కూర్చుని వున్నారు బ్రోకర్లు. ఆ వాతావరణం గమనిస్తూ తనకి ఉపయోగపడే మనిషికోసం కళ్లతో గాలించాడు.

ఒక బ్రోకరు దగ్గరకొచ్చి అడిగాడు.

"ఏం కావాలి సార్?"

"స్కూటర్ కొనాలనుకుంటున్నాను..." ద్వివేది చెప్పాడు

"ఏ స్కూటర్ కావాలి?"

జవాబు చెప్పి అతన్ని హోటల్లోకి తీసుకెళ్ళి కాఫీ ఆర్డరిచ్చాడు ద్వివేది అతని ద్వారా తనపని అవుతుందనే నమ్మకం అప్పటికే కలిగింది.

"ఎంతలో చూడమంటారు?"

"పది, పదిహేనులోపు. ట్రాన్స్‌ఫర్‌కి ఎంత ఖర్చవుతుంది?"

ఆ వివరాలు చెప్పాడు బ్రోకరు.

"అంటే ఆఫీస్ సిబ్బందికే ఎక్కువ చెల్లించాలన్నమాట..." ఆ విషయం అప్పుడే తెలిసినట్టు అమాయకంగా అన్నాడు ద్వివేది.

బ్రోకరు నవ్వాడు.

"ఈ ఆఫీస్‌లో పనిచేసే ప్యూన్‌కు కూడా రెండంతస్థుల మేడ ఉంది సార్! ఆమధ్య ఒక ఉద్యోగిని అవినీతి నిరోధకశాఖవాళ్ళు పట్టుకుంటే ఇరవైలక్షలకు పైగా విలువచేసే స్థిర, చరాస్తులు దొరికాయి. కరెన్సీని గోనె సంచుల్లో కుక్కి అటకమీద పనికిరాని సామానుల్లో పడేసేవాళ్లున్నారు"

"అయితే వీళ్ళకి జీతంతో పనిలేదు"

"మరి... ప్రభుత్వ ఉద్యోగులు మొదటి తేదీ రాకముందే చేతులు ఎత్తేస్తారు. వీళ్లు మాత్రం నాలుగోతేదీవరకూ జీతాలు తెచ్చుకోరు"

కప్పు కాఫీతో ఆ వివరాలు కావాలనే అతను రాబడుతున్నాడని తెలియని బ్రోకరు, ఆఫీస్ సిబ్బంది ఆదాయంమీద తనకున్న కసి అంతా మాటల్లో చూపించాడు.

ఇద్దరూ కాఫీ తాగి బయటకొచ్చారు.

"సాయంకాలం రండి, ఈలోపు బండి తెప్పించి వుంచుతాను. ధర మాత్రం ఓనర్‌తో మీరు డైరెక్టుగా మాట్లాడుకోవాలి. నా కమీషన్ వేరే వుంటుంది" అన్నాడతను.

ద్వివేది అంగీకరించి అక్కడనుంచి బయలుదేరాడు. దారిలో పార్కు కనిపిస్తే కాసేపు కూర్చుని వెళ్లవచ్చునని లోపలకు నడిచాడు. పార్కులోపల నిర్మానుష్యంగా వుంది. ఒక పొదపక్కన చెట్టు నీడలోని బెంచీపైన కూర్చున్నాడు.

ప్రతీనెలా రెండోతేదీన శాలరీబిల్స్ ఆర్టీవో కార్యాలయం ట్రెజరీకి సమర్పిస్తుంది. అవి క్యాష్ కావడానికి అక్కడ రెండురోజులు పడుతుంది. ఆరోజు ఆదివారమైతే మరునాడు గుమస్తా బ్యాంక్‌కి వెళ్ళి డబ్బు తెస్తాడు. అతను తోలుసంచిలో క్యాష్ పెట్టుకుని స్కూటర్‌మీద వస్తాడు. దాదాపు రెండులక్షలు తీసుకొచ్చే అతనికి ఎలాంటి సెక్యూరిటీ వుండదు. ఆ డబ్బు దొంగిలిస్తే లంచాలతో బలిసిన ఉద్యోగులకు చీమకుట్టినట్టనిపిస్తుంది తప్ప బతుకు బజారునపడే పరిస్థితి వుండదు.

దొంగతనం చెయ్యడమే కాదు, ఎలాంటి డబ్బు దోచుకోవాలనేది కూడా నంబియార్ నేర్పాడు. మనవల్ల అమాయకులు నష్టపోకూడదంటాడతను. అలాంటి నియమాలు




లేకపోతే రెండు లక్షలు సంపాదించడం పెద్ద కష్టంకాదు. ఆలోచనల్లో మునిగి తన ముందు ముగ్గురు వ్యక్తులు నిలబడివుండటం కాస్త ఆలస్యంగా గమనించాడు.

ఒకవ్యక్తి చేతిలోని రివాల్వర్ సూటిగా ద్వివేదికి గురిపెట్టివుంది. మిగతా ఇద్దరూ తదేకంగా చూస్తున్నారు.

"ఎవరు మీరు?" ముఖం చిట్లించి అడిగాడు ద్వివేది.

గెడ్డం వ్యక్తి నవ్వాడు. పొట్టిగా, కాస్త లావుగా కనిపిస్తున్న వ్యక్తి కళ్లల్లో ఎలాంటి భావమూ లేదు. రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి మాత్రం శత్రువుకి గురిపెట్టినట్టు తీక్షణంగా చూస్తున్నాడు. ఆ ముగ్గురు అపరిచితులకు నలభై దాటివుంటుంది వయసు.

"నీతో మాట్లాడాలి..." గెడ్డం వ్యక్తి గంభీరంగా అన్నాడు.

అతని జుట్టు పొదవుగా వుండి భుజాలను ముద్దాడుతోంది. గెడ్డం, మీసాలు మొహంలో చాలా భాగం కప్పేశాయి. సూదంటురాయిలా ఎదుటివాడి మెదడులోకి చొచ్చుకుపోతున్న భావన కలిగించే నిశితమైన చూపు. వయసు పైబడి వడలిపోయినా ఒకప్పుడు బలంగా వుండేవాడనడానికి చేతులపైన నరాలు పొంగివున్నాయి.

"మాట్లాడే తీరిక నాకు లేదు" అన్నాడు ద్వివేది.

"మా గురించి నీకు తెలియదు. నీ గురించి పూర్తిగా తెలుసుకుని మాట్లాడాలని వచ్చాం..." పొట్టివ్యక్తి అన్నాడు.

మొహాలు గంటుపెట్టుకుని మాట్లాడుతున్న వాళ్ళ ధోరణి ఏమాత్రం నచ్చలేదు ద్వివేదికి.

"మీరెవరో నాకు తెలియదని మీరే చెబుతున్నారు. అలాంటప్పుడు మీతో నేనెందుకు మాట్లాడాలి?" అని లేచాడు.

రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి చెయ్యి తిప్పి

మదమతో ద్వివేది మొహంపైన కొట్టాడు. ఊహించని ఆ దెబ్బకి తూలి బెంచీమీద పడ్డాడతను. పెదవి చిట్లి రక్తం చిమ్మింది. పిడికిలి బిగించి ఆవేశంతో లేవబోయాడు.

"బసవప్పా! ఎందుకొచ్చామో మర్చిపోయి ఏమిటీ పిచ్చిపనులు? బుర్రపనిచెయ్యడం లేదా?" తీవ్రంగా మందలించి ద్వివేదివైపు చూసి అన్నాడు గెడ్డం వ్యక్తి

"అతని తరఫున నేను క్షమాపణ కోరుతున్నాను. బసవప్పది తొందరపడే స్వభావం. నిజానికతను చాలా మంచివాడు..."

"మంచితనం తెలుస్తూనే వుంది..." కోపంగా అన్నాడు ద్వివేది.

"సారీ చెప్పానుగా. అయినా నీతో పేచీపడడానికి మేము రాలేదు. మేం నీకు స్నేహితులం..."

ద్వివేది మౌనంగా వుండిపోయాడు.

"నువ్వు ముంబయ్‌నుంచి కోణార్క్‌లో బరంపురం వచ్చావు. నీకు అర్జంటుగా రెండు లక్షలు కావాలి. దొంగతనం చెయ్యాలనుకుంటున్నావు..." గెడ్డం వ్యక్తి అన్నాడు.

అదిరిపడ్డాడు ద్వివేది.

ఊహించని దెబ్బకి కళ్ళు బైర్లు కమ్మితే మనసు చదవడం తెలిసినవాడిలా మనసులోని మాట చెప్పేసరికి మెదడు మొద్దుబారింది. రోడ్డుమీద పోయేవారిలా కనిపిస్తున్న ఆ ముగ్గురు ఎవరు? అప్పుడు చూశాడు పరీక్షగా.

వారి కళ్లల్లో ఇదీ అని చెప్పడానికి సాధ్యం కాని వెలుగు. జీవితంలో ఎన్నో ఎదురుదెబ్బలు తిన్నట్టు నుదుటిమీద ముడతలు. కళ్లని పరిశీలనగా చూస్తే తక్కువ అంచనా వెయ్యడానికి మనసు అంగీకరించదు. మాటల్లోని యాసని బట్టి వాళ్ళు ఒరిస్సాకి చెందినవారు కాదని అర్థమవుతోంది. పరిచయం లేని పరాయిభాష మనుషులు అనుకునేసరికి మెదడులో చురుకుదనం ప్రవేశించింది. తనని వెంటాడిన అడుగుల చప్పుడు వారిదేనని ఊహించాడు.

"అసలు మీరెవరు?" కర్చీఫ్‌తో రక్తం తుడుచుకుని అడిగాడు.

అతను సరియైన దారిలోకి వచ్చినట్టు గ్రహించాక ఎదురు బెంచీమీద కూర్చున్నారిద్దరు. రివాల్వర్ పట్టుకున్న వ్యక్తి మాత్రం కాస్త వెనక్కి జరిగి నిలుచున్నాడు. ఆ కదలికలు చూసి తలపంకించాడు ద్వివేది.

"రామసుబ్బారెడ్డి పేరు విన్నావా?" గెడ్డం వ్యక్తి అడిగాడు.

"లేదు" చెప్పాడు ద్వివేది.

"ఇరవై సంవత్సరాల క్రితం దినపత్రిక చదివేటప్పుడతని వయసు ఎనిమిది సంవత్సరాలు..." నెమ్మదిగా అన్నాడు పొట్టివ్యక్తి.

గెడ్డం వ్యక్తి తన ప్రశ్నలోని అసంబద్ధత గుర్తించినట్టు తలూపి గొంతు సర్దుకున్నాడు.

"తీవ్రవాద కార్యక్రమాలు ప్రారంభమైన రోజుల్లో ఉద్యమంలోకి ప్రవేశించి ఎందరో భూస్వాములను హతమార్చాడు రామసుబ్బారెడ్డి. పోలీసు స్టేషన్లమీద దాడిచేసి తుపాకులు, తూటాలు సమకూర్చుకునే విధానం అతనే ప్రారంభించాడు. రామసుబ్బారెడ్డిని పట్టుకోవడానికి పోలీసులు చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. అతనిమీద నమోదుచేసిన కేసుల ఫైళ్లు బూజుపట్టి చెదలు తినేశాయి"

"అతని గురించి నాకెందుకు చెబుతున్నారు?" అడిగాడు ద్వివేది.

"మమ్మల్ని తక్కువ అంచనా వెయ్యకుండా వుండాలని..."

"ఎప్పుడో ఇరవై సంవత్సరాలక్రితం ఎవరో ఏదో చేశారని చెప్పి నన్ను భయపెట్టాలనుకుంటున్న మిమ్మల్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియడంలేదు"

ఆ మాటలకు గెడ్డం వ్యక్తి చిన్నగా నవ్వాడు.

"నాకు ఆశ్చర్యంగా వుంది..." అన్నాడతను.

"దేనికి?"





"నీ నిర్లక్ష్యం చూసి. చిన్న సైగచేస్తే బస వప్పు సందేహించకుండా ట్రిగ్గర్ నొక్కు తాడు. ఒక్క తూటా చాలు నీ ప్రాణం పోవడానికి. అయినా కూడా లెక్క చెయ్య నట్టు నటిస్తున్నావు. కానీ ప్రతిమాటా నిశి తంగా వింటున్నావని, అవకాశం దొరికితే తప్పించుకుపోవాలనుకుంటున్నావని నాకు తెలుసు"

బుర్రలో కదులుతున్న ఆలోచనలు తెర మీద చూస్తున్నంత వివరంగా అతను చెప్పే సరికి నివ్వెరబోయాడు ద్వివేది. తను అంచనా వేసిన దానికంటే ప్రమాదకరమైన వ్యక్తులని, వాళ్ళనుండి తప్పుకోవడం అంత తేలిక కాదని గ్రహించి అడిగాడు.

"ఇంతకీ రామసుబ్బారెడ్డి ఏమయ్యాడు? "

"ఏమీకాలేదు... ఉన్నాడు"

"ఎక్కడ? "

"నీ కళ్ళముందు"

ఉలిక్కిపడి కాలుమీదనుంచి కాలు తీసేసి తిన్నగా కూర్చున్నాడు ద్వివేది.

"అతనేనా రామసుబ్బారెడ్డి? " పొట్టి వ్యక్తిని ఉద్దేశించి అడిగాడు.

"అతను కనుమూరి సిద్ధయ్య. నా పేరు రామసుబ్బారెడ్డి..." చెప్పాడు గెడ్డం వ్యక్తి.

ముళ్లమీద కూర్చున్నట్టు అనీజీగా కది లాడు ద్వివేది. ఎందుకో మనసు కీడు శంకించడం ప్రారంభించింది. తను తీవ్ర వాది కాడు. అసలు తీవ్రవాదమంటే ఏమిటో తెలియదు. అటువంటి తన దగ్గ రకు వీళ్లెందుకు వచ్చారు?

అదే అడిగాడు ద్వివేది.

"నీనుండి ఓ సాయం పొంది, నీకు సహా యపడాలని వచ్చాం..."

"సాయమా? " ఆశ్చర్యపోయాడు.

కొద్దిసేపు మౌనం వహించాడు గెడ్డం వ్యక్తి. అలవాటుగా గెడ్డంమీద చెయ్యేసి వేళ్లతో వెంట్రుకలచాటున దాగిన మచ్చని తడిమాడు. ఆరు అంగుళాలమేర లోతుగా చీరుకుపోవడంవల్ల ఏర్పడిన మచ్చ అది. పదిహేను సంవత్సరాలక్రితం తగిలిన ఆ గాయం వారంరోజుల్లో మానిపోయింది. గుర్తుగా మిగిలిన మచ్చ చేతికి తగిలినప్పు డల్లా ఓ జ్ఞాపకం కళ్ళముందు ప్రాణం పోసుకుంటుంది.

అతను ద్వివేది కళ్లల్లోకి నిర్వికారంగా చూశాడు.

"నువ్వు ఒక మనిషిని చంపాలి" చెప్పాడు.

ద్వివేది గుండె ఝల్లుమంది.

★ ★ ★

ఇంటినుంచి బయలుదేరాడు సబ్ ఇనస్పె క్టర్ సూరి.

రాత్రి హత్యాప్రయత్నం చేసిందెవరో ఎంత ఆలోచించినా అర్థం కాలేదతనికి. వృత్తిపరంగా ఎంతోమంది నేరస్తుల్ని జైలుకి పంపాడు. వాళ్లల్లో ఎవరైనా జైలునుండి విడుదలై ప్రతీకారంతో ఆ పని చేసుం డొచ్చు. కావాలని తప్పుడు కేసు బనాయించి ఎవర్నీ జైలుకి పంపలేదు. డిపార్ట్‌మెంట్‌లో వేళ్లూనుకున్న అలాంటి పద్ధతులకు అతను పూర్తిగా వ్యతిరేకం. ఇంటరాగేషన్‌లో హింసించే విధానానికి దూరంగా వుంటాడు.

ఎందుకోగానీ రాత్రి ఆలోచిస్తున్నప్పుడు నిహ్లాని గుర్తొచ్చాడు.

ఒకరోజు బ్రీఫ్‌కేస్ నిండా నోట్లకట్టలు పేర్చితెచ్చాడు. బరంపురంలో ఖరీదైన ఫ్లాట్ ఇవ్వడానికి సంసిద్ధత వ్యక్తం చేశాడు. ఆ ప్రపోజల్ తిరస్కరించినప్పుడు నిస్సహా యంగా చూస్తుండిపోయాడు. వచ్చేటప్పుడు నిటారుగా కనిపించిన అతను వెళుతున్న ప్పుడు జీవితంలో సర్వస్వం పోగొట్టుకున్న వాడిలా బయటకు నడిచాడు.

ఇందులో అతనికేమయినా పాత్ర వుందా?

కోర్టులో సాక్ష్యం చెప్పడానికి కొన్ని గంట లముందు హత్యాప్రయత్నం జరిగితే సహ జంగానే నిహ్లానిని అనుమానించాలి. కాని సాత్వికుడైన అతను అలాంటి పని చేయిస్తా

డని అనిపించడంలేదు. బరంపురంలో వస్త్ర వ్యాపారం చేసేవారిలో నిహ్లాని ప్రథముడు కాలాన్ని వ్యాపారానికి అంకితం చేసి శ్రమించి పైకొచ్చాడు. అతను సంపాదించిన సంపద కొడుక్కి జీవితంలోని విలువలు తెలియనివ్వకుండా చేసింది. ఏం చేసినా చెల్లుబాటవుతుందనే ధీమా పతనంవైపు నెట్టివేసింది

కోర్టు చేరుకుని పార్కింగ్ ప్లేస్‌లో బైక్ నిలిపి చుట్టూ చూశాడు సూరి.

కానిస్టేబుల్ కేసు కట్టలు పట్టుకుని వచ్చి సెల్యూట్ చేసి అన్నాడు.

"జడ్జిగారు లేరు సార్! కేసు వాయిదా పడుతుంది..."

సూరి ఆశ్చర్యపోవడం గమనించి తిరిగి అన్నాడతను.

"తెల్లవారుజామున గుండెపోటుతో హాస్పటల్లో చేరారు..."

కోర్టులో కేసు ఎప్పుడు విచారణ జరుగుతుందో, ఎప్పుడు వాయిదా పడుతుందో చెప్పడం కష్టం. అక్కడ చెయ్యాల్సిన పనేం లేకపోవడంతో బైక్ స్టార్ట్ చేశాడు.

"వాయిదా తేదీ డైరీలో నోట్ చెయ్యి..." చెప్పి బయలుదేరాడు.

మార్కెట్‌లోకి ప్రవేశించి ఒక క్లాత్‌షాపు వద్ద ఆగాడు. సెంట్రల్లీ ఎయిర్‌కండీషన్ చేసిన ఆ షోరూమ్ చాలా పెద్దది. సూరిని గమనించి ఎంట్రన్స్‌లో వున్న వ్యక్తి వినయంగా డోరు తెరిచాడు. కౌంటర్ సమీపించి అడిగాడు సూరి.

"మీ యజమాని వున్నారా?"

"ఉన్నారు సార్!"

"ఆయనతో మాట్లాడాలి..."

"దయచేసి కాసేపు వెయిట్ చెయ్యండి. ఆయన టెక్స్‌టైల్స్ ఏజంట్స్‌తో మాట్లాడుతున్నారు" నమ్రతగా చెప్పాడు కౌంటర్‌లోని మనిషి.

సూరి కూర్చుని పరిశీలనగా చూశాడు.

సేల్స్‌మాన్ బట్టలు చూపించడానికి వీలుగా కొంత ఖాళీ వదిలిన ఉడెన్‌కౌంటర్ వుంది. పర్చేజ్ ముగించిన కష్టమర్‌కి డూప్లికేట్ బిల్లు చేతికిస్తున్నాడు గుమస్తా. కౌంటర్‌లో కేష్ పేచేసిన తరువాత డూప్లికేట్ తీసుకుని ఒరిజినల్ పిన్ చేసిన పాకెట్ అందిస్తున్నాడు పక్క కౌంటర్‌లోని వ్యక్తి. చివరగా పాకెట్ చెక్‌చేసి ఆకర్షణీయమైన బ్యాగ్‌లో వుంచి చిరునవ్వుతోపాటు కష్టమర్‌కి దానిని అందిస్తున్నాడు మరోమనిషి.

సిబ్బంది పనిచేసే విధానం కష్టమర్ని ఆకట్టుకునేలా వుంది. చాలామంది పట్టించుకోరు. కాని క్రమశిక్షణ మనిషిని ఉన్నతుడ్ని చేస్తుంది. ఇతర రాష్ట్రాలనుంచి వచ్చి బట్టలు కొనుగోలు చేసేవారిని నాసిరకం సరుకుతో మోసగించే వ్యాపారులు ఎందరో వున్నారు. కష్టమర్ చెల్లించే డబ్బుకి సరుకులో తగిన నాణ్యత వుండాలని ఆ షోరూమ్ యజమాని భావిస్తాడు. నిజాయితీగా కోట్లు కూడబెడుతున్నప్పుడు మరికొన్ని రూపాయల కోసం మోసం ఎందుకు చెయ్యాలనేది అతని ఆలోచన.

"సార్! మీ కోసం మా సార్ చూస్తున్నారు..." కౌంటర్‌లోని వ్యక్తి మాటలకు ఆలోచనలనుండి తెప్పరిల్లాడు సూరి.

అతన్ని తీసుకెళ్ళి ఒకరూమ్ దగ్గర వదిలి లోపలకు వెళ్ళమని సైగచేసి అక్కడనుంచి తప్పుకున్నాడు ఆ వ్యక్తి. రూమ్‌డోరు నెట్టి చూపు ముందుకు సారించి లోపలకి ప్రవేశించాడు సూరి. స్ప్రింగ్‌డోర్ వెనుకవైపు నిశ్శబ్దంగా మూసుకుంది.

రోజ్‌వుడ్ టేబుల్ వెనుక రివాల్వింగ్ చెయిర్‌లో కూర్చుని వున్నాడు నిహ్లాని. చల్లదనం, ఎయిర్‌ఫ్రెషనర్ సువాసన, దీపాల కాంతి గదిలో చక్కటి వాతావరణం సృష్టిస్తున్నాయి. పరిమళం, వెలుగు, చల్లదనం సమపాళ్ళలో మేళవిస్తే ఎంత అద్భుతంగా వుంటుందో ఆ గదిలోకి ప్రవేశించిన సూరికి అవగతమైంది.




అలాంటి అభిరుచి కలిగినవాడి కడుపున అర్భకుడు పుట్టాడు.

"ప్లీజ్ కూర్చోండి..." కుర్చీ చూపించాడు నిహ్లోని.

తనరాక అతనికి ఇష్టముండదని వూహించే వచ్చాడు. కాని అటువంటి లక్షణం నిహ్లోనిలో మచ్చుకైనా కనిపించడం లేదు.

"కేసు వాయిదాపడింది..." అన్నాడు సూరి.

"అవునట... జడ్జీగారికి గుండెపోటు వచ్చి చార్జి ఎవరికీ ఇవ్వకుండానే హాస్పటల్లో ఎడ్మిట్ అయ్యారని ఇప్పుడే తెలిసింది"

"మీకు మరింత సమయం చిక్కింది"

"దేనికి? " నొసలు ముడివేసి ప్రశ్నించాడు నిహ్లోని.

"మీ కొడుకుని తప్పించడానికి..."

నిదానంగా సూరిని చూశాడతను.

"వాడు నాకంటే గొప్పవాడు కావాలని కలలుగన్నాం. నా తల్లిదండ్రులు నాకు కడుపునిండా తిండిపెట్టలేకపోయారు. నేను అనుభవించలేకపోయిన భోగం నా కొడుక్కి దక్కినందుకు సంతోషించాను. కాని వాడు హత్యచేసి జైలుకి వెళ్లాడు. కన్నతండ్రిగా కొడుకుని కేసునుంచి తప్పించాలని మీ వద్దకు వచ్చాను. ఈ విషయంలో భగవంతుని ఆలోచన మరోలా వుంది" నిహ్లోని గొంతు విషాదపూరితమైంది.

సూరి పోచ్‌నుండి రివాల్వర్ తీసి నిహ్లోనికి కనిపించేటట్టు టేబుల్‌మీద వుంచాడు.

"దీనిని గురిపెట్టి ట్రిగ్గర్ నొక్కితే ప్రాణం పోతుంది. అయితే చంపినంత తేలిగ్గా మనిషికి ప్రాణం ఇవ్వలేమని తెలియని ఇద్దరు మనుషులు రాత్రి నన్ను చంపడానికి వచ్చారు..."

"నిజమా? "

పొట్ట చూపించి చెప్పాడు సూరి.

"ఇక్కడ తగిలింది కత్తి గాయం. తృటిలో తప్పింది ప్రాణాలకు ప్రమాదం. దారివెంట పోయే ఓ మనిషి ఆ సమయంలో రక్షించకపోతే ఈపాటికి డిపార్ట్‌మెంట్ నాకు శ్రద్ధాంజలి ఘటించేది"

"ప్రమాదం తప్పినందుకు అభినందించాలో, హత్యాప్రయత్నం జరిగినందుకు విచారించాలో అర్థంకావడంలేదు..." సానుభూతిగా అన్నాడు నిహ్లోని.

ఇంతలో ఒకతను కాఫీ తెచ్చి సూరి ముందు పెట్టి వెళ్ళిపోయాడు.

"కొన్ని ప్రశ్నలు అడగాలని వచ్చాను..." సూరి అన్నాడు.

"ముందు కాఫీ తీసుకోండి..."

"మీరు? "

"నాకు అలవాటు లేదు"

"మీకు అలవాటులేదు. నేను టీ తప్ప కాఫీ తాగను. క్రమశిక్షణ పాటించే మనిషి మీరు. క్రమశిక్షణలో జీవించేవాడిని నేను"

తెలివితేటలున్న ఎందరో జీవితంలో తారసపడ్డారతనికి. వాళ్ళతో వ్యవహరించినప్పుడు ఏమాత్రం తొట్రుపడని నిహ్లోని ఎందుకనో సూరిని చూసి డిస్టర్బ్ అయ్యాడు. అయినా అపారమైన జీవితానుభవం వుండటంవల్ల కంట్రోలు చేసుకున్నాడు.

"రాత్రి ఎనిమిది, పది మధ్య మీరెక్కడున్నారు? " ప్రశ్నించాడు సూరి.

"ఇంట్లో... ఎనిమిదీ పదిహేనుకి ఇల్లు చేరాను. న్యూస్ చూసి డిన్నర్ ముగించి పదకొండుకి నిద్రపోయి తెల్లవారుజామున లేచాను" తడుముకోకుండా చెప్పాడు.

సుమారు రెండు గంటల సమయం గురించి అడిగితే తెల్లవారుజామువరకూ ఇంట్లోనే వున్నానని చెప్పడం దేనికి? ఆ సమయంలో జరిగిన వాటితో తనకెలాంటి సంబంధంలేదని పరోక్షంగా తెలియజేస్తున్నాడా? నిరంతరం వ్యాపార లావాదేవీల్లో మునిగే నిహ్లోని వంటి మనిషి మాటలు వృధా చెయ్యడు.

"అంటే రాత్రి హత్యాప్రయత్నం జరిగిన



ప్పుడు మీరు ఇంట్లో హాయిగా నిద్రపోతు న్నారు"

మనసులో ఏదో దాచినట్టు అతని కళ్ళు స్వల్పంగా కంగారుపడటం సూరి దృష్టిని దాటిపోలేదు.

"ఇంకేమయినా అడగాలా?

"అవసరంలేదు. మీరిచ్చిన సమాచారం నాకెంతో ఉపకరిస్తుంది. ఒకటి రెండు రోజుల్లో హత్యాప్రయత్నం చేసిన వారిని పట్టుకుంటాను..." అని లేచి రివాల్వర్ పోచ్‌లో పెట్టుకుని మెత్తటి కార్పెట్ పైన నడుస్తూ డోరు సమీపించాడు.

"మిష్టర్ సూరి..." నిహ్లాని పిలుపు విని వెనక్కి చూశాడు.

"ప్రజలకు నువ్వు చాలా సేవ చెయ్యాల్సి వుందయ్యా! ప్రాణాలమీదకు తెచ్చుకుని వాళ్ళని నిరాశకి గురిచెయ్యకు. ఎల్లప్పుడూ నువ్వే గెలవాలని వ్యక్తిగా కోరుకుంటాను. నీకు హాని జరిగితే కలిగే బాధని, కొడుక్కి శిక్షపడితే జన్మనిచ్చిన వాడు పడే బాధ అధిగమిస్తోంది. జీవిత చరమాంకంలో నాకిది క్లిష్టదశ..." నిహ్లాని గొంతు గద్గదమైంది.

ఆ మాటల్లోని సమాచారం కన్నా గూడు కట్టిన విషాదం సూరి హృదయాన్ని బలంగా తాకింది. బరువెక్కిన హృదయంతో డోరు తెరుచుకుని బయటకొచ్చాడు. బైక్ స్టార్ట్ చెయ్యబోతూ ఓ క్షణం ఆగాడు. రోడ్డవతల పార్క్ చేసిన కారుని ఆనుకుని నిలబడిన డ్రైవర్ సిగరెట్ కాలుస్తున్నాడు.

తల పంకించి కదిలాడు సూరి.

బయటకెళ్ళిన సూరి కనిపించకుండా డోరు నెమ్మదిగా మూసుకున్న తరువాత కూడా తన దృష్టి మరల్చుకోలేదు నిహ్లాని.

అతన్ని హత్యచెయ్యడానికి ప్రొఫెషనల్ కిల్లర్ని నియమించాడు. రెండు ప్రయత్నాలు మిస్ కావడంవల్ల ప్రాణాలతో తప్పించుకున్నాడు. అయినా కూడా అతనిమీద ఎలాంటి ద్వేషం కలగలేదు. సూరిని చంపితే తప్ప కొడుకుని విడిపించడం సాధ్యంకాదని తెలిసి కూడా తనెందుకు అభిమానం చూపిస్తున్నాడు? నిజాయితీ పరులను గౌరవించకపోతే ఈ దేశం పరిస్థితి మరింత అధ్వాన్నంగా తయారవుతుంది అనుకుని వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాడు.

రామ్‌బెహరాతో కాంట్రాక్ట్ రద్దు చెయ్యడానికి ఓ ఫోన్ కాల్ చాలు. కాని నిహ్లానిలోని పితృప్రేమ ఆ పని చెయ్యనివ్వలేదు.

★ ★ ★

ద్వివేది తేరుకోవడానికి కొంత సమయం పట్టింది.

"నేను హత్యచేస్తానని ఎలా అనుకున్నారు? ఇదేనా మీరు నా గురించి తెలుసుకున్నది? " సుబ్బారెడ్డిని సూటిగా అడిగాడు.

"ఆ పని చెయ్యగల మనిషి నువ్వొక్కడివే అని నాకు తెలుసు..."

ఆ మాటను ఖండిస్తున్నట్టు తల అడ్డంగా వూపాడు ద్వివేది.

"దొంగతనాలు చెయ్యడం నా వృత్తి. అందులో కూడా కొన్ని నియమాలు తప్పని సరిగా పాటిస్తాను. సాటిమనిషిని హతమార్చే రాక్షసత్వం నాలో లేదు"

"మంచిగా చెబితే అతను వినడు..." అంటూ విసురుగా ద్వివేదివైపు కదలబోయాడు బసవప్ప.

చప్పున అతన్ని తీక్షణంగా చూశాడు సుబ్బారెడ్డి. ఆ చూపు కట్టిపడేసినట్టు వుండిపోయాడతను. రివాల్వర్ మాత్రం ఆకలిగొన్న మృత్యువులా ద్వివేదిని చూస్తూనే వుంది.

"ప్రస్తుతం నీ తల్లి కాన్సర్ ఆఫ్ సర్విక్స్ అనే వ్యాధికి చికిత్స పొందుతోంది. ఆమెకు ఆపరేషన్ చేయించడానికి రెండు లక్షలు కావాలి. నువ్వు సాయం చేస్తే ఆ డబ్బు మేమిస్తాము" సిద్ధయ్య చెప్పాడు.

ప్రమాదకరమైన వ్యక్తులతో మాట్లాడుతున్నానని ముందే అనుకోవడంవల్ల ఆశ్చర్యపో





లేదు ద్వివేది. తల్లికొచ్చిన వ్యాధి సాధారణ మైంది కాదు. కొంత పరిచయం వుంటే తప్ప వ్యాధి పేరు గుర్తుండదు. సిద్ధయ్య తడుముకోకుండా ఆ పేరు ఉచ్చరించాడు. ఈ వివరాలు వాళ్ళకెలా తెలిశాయి?

ద్వివేది మాట్లాడకపోవడం చూసి సుబ్బారెడ్డి అడిగాడు, "నంబియార్ ఆర్మీలో పనిచేశాడని, ప్రాణప్రదంగా ప్రేమించిన భార్య మోసం చేస్తే తట్టుకోలేక వుద్యోగం వదిలేశాడని నీకు తెలుసా?"

ఈసారి ద్వివేదికి పూర్తిగా మతిపోయింది. పద్మవ్యూహంలో చిక్కుకుపోయిన అనుభూతి కలిగింది. పన్నెండు సంవత్సరాలు వెంట తిరిగి తెలుసుకోలేని విషయాలు సుబ్బారెడ్డి వెల్లడించాడు.

ప్రతిరోజూ రమ్ము తాగి చపాతీ తిని నిద్రపోవడం నంబియార్ అలవాటు. అది ఆర్మీలో పనిచెయ్యడంవల్ల వచ్చి వుంటుంది. ఒకరోజు ఎందుకో కాస్త ఎక్కువ తాగాడతను. అప్పుడు ద్వివేది పక్కనే వున్నాడు.

"ద్వివేది మజుందార్! నువ్వు నా వారసుడివి. ఈ ప్రపంచంలో నేను ప్రేమించేది నిన్నొక్కడినే. చావడం ఇష్టంలేక బతుకుతున్నాను. ఈ సమాజం పూర్తిగా చెడిపోయింది. కాదు, ఆమాట ఉపసంహరించుకుంటున్నాను. స్వార్థబుద్ధితో కుళ్ళిపోయిన మనిషి ఈ సమాజాన్ని చెడగొట్టాడు. అందుకే చీడపురుగుల్లాంటి అవినీతిపరుల్ని దోచుకునే వృత్తి చేపట్టాను. ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో... ఆడదాన్ని గౌరవించు, కాని ప్రేమించకు! అది మోసగిస్తే తట్టుకోలేక పతనమైపోతావు. నువ్వెంత గొప్పవాడివైనా, ఎంత గాఢంగా దేశాన్ని ప్రేమించినా అవి ఆడదానికి అక్కర్లేదు. నమ్మడం ప్రేమించడం వున్నప్పుడే మోసపోవడం జరుగుతుంది. ఆ రెండూ వదులుకుంటే నిన్నెవరూ ఏమీ చెయ్యలేరు" మాట్లాడుతూనే వెనక్కి వాలి నిద్రపోయాడు.

ఆ మాటల్లో దాగిన నిజం ఇదన్నమాట.

"నంబియార్ గురించి మీకెవరు చెప్పారు?" తేరుకుని అడిగాడు.

"అతను నాకు మిత్రుడు" సుబ్బారెడ్డి చెప్పాడు.

ద్వివేది నమ్మలేనట్టు చూడడం గమనించి అన్నాడు.

"ఒకసారి తలదాచుకోవడానికి నంబియార్ దగ్గరకొచ్చాను. అతను వుద్యోగం వదిలి పిచ్చివాడిలా తిరుగుతున్నప్పుడు నాకు పరిచయమయ్యాడు. కొంతకాలం నాతో తిరిగి విప్లవపంథా నచ్చక బరంపురం వచ్చేశాడు. నేను తలదాచుకోవడానికి వచ్చిన రోజు రాత్రి చాలాసేపు మేలుకుని ఎన్నో విషయాలు ముచ్చటించుకున్నాం. ప్రతిక్షణం సందేహాలతో జీవించే మేము ఎవర్నీ పూర్తిగా నమ్మం. అందుకే తెల్లవారుజామున బయటకు వెళుతున్న నంబియార్‌ని అనుసరించాను. అతను నీకు ట్రైనింగ్ ఇవ్వడం అప్పుడే చూశాను. నేను అనుసరిస్తున్నానని నంబియార్ పసిగట్టాడు. అతన్ని ఏమార్చడం కష్టమని తెలుసుకోవడమే మా పరిచయానికి ముగింపు"

ద్వివేది మాట్లాడలేదు.

"రెండు నెలల క్రితం ఒక మనిషిని పంపితే నీ ఆచూకీ చిక్కలేదు. మరింత పట్టుదలగా ప్రయత్నించి ముంబయ్ వెళ్ళినట్టు తెలుసుకున్నాను. బసవప్పని తీసుకుని ముంబయ్ వచ్చాను. అప్పుడే డబ్బుకోసం నువ్వు బరంపురం బయలుదేరావు..."

ముంబయ్ వెళ్ళాలని నిర్ణయించుకున్నప్పుడు అక్కడ నివసించే ఒకతని చిరునామా తీసుకున్నాడు. తల్లిని వెంటపెట్టుకుని వెళుతున్నాడు కాబట్టి తాత్కాలిక బస కోసం ఆ పని చేశాడు. అదే తన వునికి తెలుసుకోవడానికి ఉపకరించివుండాలి.

"అది సరే... ఎప్పుడో చూసిన నన్ను మీరెలా గుర్తుపట్టారు?"

జేబులోంచి ఒక ఫోటో తీసిచ్చాడు సుబ్బారెడ్డి. మొదటిసారి పోలీసులకు దొరి

కినప్పుడు తీసిన ఫోటో అది. ఇక తన గురించి వాళ్ళకి తెలియాల్సిందేం లేదని తోచింది ద్వివేదికి.

"మీరు చాలా శ్రమతీసుకున్నారు. కాని నేను హత్య చెయ్యలేను" స్థిరంగా చెప్పాడు ద్వివేది.

అతని మొహంలోకి సూటిగా చూశాడు సుబ్బారెడ్డి.

"అన్యాయంగా ఒక మనిషిని చంపమని అడగడంలేదు. మాకు న్యాయం జరగడం కోసం హత్య చెయ్యమంటున్నాం" అని గొంతు సర్దుకున్నాడు సుబ్బారెడ్డి.

చెవులు రిక్కించాడు ద్వివేది.



స్టేషన్‌ముందు బైక్ నిలిపి సెంట్రీ చేసిన సెల్యూట్ రిసీవ్ చేసుకుని లోపలకు నడిచాడు సూరి. హాలులో బెంచీమీద కూర్చున్న మనిషి లేచి నమస్కారం చేశాడు.

ప్రశ్నార్థకంగా అతనివైపు చూశాడు సూరి.

"ఆమె తిట్టడం మానలేదు సార్! మీరు మందలించిన తరువాత ఇంకా రెచ్చిపోతోంది" చెప్పాడు వ్యక్తి.





కుర్చీలో కూర్చుని అతన్ని రమ్మని సైగ చేశాడు సూరి. అతనికి ఏం చెయ్యాలో చెప్పాడు. వికసించిన మొహంతో మరో మారు నమస్కరించి హడావిడిగా వెళ్ళిపోయాడతను.

రిసీవర్ అందుకుని నెంబరు డయల్ చేస్తున్నప్పుడు స్టేషన్ రైటర్ వచ్చాడు. చేస్తున్నపని ఆపాడు సూరి.

"కమీషనర్‌గారు ఫోను చేశారు సార్! మీరు కోర్టుకి వెళ్ళారని చెప్పాను. కోర్టు నుంచి వచ్చిన వెంటనే న్యూకాలనీ క్వార్టర్ నెంబరు ఫిఫ్టీఫైవ్‌కి రమ్మని చెప్పమన్నారు" తెలియజేశాడు.

"అక్కడ ఏదైనా నేరం జరిగిందా?"

"తెలియదు సార్"

"ఎంతసేపయింది ఫోను చేసి?"

అతను చెప్పాడు.

"సరే... స్టేషన్‌లో ముఖ్యమైన పనులేం లేవు కదా?"

"లేవు సార్"

వెళ్ళమన్నట్టు తలూపి నెంబరు డయల్ చేశాడు.

"ఒకసారి సంధ్యని పిలుస్తారా?" రిసీవర్ ఎత్తిన తరువాత అన్నాడు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం. శబ్దాన్ని మోసు కెళ్ళే రిసీవర్ మౌత్ సూరి గుండెచప్పుడు వింటోంది. ఒక్కొక్క క్షణం కాలప్రవాహంలో కలిసిపోతోంది.

"హల్లో..." తియ్యటి కంఠం వినిపించింది.

"సూరిని..."

"ఎలా వున్నారు?"

"మంచిగా..."

"పనిలేదేమిటి తీరిగ్గా ఫోను చేశారు. ఇక్కడ నాకు వూపిరి సలపనంత పని టేబుల్ మీదుంది"

కమీషనర్ గుర్తొచ్చాడు సూరికి.

"ముసలాయన రమ్మన్నాడు. ఏదో పని అంటగడతాడు. సాయంకాలం ఐదున్నరకి నెహ్రూ పార్కులో కలుద్దాం"

"సరే..."

రిసీవర్ పెట్టేసి టోపీ తీసుకుని బయట కొచ్చాడు సూరి. అతని బైక్ న్యూకాలనీలోకి ప్రవేశించింది. క్వార్టర్ వెతకాల్సిన అవుసరం లేకుండా కమీషనర్ కారు కనిపించింది. జనం చుట్టూ నిలబడి ఆసక్తిగా చూస్తు న్నారు. ఆ వాతావరణం ఏదో నేరం జరి గిందని సూచిస్తోంది.

సూరి జ్యూరిస్ డిక్షన్ కాకపోయినా, అత నేదో పనిలేక గోళ్ళు గిల్లుకుంటూ కూర్చు న్నట్టు పిలిచి కేసులు అప్పగించడం కమీష నర్ అలవాటు. పనిచేసే ఎద్దునే కొడతారని వూరికే అనలేదు. క్వార్టర్ వెనుక చెట్టునీ డలో కూర్చున్న కమీషనర్‌కి సెల్యూట్ చేశాడు సూరి. కుర్చీ పక్కన నేలమీద ఖాళీ షోడాబాటిల్ వుంది.

"కోర్టు కెళ్ళావని చెప్పాడు రైటర్" అన్నాడు కమీషనర్.

"అవును సార్! కేసు వాయిదాపడింది"

"ఇక్కడో హత్య జరిగింది. ఇన్వెస్టిగేట్ చేసి సాయంకాలానికి హంతకుడ్ని అరెస్ట్ చెయ్యాలి"

పై అధికారి సాయంకాలానికి హంతకుడ్ని పట్టుకోమని శెలవిస్తుంటే ఏమనాలో తెలి యక సంకటస్థితిలో పడి మౌనంగా వుండి పోయాడు సూరి.

"నాకు తెలుసు... నువ్వు చెయ్యగలవు. అందుకే పిలిచాను" అని కుర్చీలోంచి లేచి తన భారీ కాయాన్ని మోసుకుంటూ వెళ్ళి కారెక్కి వెళ్ళిపోయాడు.

క్వార్టర్‌లోకి ప్రవేశించబోయి గుమ్మం దగ్గిరే ఆగిపోయాడు సూరి. బెడ్‌రూమ్, కిచె న్‌ల మధ్య పడున్న స్త్రీ శవం అక్కడకి స్పష్టంగా కనిపిస్తోంది. ప్రాణం వదిలే ముందు కొట్టుకున్నట్టు అవయవాలు అసహ జంగా పడున్నాయి.

"ఆమె భర్త..." ఒకతన్ని చూపించి అన్నాడు కానిస్టేబుల్.

అతని మొహం పీక్కుపోయింది. ఎర్రబ డిన కళ్లల్లో తడి. నలభై పైనే వుంటుంది అతని వయసు. హెయిర్ డై చేయించి ఎక్కువ రోజులైనట్టు జుట్టు అడుగున తెల్లగా వుంది.

"హత్య ఎలా జరిగింది?" ప్రశ్నించాడు సూరి.

అతను గొంతు తడారిపోయినట్టు గుట కలు మింగాడు.

"నైట్ డ్యూటీకి వెళ్లి ఉదయం ఎనిమిదికి తిరిగొచ్చాను. ఇంటికి తాళం వేలాడుతోంది. ఆ సమయంలో నా భార్య ఎక్కడికెళ్ళిందో తెలియక అయోమయంగా చూస్తున్నాను. ఇంతలో ఇంట్లోంచి పిల్లల ఏడ్పు వినిపిం చింది. ఎంత పిలిచినా నా భార్య జవాబు ఇవ్వలేదు. కిటికీ రెక్క బలవంతంగా తెరిచి చూస్తే పెద్దాడు శవం దగ్గర ఏడుస్తూ కని పించాడు. వాడి శరీరం నిండా రక్తం" అతని కంఠం వణికింది.

అతను తేరుకోవడానికి కొంత సమయ మిచ్చి అడిగాడు సూరి,

"ఎంతమంది పిల్లలు మీకు? వారి వయ సెంత?"

"ఇద్దరు... పెద్దాడికి మూడు, చిన్నవాడికి సంవత్సరం"

చాలా ఆలస్యంగా పిల్లలు పుట్టారని అను కున్నాడు సూరి. మనసులో ఓ సందేహం తలెత్తింది.

"మీ వివాహం జరిగి ఎంతకాలమైంది?"

"పదిహేను సంవత్సరాలు"

"ఇంట్లోని వస్తువులు ఏమైనా పోయాయా?"

"బంగారం గొలుసు, పాతికవేలు నగదు కనిపించడం లేదండి"

శవంవద్ద గొంతుక్కూర్చుని పరిశీలిం చాడు సూరి. కంఠభాగం స్వరపేటిక తోసహా తెగిపోయింది. జాకెట్‌పైన చీర మీద రక్తం మరకలున్నాయి. పెనుగులాడి నప్పుడు వూడినట్టు చీరకుచ్చెళ్ళు జారిపో యాయి. గొంతు సగంవరకూ తెగిందంటే

బలవంతంగా తల వెనక్కివంచి కత్తితో నరికి వుండాలి. కనీసం ఇద్దరన్నా లేకపోతే అలా చెయ్యడం సాధ్యంకాదు. గొంతు నరికి చంపడం దేనికి? కడుపులో పొడిచి చంప వచ్చు కదా?

"రాత్రి ఎన్ని గంటలకు ఇంటినుంచి బయ లుదేరారు?" నిలబడిన అతన్ని చూసి అడి గాడు సూరి.

"తొమ్మిదీ నలభైకి"

"అప్పుడు పిల్లలు ఏం చేస్తున్నారు?"

"నిద్రపోయారు"

అంటే రాత్రి అతను డ్యూటీకి వెళ్ళిన తరు వాత హత్య జరిగింది. ఆలోచిస్తూ తలుపు వద్దకు వెళ్ళాడు. వచ్చిందెవరో చూసి తలుపు తియ్యడానికి వీలుగా ఓ రెక్కకి మ్యాజిక్ ఐ వుంది. దీనినిబట్టి ఆమె ఇష్ట పూర్వకంగా తలుపు తీసి వుంటుంది.

తిరిగి హాలులోకి వచ్చాడు.

డ్రెస్సింగ్ టేబుల్ మీద టాబ్లెట్స్ వున్నాయి. వాటిని పరీక్షించి కిచెన్‌లోకి నడి చాడు సూరి. నిలుచుని వంట చెయ్యడానికి వీలుగా పాలిష్డ్ నాపరాయి ఎల్ ఆకా రంలో నిర్మించారు. దానిమీద గ్యాస్‌స్టౌ, వంట పాత్రలు వున్నాయి. ఓ చివర ఖాళీగా వుండిపోయింది. ఆ భాగానికి ఎదు రుగా నేలపైన చిన్న స్టూలు కనిపించింది. సూరి భ్రుకుటి ముడివడింది.

"స్టూలు వుంచేచోటు ఇదేనా?" తనని అనుసరిస్తున్న హతురాలి భర్తని అడిగాడు.

"హాలులో వుంటుంది. ఏదైనా సామాను పైనుంచి తియ్యాలంటే తెచ్చి ఉపయో గిస్తాం"

సామాన్లు తియ్యాలంటే ఓ పాదం నాప రాయిమీద వెయ్యాలి. ప్రతిబింబం కనిపించే ఆ నాపరాయిమీద అలాంటి గుర్తులు లేవు. కిచెన్‌ని మరోసారి నిశితంగా చూశాడు.

"కూరగాయలు కత్తితో తరుగుతారా?"

"అవునండి..."

"ఆ కత్తి నాకు చూపించండి"

కత్తికోసం వెదికి చెప్పాడతను.

"కనిపించడం లేదండి..."

"మీ అబ్బాయి ఏం చెప్పాడు?"

"అంకుల్ వచ్చి అమ్మతో గొడవ పడ్డాడని చెప్పాడు"

"అంకుల్ ఎవరు?"

"నా స్నేహితుల్ని వాడు అంకుల్ అని పిలుస్తాడు"

సూరి బుర్రలో కొన్ని దృశ్యాలు అస్ప ష్టంగా తచ్చాడుతున్నాయి. ఒకదానికొకటి సంబంధం లేని దృశ్యాలవి.

"మీరు షుగర్ పేషెంట్ కదూ?"

అతను ఆశ్చర్యపడి తలూపాడు.

భర్తలేనప్పుడు అపరిచిత వ్యక్తుల్ని ఆమె లోనికి రానిస్తుందా? ఎలాంటి పరిస్థితి లోనూ రానివ్వదు. బలవంతంగా తలుపులు విరగ్గొట్టి ప్రవేశించలేదు. వచ్చిందెవరో చూసి తలుపు తీసింది. రాత్రి పది దాటిన సమయంలో ఒంటరి స్త్రీ దగ్గరకు ఎవరొ స్తారు? అంతే కాదు వచ్చిన వెంటనే ఆమె మీద దాడి జరగలేదు. కత్తి వుపయోగించి గొంతు కోశారు. ఆలోచిస్తూ బెడ్‌రూమ్‌లోకి వచ్చాడు. బీరువాకి కీ వేలాడుతోంది.

అదే సమయంలో డాక్టర్ వచ్చాడు.

డాక్టర్ని విష్ చేసి పక్కకు తీసుకెళ్ళి రెండు నిముషాలు మాట్లాడి హతురాలి భర్తని వెంటపెట్టుకుని బయటకొచ్చి తలు పులు దగ్గరకు లాగాడు సూరి. క్వార్టర్ చుట్టూ మూగిన జనాన్ని దూరంగా వెళ్ళ మని హెచ్చరిస్తున్నారు కానిస్టేబుల్స్. ఆసక్తి చంపుకోలేక ముందుకొస్తున్నారు వాళ్ళు.

ఇంతలో ఎవరో టీ తెచ్చి సూరికి ఇచ్చారు. టీ తాగేసరికి తల భారం తగ్గి హుషారు పుట్టింది. అరగంట తరువాత డాక్టరు తలుపు తెరిచి సూరివైపు చూసి తలూపి లోపలికి వెళ్ళిపోయాడు.

"మా కానిస్టేబుల్ని తీసుకెళ్ళి మీ అబ్బాయి అంకుల్ అని పిలిచే స్నేహితుల్ని వెంటపెట్టుకుని రండి. ఎవరైనా లేకపోతే




వచ్చిన తరువాత ఇక్కడకు రమ్మని చెప్పండి..." హతురాలి భర్తతో చెప్పాడు సూరి.

ఆ పనిమీద వెళ్ళాడతను.

రాత్రి పదకొండు, మూడు మధ్య హత్య జరిగింది. గొంతు తెగి అధిక రక్తస్రావమై ప్రాణం పోయింది. డాక్టర్ ప్రాథమిక సమాచారం చెప్పి వెళ్ళిపోయాడు.

కానిస్టేబుల్ సాయంతో హతురాలి భర్త ఆరుగురు వ్యక్తుల్ని తీసుకొచ్చాడు. అటువంటి పరిస్థితి ఎదురైనందుకు మనస్తాపం చెందిన సూచన్లు వారిలో కనిపిస్తున్నాయి.

ఒక్కొక్కర్ని తనవద్దకు పంపించమని కానిస్టేబుల్‌తో చెప్పి, మిగిలిన వారికి మాటలు వినిపించనంత దూరం వెళ్ళి నిలుచున్నాడు సూరి.

"మీ పేరు? " మొదటి వ్యక్తిని అడిగాడు.

జవాబు చెప్పాడతను.

"ఎక్కడ పని చేస్తున్నారు? "

"రైల్వేలో..."

"హతురాలితో మీకెంత కాలంనుంచి పరిచయం? "

"ఆమె భర్త చిన్నప్పటినుంచి నాకు స్నేహితుడు. అతనికోసం తరుచుగా ఇంటికొస్తాను"

"ఆమె ఎలాంటిది? "

"చాలా మంచి మనిషి"

"రాత్రి పదినుండి ఉదయం వరకూ ఎక్కడున్నారు? "

"నైట్ డ్యూటీ చేసి వచ్చాను"

"మిమ్మల్ని ఇదివరకు ఎక్కడో చూశాను. మొన్న థియేటర్ రాజ్‌కి వెళ్ళారా? "

"లేదు" అతను తడుముకోకుండా చెప్పాడు.

ఆ వ్యక్తిని పంపేసి మిగతా వారిని కూడా అవే ప్రశ్నలు వరుసగా అడిగాడు సూరి.

"మిమ్మల్ని ఇదివరకు ఎక్కడో చూశాను. మొన్న థియేటర్ రాజ్‌కి వెళ్ళారా? " చివరి వ్యక్తికి తన చివరి ప్రశ్న వేశాడు.

"సినిమా చూడటానికి వెళ్ళాను"

కానిస్టేబుల్ని పిలిచాడు సూరి.

"ఇతన్ని అదుపులోకి తీసుకో..." చెప్పాడు.

ఆ వ్యక్తి నిర్ఘాంతపోయి, తేరుకుని పారిపోవడానికి ప్రయత్నించాడు. కానిస్టేబుల్ అతని కాలర్ అందిపుచ్చుకుని కదలనివ్వలేదు.

హతురాలి భర్తతో ఆ వ్యక్తి ఇంటికి వెళ్ళాడు సూరి. ఇల్లు సోదా చేస్తుంటే అతని తల్లి, భార్య భయంగా చూస్తుండిపోయారు. పెరట్లోకి వెళ్ళి నేలని పరీక్షించాడు. ఎంత జాగ్రత్తగా గాలించినా కావాల్సింది దొరకలేదు. అక్కడ నుంచి వచ్చేస్తూ ఇంటి ముందు చెట్టుకింద స్కూటర్ని గమనించాడు సూరి. బలవంతంగా డిక్కీ తెరిచి కాగితం చుట్టిన డబ్బు, గొలుసు బయటకు తీశాడు. సైడ్ డిక్కీలో కత్తి వుంది.

ఇంటరాగేషన్‌లో వివరాలు వెల్లడయ్యాయి.

అతనికి హతురాలితో చాలాకాలంనుంచి పరిచయం ఉంది. ఆమె భర్త డ్యూటీకి వెళ్లిన సమయంలో వచ్చిపోతాడు. ఎప్పటిలా ఆరోజు వచ్చాడతను. ఆమె భర్త తెచ్చిన డబ్బు ఇంట్లో వుందని అతనికి తెలుసు. కొంత డబ్బు సర్దమని అడిగితే, ఆమె తిరస్కరించింది.

వంట గదిలోంచి కత్తి తెచ్చి వెనుకనుంచి కంఠానికి ఆనించి బెదిరించాడు. ఇద్దరూ బలమంతా ఉపయోగించి పెనుగులాడారు. ఆ గలాటాలో గొంతు తెగి, కాసేపు కొట్టుకుని ప్రాణాలు వదిలిందామె. అతను అలా జరుగుతుందని అనుకోకపోవటంతో భయపడిపోయాడు. కాసేపటికి తేరుకుని మెడలోని గొలుసు, బీరువా నుండి నగదు తీసుకుని క్వార్టర్‌కి తాళంవేసి వెళ్ళిపోయాడు.

అతను చెప్పడం పూర్తయిన తరువాత బలంగా మొహంపైన చరిచాడు సూరి. కుర్చీతోసహా వెనక్కి విరుచుకు పడిపోయా

డతను.

ఒక స్త్రీతో శారీరక సంబంధం పెట్టుకుని, కొన్ని సంవత్సరాల పాటు ఆమెను అనుభవించి వీసమెత్తు అభిమానం లేకుండా డబ్బుకోసం ప్రాణాలు తీసిన ఆ మానవ మృగాన్ని చూస్తుంటే ఆగ్రహం కట్టలు తెంచుకుంది.

కంట్రోలు చేసుకోవడానికి కిటికీ వూచలు బలంగా పట్టుకున్నాడు.

★ ★ ★

పంతొమ్మిది వందల అరవై ఏడులో నక్సల్‌బరి గ్రామంలో వూపిరి పోసుకున్న సాయుధ రైతాంగపోరాటం, సంవత్సరం తిరక్కముందే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి వ్యాపించింది. ముఖ్యంగా ఒరిస్సాని ఆనుకుని వున్న శ్రీకాకుళం జిల్లాలో తీవ్రవాద కార్యకలాపాలు బలమైన వుద్యమ రూపం తీసుకున్నాయి. క్రమంగా ఉద్యమం విస్తరించి ఓ వుప్పెనలా విరుచుకుపడింది.

వెంటనే ప్రభుత్వం కేంద్రపోలీసు దళాలను రంగంలోకి దించింది. తీవ్రవాద ప్రాధాన్యతగల గ్రామాల్లో క్యాంపులు ఏర్పాటుచేసి సాయుధ పోలీసుదళాలు పనిచెయ్యసాగాయి. గాలింపు చర్యలు చేపట్టి నాయకులను ఎదురుకాల్పుల్లో హతమార్చడం ప్రారంభమయింది. నాలుగు సంవత్సరాలకు పైగా సాగిన పోలీసు చర్యలో ఎందరో నాయకులు హతమారిపోయారు. మరికొందరు చట్టానికి లొంగిపోయారు. ఉద్యమం ఆ ఎదురు దెబ్బని తట్టుకోలేకపోయింది.

అప్పటికే కనుమూరి సిద్ధయ్య నేతృత్వంలో గిరిజన చైతన్య సమితి అనే స్వచ్ఛంద సంస్థ ఏజన్సీలో నిశ్శబ్దంగా పనిచేసుకుపోతోంది. ఆ సంస్థ అధినేత సిద్ధయ్య తీవ్రవాద భావాలున్నవాడు. పోలీసుల ధాటికి చెల్లాచెదురైన నాయకులు కొందరు గిరిజన చైతన్య సమితి ఆశ్రయం పొందారు. సుబ్బారెడ్డి, బసవప్ప పేర్లు మార్చుకుని కార్యకర్తలుగా పనిచెయ్యసాగారు.

అణచివేత నేర్పిన పాఠంతో బహిరంగ కార్యకలాపాలు చేపట్టకుండా అంతర్వాహినిలా పనిచెయ్యసాగాడు సుబ్బారెడ్డి. గోర్కీ అనే యువకుని సారధ్యంలో ఒక దళాన్ని తయారుచేశాడు. యూనివర్శిటీ చదువు వదిలి వచ్చిన చురుకైన యువకుడు గోర్కీ. ప్రజల్ని చైతన్యవంతం చెయ్యడంలోను, దళాన్ని నడపడంలోను సమర్థత ప్రదర్శించేవాడు.

గిరిజన చైతన్యసమితి సభ్యులు గ్రామాలు తిరిగి ప్రజల్ని కలుసుకుని సమస్యలు పరిష్కరించేవారు. అయినా వారికి సాధ్యంకాని సమస్యలు వుండిపోయేవి. కొద్దిరోజుల తరువాత గోర్కీ దళం ఆ గ్రామం వెళ్ళి మిగిలినవాటిని పూర్తిచేసేది. గిరిజనుల్ని దోచుకుంటున్న ఒక వ్యాపారిని రెండుసార్లు హెచ్చరించి వినకపోయేసరికి అతన్ని హతమార్చాడు గోర్కీ. అతని డబ్బు, బంగారం అక్కడే ప్రజలకు పంచిపెట్టాడు. సంచలనం కలిగించిన ఆ హత్య పోలీసుల దృష్టిని గిరిజన చైతన్య సమితిపైకి మళ్ళించింది.

ఒకసారి గోర్కీ దళం వెళుతున్న సమాచారం తెలుసుకున్న పోలీసులు కాల్పులు జరిపారు. రహస్యంగా సాగిపోతున్న తొమ్మండుగురు సభ్యులు గల దళం ఒకేసారి తుడిచిపెట్టుకుపోయింది. దిమ్మెరపోయిన గిరిజన సమితివారు అప్పటికప్పుడే అండర్‌గ్రౌండ్‌కి వెళ్ళిపోయారు. సిద్ధయ్య, సుబ్బారెడ్డి సంస్థకి చెందిన డబ్బు తీసుకుపోయి అడవిలో దాచారు. సరిగ్గా అప్పుడే గోర్కీ రహస్యస్థావరంలో ప్రత్యక్షమయ్యాడు. దళంతో వస్తున్న గ్రామస్తుడు సభ్యులతోపాటు మరణించడంవల్ల శవాలు తొమ్మిది లభ్యమయ్యాయని, తను తృటిలో తప్పుకున్నానని గోర్కీ వివరించాడు.

అదేరోజు అర్థరాత్రి ఆ స్థావరంపైన పోలీసులు దాడిచేశారు. సిద్ధయ్య కాలిలోకి బుల్లెట్ దూసుకుపోయింది. మిగతావాళ్ళు





తప్పించుకున్నారు.

అంతవరకూ చెప్పి ఆగాడు సుబ్బారెడ్డి.

"ఇది జరిగి పన్నెండు సంవత్సరాలైంది" విచారంగా అన్నాడు సిద్ధయ్య. ఆ విషయాలు గుర్తుచేసుకోవడంవల్ల అతని మొహం మ్లానమైంది.

"గోర్కీ ఏమయ్యాడు?" అడిగాడు ద్వివేది.

"నిక్షేపంగా వున్నాడు కనుకనే చంపమంటున్నాం" సుబ్బారెడ్డి అన్నాడు.

వాతావరణం వేడెక్కి చెమటలు పడుతున్న భ్రాంతికి లోనయ్యాడు ద్వివేది. అయోమయంగా అన్నాడు,

"మీ మాటలు అర్థంకావడంలేదు"

"అర్థమయ్యేటట్లు నేను చెబుతాను" అన్నాడు సిద్ధయ్య.

సూర్యుడు తలపైకి రావడంవల్ల ఇప్పుడు ద్వివేది మీద కూడా ఎండ పడుతోంది. ఆ ఎండలో ఎదుటివారి మొహాలు తీక్షణంగా కనిపిస్తున్నాయి.

"ఎదురుకాల్పులు జరగడానికి ముందు గోర్కీ దళం గురించి తెలుసుకున్న పోలీసులు పద్మవ్యూహంలాంటి వుచ్చు బిగించారు. ఒక్క దళసభ్యుడు కూడా తప్పుకోడానికి వీలుకాని ప్రదేశం ఎన్నుకుని దాడిచేశారు. ఆ దాడికి నాయకత్వం వహించిన పోలీసు అధికారి గోర్కీ తప్పించుకోడానికి అవకాశం కల్పించాడు"

ద్వివేది ఆశ్చర్యపోవడం గమనించి చెప్పాడు సిద్ధయ్య,

"గోర్కీ అసలుపేరు వెంకటప్రసాద్. ఆ పోలీసు అధికారికి గోర్కీ సోదరుడు"

"నిజమా?" ద్వివేది గొంతులో విస్మయం.

"అవును. ఇదంతా తెలిసేసరికి జరగాల్సిన నష్టం జరిగిపోయింది. మారువేషాల్లో అన్నదమ్ములిద్దరూ సంకేతస్థలంలో కలుసుకుని సంభాషణలు జరిపేవారు. ఇద్దరి మధ్యా కుదిరిన ఒప్పందం ప్రకారం మొదట దళ సభ్యులను హతమార్చాలి. తరువాత గిరిజన చైతన్య సమితిలోని ముఖ్యుల్ని చంపాలి. అందుకు ప్రతిఫలంగా గిరిజన చైతన్య సమితి వద్దనున్న డబ్బు అప్పగించి గోర్కీని స్వేచ్ఛగా వదిలేయాలి. వాళ్ళు అనుకున్నట్టు తొలిదశ పూర్తయింది. ఎన్‌కౌంటర్ వార్త తెలిసిన మరుక్షణం గిరిజన చైతన్య సమితి నాయకులు అండర్‌గ్రౌండ్‌కి వెళ్ళిపోయారు. పోలీసు కాల్పుల్లో చచ్చిపోయినట్టు ప్రచారం చేసినా, నాయకులకోసం గోర్కీ రహస్య స్థావరానికి వచ్చాడు. అప్పుడు కూడా నేను తప్ప మిగతావారు తప్పుకున్నారు. గోర్కీకి డబ్బు చిక్కలేదు" చెప్పాడు సిద్ధయ్య.

ఆ మాటలను బలపరుస్తున్నట్టు తలూపాడు సుబ్బారెడ్డి.

"మీతో పనిచేసిన గోర్కీ హఠాత్తుగా ఎందుకిలా మారాడు?"

సుబ్బారెడ్డి బదులిచ్చాడు.

"లెక్కకుమించి పోగుపడిన డబ్బుమీద ఆశ పుట్టింది. పోలీసులకు సహకరిస్తే స్వేచ్ఛగా జీవించవచ్చుననే నమ్మకం కలిగింది. రక్తం పంచుకు పుట్టినవాడు ఇచ్చిన హామీ అందుకు దోహదం చేసింది"

"డబ్బు ఏమయింది?"

"దాచిన చోటనే వుంటుంది"

"ఇన్ని సంవత్సరాలు చెక్కుచెదరకుండా డబ్బు అక్కడ వుంటుందా?" సందేహం వ్యక్తం చేశాడు ద్వివేది.

తల పంకించాడు సిద్ధయ్య.

"వాటర్ ప్రూఫ్, ఫైర్ ప్రూఫ్ పాలిథిన్ బ్యాగ్స్‌లో పెట్టి భూమిలో పాతిపెట్టాం"

"గోర్కీ పోలీసులద్వారా మిమ్మల్ని హతమార్చడానికి ప్రయత్నించాడు. మీరు నాద్వారా అతన్ని చంపాలనుకుంటున్నారు. అతనికీ, మీకూ తేడా ఏమిటి?" నిర్మొహమాటంగా అడిగాడు ద్వివేది.

ఆ ప్రశ్నకి వారి మొహాలు తెల్లగా పాలి



పోయాయి. ముందుగా తెప్పరిల్లిన సిద్ధయ్య తల అడ్డంగా ఊపాడు.

"కక్షతో అతన్ని చంపమంటున్నామని భావించి నువ్వలాంటి అభిప్రాయానికి వచ్చావు. నిజానికి గోర్కీ ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో మాకు తెలియదు. అతన్ని చూసి పన్నెండు సంవత్సరాలు దాటింది" ఆగి ఊపిరి పీల్చుకున్నాడు.

"డబ్బుసంచుల్ని రహస్య స్థావరానికి మూడు కిలోమీటర్ల దూరంలో దాచి ఉంచాం. గోర్కీ ఆ చుట్టుపక్కల గ్రామాల్లో నివసిస్తున్నాడని భోగట్టా. ఆ గ్రామాల ప్రజల్లో గోర్కీకి పలుకుబడి వుంది. ఏదో రోజు ఆ డబ్బుకోసం మేం వస్తామని తెలిసే గోర్కీ ఆ ప్రాంతాన్ని వదల్లేదు. మమ్మల్ని కూడా చంపాకే ఈ డబ్బు స్వంతం చేసుకుంటాడు. అది ఒక వ్యక్తికి చెందిన డబ్బుకాదు, ఉద్యమంకోసం సమిష్టిగా కష్టించి పోగుచేసింది. గోర్కీని ఉపేక్షిస్తే మా ప్రాణాలకు ముప్పు తెచ్చుకున్నట్టే"

ద్వివేది మాట్లాడలేదు.

"పన్నెండు సంవత్సరాల కాలం మా శక్తి యుక్తుల్ని హరించివేసింది. పాదరసం లాంటి గోర్కీని హతమార్చి డబ్బు తీసుకు రావాలంటే సమర్ధుడైన వ్యక్తి సాయం కావాలి. నిన్ను వెదికి పట్టుకున్నది అందుకే" సుబ్బారెడ్డి అన్నాడు.

ద్వివేది ఆలోచనల్లో మునిగిపోయాడు. వాళ్ళు చెప్పిన పని చేస్తే తన అవసరం తీరుతుంది. కానీ తను సాటిమనిషిని చంపలేడు.

"సారీ... నేను హత్య చెయ్యలేను" స్థిరంగా అన్నాడు.

సూర్యరశ్మి మరింత తీక్షణత సంతరించుకుంది. సుబ్బారెడ్డి మొహం కందగడ్డలా తయారయింది. మౌనంగా వుండిపోయాడు సిద్ధయ్య.

చెమటపట్టిన కుడిచెయ్యి ప్యాంటుకి రుద్దుకుని రివాల్వర్ స్థిరంగా పట్టుకుని అక్కడ జరుగుతున్న సంభాషణ రుచించనట్టు విసురుగా ముందుకొచ్చాడు బసవప్ప.

"వాడు మాట వినడని నాకు తెలుసు" పరుషంగా అన్నాడు.

ఆ మాటలు గొంతుదాటిన మరుక్షణం మెరుపులా లేచి కుడికాలు విసిరాడు ద్వివేది. బసవప్ప చేతిలోని రివాల్వర్ ఎగిరిపోయింది. ఆ కాలు నేలని తాకిన మరుక్షణం ఎడమపాదం కాలసర్పంలా కదిలి గుండెలకు తగిలింది. రివాల్వర్ కిందపడిన రెండు క్షణాలకు బసవప్ప పర్వతంలా నేల కూలిపోయాడు. అదెలా జరిగిందో తెలియక అతని కళ్ళల్లో బాధతో పాటు ఆశ్చర్యం.

"నువ్వెందుకిలా ప్రవర్తిస్తున్నావ్?" అరిచాడు సుబ్బారెడ్డి.

నిశ్శబ్దంగా నించున్నాడు బసవప్ప. అవమాన భారంతో ముఖం ఎర్రబడింది.

పది నిముషాలు గడిచాయి.

"డబ్బు తీసుకుని తిరిగొచ్చేవరకూ మమ్మల్ని రక్షించగలవా?" ఓ నిర్ణయానికొచ్చినట్టు అడిగాడు సిద్ధయ్య.

అతని స్వరంలోని అర్థింపు ధోరణి కట్టిపడేసినట్టు, అంగీకారంగా తలూపాడు ద్వివేది.

★ ★ ★

ప్రేమంటే ఏమిటి?

ఈ ప్రశ్న చాలాకాలంనుంచి వేధిస్తోంది సూరిని. ఒక యువతి తల్లిదండ్రులతో స్టేషన్‌కొచ్చింది. నెల తప్పిన తరువాత ప్రేమించిన యువకుడు మొహం చాటేశాడని, పెళ్ళి చేసుకునే ప్రయత్నంలో వున్నాడని రిపోర్టు ఇచ్చింది. అతన్ని తీసుకొచ్చి విచారించి, రాజీ కుదిర్చి స్టేషన్‌లోనే పెళ్ళి చేసి పంపించారు.

అప్పటినుంచి సూరి మనసులో ఆ ప్రశ్న కదులుతోంది.

ఎదిగీ ఎదగని వయసులో పూర్తిగా ఎదగని మనసుతో అర్జంట్‌గా ప్రేమించేయా




లని ఆడపిల్లలు ఎందుకనుకుంటున్నారు? ప్రేమించడమంటే అంతా అర్పించడమా? వెలకట్టలేని అనుభూతులు, గుండెల్లో పదిల పర్చుకోవాల్సిన మధురస్మృతులు పెళ్ళికి ముందే అనుభవించి సాధించేదేమిటి? పోలీస్ స్టేషన్‌లో పెళ్ళి చేసుకోవాల్సిన ప్రేమ ఏం మిగిల్చింది?

వేదమంత్రాలు, బాజాభజంత్రీలతో పెద్ద లమధ్య జరిగే వివాహం ఆడపిల్లకు ఓ అందమైన అనుభవం. ఆ జ్ఞాపకాలు జీవి తంపట్ల మరింత అనురాగం కలిగిస్తాయి. కానీ ఆ యువతి తనవెంట రోజూ కాలేజీవ రకూ వస్తున్న జీన్స్ ప్యాంటు యువకుడ్ని ఆరాధించి ఇవన్నీ పోగొట్టుకుని స్టేషన్‌లో పెళ్ళి చేసుకుంది. ఆమె కాపురం ఎన్నాళ్ళు సజావుగా సాగుతుంది? మనసులమధ్య ఏర్పడిన అంతరాలు తొలగించుకుని ఆమె దాంపత్య జీవితం సంతోషంగా అనుభవిం చగలదా?

ఇన్ని సందేహాల మధ్య ప్రేమంటే ఏమి టనే ప్రశ్న వేధిస్తోంది సూరిని.

రెండు మనసులు కలిస్తే హృదయంలో సహజంగా కలిగే అనిర్వచనీయమైన స్పందన ప్రేమంటే. అక్షరాలకు దొరకని ప్రేమ అంత తేలిగ్గా లభించదు. అది ఎప్పుడు, ఎవరిపట్ల పుడుతుందో ముందుగా తెలియదు. ప్రేమంటే నిజాయితీ, నిర్మ లత్వం, అంకితభావం అనుభవానికొస్తుంది. మాటలకు దొరకదు.

అదీ ప్రేమంటే...

పార్కులో కూర్చుని మనసులో సుడులు తిరుగుతున్న అస్పష్ట భావాలను ఒకదారికి తెచ్చే ప్రయత్నం చేస్తున్న సూరి కళ్ళు మెరి శాయి. బుర్రలోని ఆలోచనలు అదృశ్యమ య్యాయి. మీగడకి కొద్దిగా పసుపు రాసినట్టు మేలిమి ఛాయతో, నిర్మలమైన కళ్ళతో, పల్చటి పెదవులపైన చెరగని చిరు నవ్వుతో... సంధ్య పార్కులోకి అడుగుపె ట్టింది.

ఆమెకంటే అందమైన వారిని చూసిన ప్పుడు కూడా అతని మనసు ఎన్నడూ వశం తప్పలేదు. సంధ్య కళ్ళల్లో కనిపించే నిర్మలత్వం అసాధారణమైంది. ఆ కళ్ళను చూస్తూ వుండిపోవాలనిపిస్తుంది. ఆమె మొదటిసారి తనవైపు చూసిన క్షణాలను ఎప్పటికీ మర్చిపోలేడు. ఆ చూపు కాలాన్ని ఆపేసి మనసు దోచేసింది. తేరుకుని తెలు సుకునేసరికి చాలా రోజులు పట్టిందతనికి.

"వచ్చి ఎంతసేపయింది? " అతని పక్కన కూర్చుంటూ అడిగింది సంధ్య.

"ఇప్పుడే..." అని ఆమె కళ్ళల్లోకి చూస్తూ తిరిగి అన్నాడు.

"మనమధ్య దూరం లేకుండా చెయ్యాల నుకుంటున్నాను"

ఆశ్చర్యంగా చూసి వెంటనే నవ్వేసింది.

"అదెలా చెయ్యగలరు? "

"నా తల్లిదండ్రులకు చెప్పి"

"అబ్బో... ధైర్యం వచ్చిందే" ఆటపట్టిస్తు న్నట్టు అంది.

"నేను పిరికివాడినా? "

"ఏమో? తల్లితండ్రులకి చెప్పి అన్నప్పుడు కళ్ళల్లో కదిలిన సందేహం గమనించాను"

ఓ క్షణం ఆలోచించి అన్నాడు.

"తల్లిదండ్రులతో పెళ్ళి చెయ్యమని చెప్పడం ఇబ్బందేకదా"

"చేతులు పైకి మడిచి నేరస్తుల్ని పట్టుకో వడానికి వురకలేసే సబ్ ఇన్‌స్పెక్టర్ సూరి పెళ్ళిమాట గుర్తొచ్చేసరికి పిల్లిలా అయిపో వడం వింతగా వుంది" అని నవ్వింది.

"నవ్వొద్దు"

"ఏం నవ్వకూడదా? "

మొదటిసారి తలొంచుకుని భయప డుతూ అదే పార్కుకి అతని వెంట వచ్చింది. మాట్లాడడమే రానట్టు మౌన వ్రతం పట్టింది. ధైర్యం చెప్పే మనిషి ఆసరా దొరికిందనే నమ్మకం చిక్కి నెమ్మ దిగా మామూలు మనిషి అయింది. ఆమె

తెరుకోవడానికి సూరి చేసిన ప్రయత్నం చిన్నదేం కాదు. ఇద్దరూ తరచుగా కలుసుకుని చర్చించుకునేవారు. ఒకరినొకరు అర్థం చేసుకోవడానికి ఆ చర్చలు బాగా ఉపకరించాయి.

ఇప్పుడు గతం ఓ పీడకల.

"నవ్వకూడదని కాదు. నవ్వే సందర్భం కాదని. మన విషయం మా వాళ్ళకి ఎలా చెప్పాలా అని చాలారోజులనుంచి ఆలోచిస్తున్నాను"

"చెప్పాలనుకున్నప్పుడు ఆలోచన దేనికి?"

తల అడ్డంగా వూపాడు సూరి.

"మీ రూమ్‌లో దేవుడి ఫొటోలున్నాయా?" అడిగింది.

ఆశ్చర్యపడి చెప్పాడు.

"ఉన్నాయి"

"అయితే ఇంకేం... మొహం చెక్కముక్కలా పెట్టుకుని దేవుడి ఫొటోలు చూస్తూ పేరెంట్స్‌కి చెప్పేయండి"

అలా చేస్తే ఎలా వుంటుందో వూహించి నవ్వాడు సూరి. అతను యూనిఫారంలో లేడు కాబట్టి సరిపోయింది లేకపోతే పార్కులోని జనం అతన్ని చుట్టుముట్టేవారు. ఒకసారి అతనితో షాపింగ్‌కి వెళ్ళి అలాంటి అనుభవం రుచిచూసింది సంధ్య.

"నా బాల్యమంతా నాయనమ్మగారి ఇంట్లో గడిచింది. మా పక్కింట్లోని దంపతులు తమ పిల్లల్ని తరచుగా కొట్టేవారు. బయటకు వెళ్ళొద్దని శాసించేవారు. అది చూసి తల్లిదండ్రులమీద నాకు వ్యతిరేకత కలిగింది. నాయనమ్మ చాలా తెలివైంది. నాకు స్నానం చేయిస్తూ, తలకి నూనె రాస్తూ నా తండ్రి చిన్నప్పటి సంగతులు పూసగుచ్చినట్టు చెప్పేది. నాయనమ్మ చనిపోయినప్పుడు తల్లిదండ్రులు కొన్నిరోజులు నాతో వున్నారు. తండ్రంటే అనుభవమున్న స్నేహితుడని, తల్లంటే బిడ్డని పరిపూర్ణునిగా తీర్చిదిద్దే దేవతని అప్పుడే తెలుసుకున్నాను" సూరి గొంతులో తల్లిదండ్రులపట్ల అనురాగం ఆర్ద్రంగా ప్రవహించింది.

రెండుక్షణాల తరువాత అన్నాడు.

"నాకీ జన్మనిచ్చినవారి రుణం ఎన్ని జన్మలెత్తయినా తీర్చుకోవాలనుకుంటున్నాను"

"మరి నేనో..."

తల్లిదండ్రుల ప్రస్తావన వచ్చేసరికి పట్టి కుదిపేసిన భావావేశంనుండి ఆ మాటతో బయటపడి సంధ్య కళ్ళల్లోకి చూసి చెప్పాడు.

"నువ్వు తోడు లేకుండా ఆ రుణం తీర్చలేనని నాకు తెలుసు"

సంధ్య మోము ప్రఫుల్లమైంది.

మరి కొద్దిసేపు వుండి ముందుగా సంధ్య వెళ్ళిపోయింది. అప్పటికే చీకట్లు ముసురుకున్నాయి. స్టేషన్‌కి వెళ్ళి కమీషనర్‌తో మాట్లాడాలనుకుంటూ లేవబోయాడు సూరి. పక్కనుంచి ఓ వ్యక్తి ముందుకొచ్చి నమస్కారం చేశాడు. నల్లగా, పొట్టిగా వున్న ఆ వ్యక్తిని చూసి సూరి నొసలు ముడివడ్డాయి. అతను పోలీస్ ఇన్‌ఫార్మర్.

ఆ వ్యక్తి చెప్పిన సమాచారం శ్రద్ధగా విన్నాడు సూరి. అతనికి వంద కాగితం అందించి స్టేషన్‌కి వచ్చాడు. ఉదయం సలహా తీసుకుని వెళ్ళిన వ్యక్తి నమస్కారం చేశాడు.

"మీరు చెప్పినట్టే చేశాను" అని టేప్‌రికార్డర్ టేబుల్‌మీద పెట్టాడతను.

బటన్ నొక్కి రెండునిముషాలు అందులోని క్యాసెట్ విన్నాడు సూరి. ఒక కానిస్టేబుల్ని ఏం చెయ్యాలో చెప్పి పంపించాడు. టేప్ రికార్డర్ తెచ్చినతన్ని వెయిట్ చెయ్యమని, కమీషనర్‌కి రింగ్ చేశాడు.

"గుడ్ జాబ్ మై బాయ్. హంతకుడ్ని ఎలా పట్టుకున్నావ్?" అడిగాడు కమీషనర్.

"మహిళాసంఘంవారు అశ్లీల చిత్రాల ప్రదర్శన నిలిపివేయాలని కోరుతూ ధర్నా చేసిన విషయం మీకు గుర్తుండేవుంటుంది".

"యస్... ఆ థియేటర్‌మీద దాడిచేసి





ఫిల్మ్ స్వాధీనం చేసుకుని ఆపరేటర్ని అరెస్ట్ చేశావుకదా"

"ఆ సినిమా మధ్యలో బ్లూ ఫిలిమ్ సీన్లున్నాయి"

"ఇప్పుడవన్నీ దేనికి? హంతకుడ్ని ఎలా పట్టుకున్నావో చెప్పు"

"అది చెప్పడానికే గుర్తుచేశానుసార్. కిచెన్‌లో విచిత్రమైన సెటప్ ఒకటి కనిపించింది. గ్యాస్ స్టౌ కోసం అమర్చిన నాపరాయిమీద వంట పాత్రలు పక్కకు జరిపి వున్నాయి. దానికెదురుగా నేలమీద చిన్న స్టూలువుంది. అంటే నాపరాయిమీద కూర్చుని కాళ్ళు స్టూలుపైన పెట్టవచ్చు. సరిగ్గా అలాంటి సెటప్‌తో ఒక శృంగార దృశ్యం మనం స్వాధీనం చేసుకున్న సినిమాలో వుంది..." ఆగి ఓ క్షణం తరువాత తిరిగి చెప్పసాగాడు.

"హతురాలి భర్త సుగర్ పేషెంట్. ఆ వ్యాధి గలవారికి లైంగిక పటుత్వం తగ్గుతుంది. చనిపోయిన స్త్రీకి పిల్లలు చాలా ఆలస్యంగా కలిగారు. చనిపోవడానికి ముందు ఆమె రతికార్యంలో పాల్గొన్నట్లు, అదీ ఆమె సమ్మతితో జరిగినట్లు డాక్టర్ ధృవీకరించాడు. ఇవన్నీ దృష్టిలో పెట్టుకుని ఆలోచిస్తే ఆమెకు ప్రియుడు వుండొచ్చునని తోచింది. భర్త డ్యూటీకి వెళ్ళిన తరువాత ప్రియుడు వచ్చాడు. ఆమెతో సినిమాలో చూసినట్టు సెక్స్ జరిపాడు. హతురాలి కొడుకు అంకుల్ వచ్చాడని చెప్పినమాట ఆధారంతో హంతకుడు ఆమె భర్తకి స్నేహితుడని ఊహించి, అతను ఆ సినిమా చూసి వుంటాడని భావించాను"

"ఇతర ఆధారాలు అంటే... నేరాన్ని ఖచ్చితంగా నిరూపించేవి దొరకలేదా? "

"హంతకుని వేలిముద్రలు నాపరాయిమీ

దున్నాయి. హతురాలి చేతిగోళ్ళల్లో హంత కుని చర్మం చిక్కుకుంది. వంటగదిలో నేల మీద స్పెర్మ్ మరకలున్నాయి. అతని స్కూటర్‌లో హత్యాయుధం, దొంగిలించిన సొత్తు లభించాయి"

"ఇన్ని ఆధారాలుండగా శృంగారదృశ్యం పైన. ఎందుకు ఆధారపడ్డావ్?"

శబ్దం వెలువడకుండా నవ్వాడు సూరి. అటువంటి అవకాశం కోసమే చూస్తు న్నాడు.

"వేలిముద్రలు, గోళ్ళల్లో చిక్కుకున్న చర్మం పరీక్షించి హంతకుడ్ని గుర్తుపట్టి పట్టుకోవడానికి కొంత వ్యవధి అవసరమవు తుంది. కానీ మీరు నాకంత సమయం ఇవ్వలేదు"

అటునుంచి రెండుక్షణాలు నిశ్శబ్దం.

"దర్యాప్తు అధికారిని ఎలర్ట్ చేయడానికి సమయం నిర్దేశిస్తాం తప్ప అతన్ని ఇబ్బంది పెట్టాలని కాదు. సూరీ! యూ ఆర్ జీని యస్"

"అంతా మీ అభిమానం" వినయంగా బదులిచ్చి కమీషనర్ ఫోన్ కట్ చేసిన తరువాత రిసీవర్ పెట్టేశాడు.

ఒక స్త్రీని వెంటపెట్టుకుని వచ్చాడు బయ టకు వెళ్ళిన కానిస్టేబుల్. ఆమె హాలులో కూర్చున్న వ్యక్తిని చురచుర చూడటం సూరి కంటపడింది.

"పక్కింట్లోనివారిని దూషించే అలవాటు మానుకోమని గతంలో ఒకసారి నిన్ను హెచ్చరించాను. అదిలిస్తే పశువులు కూడా దూరంగా పోతాయి. ఆపాటి జ్ఞానం కూడా నీకులేదు" తీవ్రంగా అన్నాడు సూరి. అది తెచ్చిపెట్టుకున్న తీవ్రత కాదు. ఆమెమీద నిజంగానే కోపం వచ్చిందతనికి.

"నేనెందుకు తిడతాను... వాళ్ళే నన్ను నానామాటలు అంటున్నారు. దాని మొగుడు వాజమ్మ... పెళ్ళాన్ని మందలించ లేదు. అతను చెబితే మీరు నమ్మేస్తారా?"

చేతులు తిప్పుతూ అడిగింది.

గుమ్మం బయట నిలుచున్న ఆ వ్యక్తి ఇబ్బందిగా కదిలాడు.

సూరి మౌనంగా టేబుల్‌మీదున్న టేప్ రికార్డర్ ఆన్‌చేసి వాల్యూమ్ పెంచాడు. తీవ్రస్వరంతో ఆమె గొంతు తిట్లవర్షం కురి పించసాగింది. ఎదురు సమాధానంగా మరో స్వరం వినిపించలేదు.

ఆ స్త్రీ మొహం నల్లగా మాడిపోయింది.

పక్కింటివారిని తిట్టడానికి సమయం వినియోగిస్తే నీ పిల్లల్ని చూడడానికి, సంసా రంలోని సమస్యలు పరిష్కరించడానికి వేరే మనుషులున్నారా? నిన్ను జైలుకి పంపేం దుకు ఈ సాక్ష్యం చాలు..."

"బుద్ధి గడ్డి తిందయ్యా. ఈ ఒక్కసారికి క్షమించుబాబూ! ఇంకెప్పుడూ ఇలాంటి పని చెయ్యను" అని రెండు చెంపలూ వాయిం చుకుందామె. మధ్యాహ్నం తిట్టిన తిట్లు టేప్ రికార్డర్‌లో వినేసరికి మతిపోయింది.

సూరి ఆశించింది కూడా అదే!

కాసేపు ఆమె మాటలు విననట్టు నటించి, చివరగా అతనికి క్షమాపణ చెప్పించి కాగితం రాయించుకుని పంపే శాడు సూరి. కృతజ్ఞతాపూర్వకంగా నమస్క రించి ఆ వ్యక్తి వెళ్ళిపోయాడు.

సూరి వాచీ చూశాడు.

తొమ్మిది దాటింది సమయం.

★ ★ ★

తొమ్మిది దాటి పది నిముషాలైంది.

మధ్యతరగతి ప్రజలు నివసించే ప్రాంతంలో ఒక ఇంట్లో నలుగురు వ్యక్తులు గచ్చుమీద కూర్చున్నారు. పైన ఒక బల్బు మాత్రం వెలుగుతోంది. భుజానికి తగిలిం చుకునే గుడ్డ సంచులు తప్ప గదిలో సామాన్లు లేవు. అది షెల్టర్‌కోసం తీసు కున్న ఇల్లని గ్రహించాడు ద్వివేది. మధ్యాహ్నం పార్కులో విడిపోయి తిరిగి రాత్రి అక్కడ కలుసుకున్నారు.

జేబులోంచి ఒక మ్యాప్ తీసి నేలపైన పరిచాడు సుబ్బారెడ్డి. మిగతా ముగ్గురు





దానిమీదకి దృష్టి సారించారు. తెల్లకాగితం పైన పెన్నుతో గియ్యడంవల్ల గీతలు వంక రగా కనిపిస్తున్నాయి. కొన్నిచోట్ల ఎరుపురం గుతో సున్నాలు చుట్టి వున్నాయి.

పెన్‌తో ఒక సున్నాని చూపించి చెప్పడం ప్రారంభించాడు సుబ్బారెడ్డి.

"ఇది మనం వున్న నగరం. ఇక్కడనుంచి ప్రతిరోజూ తెల్లవారుజామున ఓ ప్రైవేటు బస్సు దిగువ గ్రామం మీదుగా ఇచ్ఛాపురం వెళుతుంది. ఆ గ్రామం ఏజెన్సీకి గుండె కాయ వంటిది. ఇక్కడ జరిగే సంతలో పంటలు అమ్మి నిత్యావసర వస్తువులు కొనుక్కుని వెళతారు గిరిజనులు. ఉదయం తొమ్మిది గంటలకు బస్సు ఈ గ్రామం చేరు తుంది. అక్కడనుంచి అడవిలోకి ప్రవేశిం చేందుకు కాలిబాటలు వుంటాయి" చెప్పడం ఆపి పెన్ మరో సున్నావైపు జరిపాడు.

"...మనకి మొదట తగిలే మిణిఅపాయు గ్రామం ఇది. దిగువ గ్రామానికి సుమారు పాతిక కిలోమీటర్ల దూరంలో కొండపైన ఉంది. మనం ఆగకుండా ప్రయాణిస్తే సాయంకాలానికి చేరుకుంటాం. ఒకరోజు విశ్రాంతి తీసుకుని మిటిం గ్రామం సాగి పోతాం. ఇలా దట్టమైన అడవిలోని ఒక్కొక్క గ్రామం దాటుకుని ఐదవరోజు సాయంకాలం సరిహద్దు దాటి సూదికొండ సమీపిస్తాం..." ఆగి వూపిరి తీసుకుని అందరూ శ్రద్ధగా వినటం గమనించి తిరిగి చెప్పసాగాడు.

"...మనకి దారిలో ఎదురయ్యే గ్రామాల్లో కోందులు నివసిస్తుంటారు. నాగరీకులను చూసి భయపడే మనస్తత్వం వారిది. ఈ గ్రామాల పెద్దలతో నాకు పరిచయముంది. కనుక మనకి బస దొరకదనే చింతలేదు. డ్రైఫుడ్ తీసుకువెళతాం. కాబట్టి ఆహారం సమస్య వుండదు. సరిహద్దు దాటేవరకూ మనకి ఎలాంటి ప్రమాదం ఎదురుకాదు. ఆంధ్రాలోకి కాలుపెట్టిన మరుక్షణం జాగ్ర త్తగా వుండాలి. ఎందుకంటే అక్కడి గ్రామాల ప్రజల్లో గోర్కీకి మంచి పట్టుంది. అతని అనుచరులు ఆ ప్రాంతంమీద ఓ కన్నేసి వుండొచ్చు కనుక గ్రామస్తుల దృష్టిలో పడకుండా పనిముగించుకుని రావాలి..." చెప్పడం ముగించి ద్వివేదివైపు చూశాడు.

"డబ్బు దాచినచోటు గోర్కీకి తెలుసా?" అడిగాడు ద్వివేది.

"తెలియదు. కాని ఆ చుట్టుపక్కలే దాచి వుంటామని వూహించడం కష్టం కాదు. అందుకే అక్కడ నివాసం ఏర్పాటు చేసుకు న్నాడు"

"ఇన్ని సంవత్సరాలు అప్రమత్తంగా వుండడం కష్టం కదూ?"

"అతని గురించి నీకు తెలియదు. అనుకు న్నది సాధించేవరకూ నిద్రపోని తత్వం గోర్కీది. నక్కకుండే తెలివితేటలు, చిరుత కుండే వేగం అతని సొత్తు. సిద్ధయ్య జైలు నుంచి విడుదలయ్యాడని తెలుసుకుని డబ్బు కోసం వస్తామని వూహించి ఈపాటికే ఎల ర్ట్‌గా వున్నా మనం ఆశ్చర్యపోనక్కర్లేదు"

"మీరు చెప్పిన వివరాల ప్రకారం మనం కనీసం వందకిలోమీటర్ల దూరం నడవాలి. ఆ ప్రాంతం చేరుకునేసరికి పూర్తిగా అలిసి పోతాం. దీనికంటే దగ్గర మార్గం ఏదీ లేదా?"

"ఉదయం బయలుదేరి రాత్రికి సూది కొండ చేరుకునే సౌకర్యాలు వున్నాయి. అయితే అందరితో కలిసి ప్రయాణించాలి. ఆ వార్త మనకంటే ముందు గోర్కీకి చేరు తుంది. సూదికొండ చేరకముందే మనం హతమారిపోతాం..."

"మనం ఎప్పుడు బయలుదేరాలి?"

"ఇరవైతొమ్మిది ఉదయం..."

"అక్కడ దాచిన డబ్బు ఎంత?"

"సుమారు కోటిరూపాయలు..."

ఉలిక్కిపడి జవాబు చెప్పిన సిద్ధయ్యవైపు నమ్మలేనట్టు చూశాడు ద్వివేది. పేలవమైన నవ్వొకటి అతని పెదవులమీద కదిలింది.

"నీకు ఆశ్చర్యంగా వుండొచ్చు. కాని ఉద్యమాన్ని బలోపేతం చెయ్యాలని విరివిగా విరాళాలు వసూలు చేశాం. అంత డబ్బు పోగయిన తరువాతనే గోర్కీకి దుర్బుద్ధి పుట్టింది"

"మీ వద్ద రక్షణకి ఆయుధాలున్నాయా?"

"నీకు స్టెన్‌గన్ ఇస్తాను. జంగిల్ షూస్, రెయిన్‌కోట్లు, బ్లాంకెట్స్ వంటి వస్తువులు రెడీ చేస్తాను. సామాన్లు మోయడానికి ఇద్దరు మనుషుల్ని మాట్లాడాలి. సమయం తక్కువ కాబట్టి ఏర్పాట్లు రేపే పూర్తిచెయ్యాలి" చెప్పి మ్యాప్ జేబులో పెట్టుకుని, చెక్కు ఒకటి ద్వివేదికిచ్చి అన్నాడు.

"ఇది పన్నెండురోజుల తరువాత బ్యాంక్‌లో క్యాష్ అవుతుంది. రేపు వెళ్ళి ఎక్కౌంట్‌లో డబ్బున్నదీ లేనిదీ చూసుకో. అనవసరమైన విషయాల్లో తలదూర్చి సమస్యలు సృష్టించకు..."

ద్వివేది ప్రశ్నార్థకంగా చూశాడు.

"సబ్ ఇనస్పెక్టర్‌మీద ఎవరో దాడిచేస్తే వెనుకాముందు చూడకుండా రక్షించడానికి వెళ్ళావు. వాళ్ళిద్దరూ పారిపోయారు కాబట్టి సరిపోయింది. లేకపోతే ప్రత్యక్షసాక్షిగా ఇరుక్కుపోయేవాడివి. అలాంటి పనులజోలికి వెళ్ళకుండా నీకిష్టమైన విస్కీతాగుతూ విశ్రాంతి తీసుకో..."

ఎందుకో సుబ్బారెడ్డి అత్యంత ప్రమాదకరమైన వ్యక్తిలా కనిపించాడు ద్వివేది కళ్ళకి.

★ ★ ★

"అక్కడ చలేస్తోందా?"

"లేదు... మంచుపడుతోంది"

"ఖాళీయేనా?"

"ఆ..."

"ఒక ఆఫర్ వచ్చింది. సరిగ్గా పన్నెండు గంటలకు సిమెంట్ ఫ్యాక్టరీ వెనుకనున్న మామిడిచెట్టు వద్దకు వెళ్ళు. అక్కడ కస్టమర్ ఎదురుచూస్తుంటాడు..."

"సరే..."

రిసీవర్ పెట్టేసి వాచీ చూశాడు బెహరా. అప్పుడు తొమ్మిది దాటి పదిహేను నిమిషాలు అయింది. సిగరెట్ వెలిగించి ఆలోచనల్లో మునిగిపోయాడు.

సూరిని చంపడానికి పధ్నాలుగు రోజులు వ్యవధి చిక్కింది. రాత్రి జరిగిన సంఘటన వల్ల ఇప్పుడు సూరి అప్రమత్తంగా వుంటాడు. అందుచేత అవకాశం దొరికేవరకూ ఆగాలని నిశ్చయించుకున్నాడు. చేతిలో ఎలాంటి పనిలేదని విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు వచ్చిందా ఫోన్‌కాల్.

నేరప్రపంచంలో కొద్దిమంది ప్రముఖులకు మాత్రమే బెహరా తెలుసు. ఆ వ్యక్తుల ద్వారా వచ్చిన వర్క్ మాత్రమే అంగీకరిస్తాడు. సమర్ధుడైన ప్రొఫెషనల్ కిల్లర్‌గా అతనికి మంచి పేరుంది. అతని పంజా నుండి తప్పించుకున్న మొదటివ్యక్తి సూరి ఒక్కడే. వేటంటే ఇష్టపడే బెహరా అతను తప్పించుకోవడం జీర్ణించుకోలేకపోయాడు. అడవిలో గురినుండి తప్పించుకున్న జంతువు తిరిగి దొరుకుతుందనే నమ్మకం లేదు. జనారణ్యంలో మాత్రం వేట ఎక్కడికీపోదు. అలా అని మామూలుగా చంపితే అందులో ఎలాంటి థ్రిల్ వుండదు. చేతులకు మట్టి అంటకుండా, ఎదుటివాడి వూహకందకుండా చంపడంలోనే ఆనందం వుంది.

ఈసారి సూరికోసం తిరుగులేని పథకం ఒకటి ఆలోచించి వుంచాడు.

అతను సాక్ష్యం చెప్పడానికి కోర్టులో బోనెక్కి ప్రమాణం చేస్తాడు. సూరి ఒక్క ముక్క కూడా చెప్పకముందే అలాగే ఒరిగిపోయి జడ్జిముందు ప్రాణాలు వదులుతాడు. విజిటర్స్‌లో కూర్చున్న నిహ్లాని ఆ చావు ప్రత్యక్షంగా చూస్తాడు. శవం దగ్గరకు తను కూడా వెళ్ళి నివాళి అర్పిస్తాడు.

చాలామంది కష్టం అనుకుంటారుకాని మనిషిని చంపడం నిజానికి తేలిక. మనసు మీద అదుపు సంపాదిస్తే చాలు. డబ్బు కోసం ఎవరినైనా ఎలాంటి ఫీలింగ్





లేకుండా హతమార్చవచ్చు. మనిషి పోయిన కొన్నాళ్లకి అందరూ మర్చిపో తారు. భారతప్రధాని హత్య జరిగినప్పుడు దేశంలో అలజడి చెలరేగింది. అది క్రమంగా సద్దుమణిగి సంవత్సరానికి ఓసారి గుర్తుచేసుకునే స్థితి వచ్చింది. రేపు సూరి చచ్చిపోతే కొంతమంది ఆందోళన చెయ్య వచ్చు ఆ తరువాత... మామూలే! అదే మనిషి జీవితం. అంతకుమించి ఏమీలేదు. ప్రొఫెషనల్ కిల్లర్‌గా అటువంటివి ఎన్నో చూశాడు.

పదకొండున్నరకి బయలుదేరాడు బెహరా.

సిమెంట్ ఫ్యాక్టరీ దగ్గర తుప్పలచాటున హోండా ఆపి ఫ్యాక్టరీ మెయిన్ గేటు ముందు విద్యుద్దీపాల కాంతిలో కనిపిస్తున్న సెక్యూరిటీవైపు ఓసారి చూసి నిశ్శబ్దంగా చీకట్లో కలిసిపోయాడు. ఫ్యాక్టరీ గోడప క్కనే నడిచి వెనక్కి చేరుకున్నాడు. అక్కడ చీకటి మరింత చిక్కగా వుంది. ఆ ప్రదేశం తెలిసిందే కావడంతో తిన్నగా మామిడిచెట్టు కిందకు వెళ్లాడు. కళ్ళు పరిసరాలను గుర్తు పట్టడానికి ప్రయత్నిస్తుంటే చెవులు రిక్కిం చాడు. దూరంగా ఫ్యాక్టరీలో పనిచేస్తున్న మిషన్ల చప్పుడు వినవస్తోంది.

రేడియమ్ డయల్‌వాచ్ పన్నెండు కావ డానికి కొన్ని నిమిషాలున్నట్టు సూచిస్తోంది. జేబులోకి కుడిచెయ్యి పోనిచ్చి చల్లగా వున్న పిస్టల్ తడిమాడు. సిగరెట్ కాల్చాలనే కోరిక అణచుకుని అతిజాగ్రత్తగా చుట్టూ చూశాడు. కళ్ళముందు బలమైన నల్లటి సిల్కుతెర అమర్చినట్టు ఏమీ కనిపించడం లేదు.

ఒక్కొక్క క్షణం భారంగా కదులుతోంది.

"నీ పేరేమిటి?"

ఓ గొంతు రహస్యంగా అడగడంతో ఉలి క్కిపడి వెంటనే సర్దుకున్నాడు.

"ఫైవ్ సిక్స్ ఫైవ్ సిక్స్ సెవన్ టూ సెవ న్‌త్రీ..." చెప్పాడు. అక్కడ కలవమని చెప్పిన మనిషి ఫోన్ నెంబరు అది.

"చెట్టు వెనక్కిరా..."

మాట్లాడకుండా అటు నడిచాడు బెహరా. కుడిచెయ్యి ప్యాంటు జేబులోని పిస్టల్ని తాకుతూనే వుంది. నేలమీద పెన్‌టార్చ్ వెలుగు ప్రసరించింది. ఆ వెలుగులో నేల శుభ్రంగా కనిపించింది.

"కూర్చో..."

అతను కూర్చున్నాడు.

మాట్లాడుతున్న మనిషి ఎదురుగా కూర్చున్న చప్పుడు వినిపించలేదు. చీకటికి అలవాటు పడుతున్న కళ్ళకి పెన్‌టార్చి వెలుగు సోకి లీలగా కూడా ఆకారం కనిపిం చడంలేదు.

"ముగ్గుర్ని చంపాలి, ఎంత తీసుకుం టావ్?"

"పరిస్థితుల్ని, వ్యక్తుల్ని బట్టి రేటు..."

"రెండు రోజుల్లో చెయ్యాలి"

రెండుక్షణాలు నిశ్శబ్దం.

"ఈ పనిలో కష్టం తక్కువ. హత్యలు చేసిన నువ్వు పట్టుబడే అవకాశం ఏమాత్రం లేదు. ఇదంతా అడవిలో జరుగు తుంది..."

"వివరాలు చెప్పండి, రేటు తరువాత చెబుతాను..."

"అలా కుదరదు. అడ్వాన్సుగా రెండు. పని పూర్తయిన పిదప నాలుగు... మొత్తం ఆరులక్షలిస్తాను. ఇష్టపడితే వివరాలు చెబు తాను..."

కొంత తటపటాయించి చివరికి ఒప్పుకు న్నాడు బెహరా.

"ముప్పైన ఇక్కడనుంచి బయలుదేరి ఆంధ్రప్రదేశ్‌లోని పార్వతీపురం చేరుకుని అక్కడనుంచి మొండెంఖల్లు అనే గ్రామం వెళ్ళాలి. నీకిచ్చిన చిరునామాలోని మనిషిని కలుసుకుంటే రాత్రికి ఆశ్రయం ఇస్తాడు. మరునాడు అడవిలోకి తీసుకెళ్ళి ఒకచోట వదిలేస్తాడు. అదేరోజుకాని మరునాడు కాని కొందరు మనుషులు అటువైపు వస్తారు.

నువ్వు చంపాల్సిన వ్యక్తులు వాళ్ళల్లో వుంటారు. మొదటి వ్యక్తిని అక్కడే చంపాలి. ముఖ్యమైన పనిమీద వెళుతున్న వాళ్ళు నిన్ను వెదికేపని చెయ్యరు. ఒక ప్రదేశం వెదికి నేలని తవ్వుతున్నప్పుడు రెండో అతన్ని హతమార్చాలి. తిరుగుప్రయాణంలో మూడో మనిషిని చంపుతావు. ఇదంతా కొన్ని గంటల సమయంలో జరిగిపోతుంది..."

అతను చెప్పినట్టు అందులో రిస్క్ కనిపించలేదు.

"దీనివల్ల మీకొచ్చే లాభం?"

"నీవంటి ప్రొఫెషనల్ ఆ ప్రశ్న అడక్కూడదు..."

ఆ స్వరం వింటుంటే చీకటి మాట్లాడుతున్నట్టుంది. నాలుగడుగుల దూరంలో ఆ మనిషి ఆకారం లీలగా కనిపిస్తోందిప్పుడు.

పెన్‌టార్చి వెలిగింది.

"ఈ బైనాక్యులర్‌తో దూరంలోని వస్తువుల్ని స్పష్టంగా చూడొచ్చు మనుషుల్ని గుర్తుపట్టడానికి ఉపయోగపడుతుంది. ఇది సెల్‌ఫోను. పథకంలో ఏవైనా మార్పులు చోటుచేసుకుంటే కాంటాక్ట్ చేస్తాను. ఇవి చంపాల్సిన వారి ఫొటోలు. ఎలాంటి పొరపాటు జరక్కూడదని వాటిమీద వరుసనెంబర్లు వేశాను. నువ్వు గుర్తుంచుకోవాల్సిన ముఖ్యవిషయం ఏమిటంటే నేను సూచించిన వరుస ప్రకారమే వాళ్ళని చంపాలి. ఎట్టి పరిస్థితులలోను చెప్పిన ప్రదేశం, నెంబరు మారకూడదు. అడ్వాన్సుగా రెండు లక్షలు ఇస్తున్నాను. మిగతాది పనిపూర్తయిన తరవాత ఫైవ్‌సిక్స్ ఫైవ్ సిక్స్ సెవన్‌టూ సెవన్‌త్రీ చెల్లిస్తాడు. ఆ విషయం కాంటాక్ట్ చేసి కనఫర్మ్ చేసుకో..."

"నాతో మరోవ్యక్తిని తీసుకెళతాను..." బెహరా అన్నాడు.

"అది నీ ఇష్టం. ఈ పథకం గురించి మనిద్దరికీ తప్ప మూడో వ్యక్తికి తెలియకూడదు. ఆ చిరునామా దగ్గర పెట్టుకో"

"అతను మమ్మల్ని గుర్తుపడతాడా?"

"బరంపురం నుంచి వచ్చానని చెప్పు చాలు. నీ దగ్గరున్న సెల్ నేను కాంటాక్ట్ చెయ్యడానికి మాత్రమే ఇవ్వబడిందని మర్చిపోకు. ఇంకేమయినా సందేహాలు వున్నాయా?"

"లేవు"

బెహరాకి పెద్ద కవరొకటి ఇచ్చాడా వ్యక్తి. వస్తువులు, డబ్బు కవరులో పెట్టుకున్న తరువాత టార్చి ఆరిపోయింది. కొన్ని క్షణాలు ఎదురుచూసి అడిగాడు బెహరా.

"నేను వెళ్ళొచ్చా?"

సమాధానం లేదు.

భుజాలు ఎగరేసి అక్కడనుంచి బయలుదేరాడు. హోండా చేరుకుని సిగరెట్ వెలిగించి రెండు దమ్ములు పీల్చేసరికి తనతో తీసుకెళ్ళాల్సిన మనిషి ఎవరో తట్టింది.



తొమ్మిదిన్నరకి స్టేషన్ బయటకొచ్చాడు సూరి. గాయానికి డ్రెస్సింగ్ చేయించుకునేందుకు డాక్టర్ రమ్మన్న విషయం అప్పుడు స్ఫురణ కొచ్చింది. అయినా బైక్ "క్లూస్" వైపు సాగిపోయింది.

పోలీసుల పనితీరు మెరుగుపర్చడానికి ఏర్పాటుచేసిన కంప్యూటర్‌నే "క్లూస్" అంటారు. రాష్ట్రంలోని, దేశంలోని నేరస్తుల వివరాలు ఆ కంప్యూటర్‌లో నిక్షిప్తం చేస్తారు. రోజుల తరబడి రికార్డులు వెదకాల్సిన పనిలేకుండా క్షణాలలో అక్కడ సమాచారం లభ్యమవుతుంది.

"క్లూస్" ఇన్‌ఛార్జిని విష్‌చేసి కంప్యూటర్ రూమ్‌లోకి నడిచాడు సూరి. ఆపరేటర్‌కి ఒక స్లిప్ అందించి కుర్చీలో కూర్చున్నాడు.

మైదుకూరి సుబ్బారెడ్డి.

నిల్

కనుమూరి సిద్ధయ్య.

నిల్

బసవప్ప.

నిల్

ద్వివేది మజుందార్.

కంప్యూటర్‌లో అతని వివరాలు ఫోటోతో సహా ప్రత్యక్షమయ్యాయి. ముందురోజు రాత్రి తనని రక్షించింది అతనేనని గుర్తుపట్టాడు సూరి. ద్వివేది హిస్టరీ చదివి ఫోటో తీసుకుని వచ్చేశాడు.

★ ★ ★

తాగి పొదలో పడుకున్న ఇన్‌ఫార్మర్ ఆ పొదపక్క బెంచీమీద కూర్చుని మాట్లాడుకున్న వారి మాటలు విన్నాడు. అతను చెప్పిన వివరాల ప్రకారం ద్వివేదిని కలుసుకున్న ముగ్గురు వ్యక్తులు ప్రమాదకరమైనవారు. కంప్యూటర్‌లో వాళ్ళ వివరాలు లేవు కాబట్టి ద్వివేదిని పట్టుకుని తెలుసుకోవాలి.

డాక్టర్ దగ్గరకు వెళ్ళాలనే విషయం మర్చిపోయి ద్వివేదికోసం హిస్టరీలోని చిరునామాకి వెళ్ళాడు సూరి. అది లేబర్ నివసించే ప్రాంతం. అప్పటికే జనసంచారం పల్చబడింది. రోడ్డుపక్క బైక్ నిలిపి ద్వివేది ఇంటిని కనుక్కునే ప్రయత్నం ప్రారంభించాడు.

ఆ స్ట్రీట్‌కి అవతల మధ్యతరగతివారు నివసించే వీధిలోని ఒక ఇంట్లో తనకి కావాల్సిన మనుషులు సమావేశమయ్యారని తెలియని సూరి, ఎప్పుడో రికార్డులో రాసుకున్న ద్వివేది ఇల్లుకోసం గాలిస్తున్నాడు.

★ ★ ★

"పండా అంటే ఎవరు? "

ఇంట్లోంచి బయటకొచ్చిన నలభై సంవత్సరాల వ్యక్తి, యూనిఫాంలో వున్న కానిస్టేబుల్ని చూసి కంగారుపడ్డాడు.

"నేనే..." చెప్పాడు.

"నాతో స్టేషన్‌కి రావాలి..."

"దేనికి? " అతని గొంతులో భయం.

"యస్.ఐ.గారు తీసుకురమ్మన్నారు..."

"ఇప్పుడే వచ్చాను, స్నానంచేసి భోంచెయ్యాలి..."

కానిస్టేబుల్ అతని మాట వినిపించుకోకుండా భుజంమీద చెయ్యేసి అన్నాడు.

"నిన్ను అరెస్ట్ చేస్తున్నాను"

పండా మొహం కళ తప్పింది. సన్నటి వణుకు పాదాల్లో మొదలైంది. ఏం చెయ్యాలో తోచనట్టు అయోమయంగా తల తిప్పాడు. గుమ్మం అవతల భయంతో బిగుసుకుపోయిన భార్య కంటపడింది.

"షర్టు తీసుకురా..." అన్నాడు.

"భోంచేసి వెళ్ళండి..." అందామె.

తల అడ్డంగా ఊపాడు పండా. ఆమె లోపలికి వెళ్ళి షర్టు తెచ్చింది. అతను షర్టు వేసుకుని గుండీలు పెట్టుకుంటూ

"తలుపేసుకో..." అని చెప్పి కానిస్టేబుల్ని అనుసరించాడు.

తనని ఎందుకు పిలుస్తున్నారో తెలుసుకోవడానికి పండా చేసిన ప్రయత్నాలు, కానిస్టేబుల్ పెదవి విప్పకపోవడంతో ఫలించలేదు. క్షణక్షణానికి గుండెల్లో ఆందోళన పెరిగిపోతుంటే పోలీసుస్టేషన్ చేరుకున్నారు.

"నీ పేరేమిటి? " సబ్‌ఇనస్పెక్టర్ అడిగాడు.

"కాశీనాథ్ పండా..."

"నీ వృత్తి? "

"డ్రైవర్ని"

"అవి గుర్తుపట్టగలవా? "

అక్కడ కారు డీజిల్ ఇంజన్ విడిభాగా లున్నాయి. వాటిని తీసుకెళ్ళడానికి ఉపయోగించినట్టు ఓ గోనెసంచి పక్కనే వుంది.

"గుర్తుపట్టలేను..." భయపడుతూనే జవాబిచ్చాడు పండా.

"శభాష్... వాటితో సంబంధం లేకపోతే ఇంజన్ విడిభాగాలని చెప్పేవాడివి. గుర్తుపట్టలేనని చెప్పావంటే జవాబు సిద్ధం చేసుకుని వచ్చావన్నమాట. నాటకాలు కట్టిపెట్టి అవి నీకెక్కడనుంచి వచ్చాయో చెప్పు..."

అదిరిపడ్డాడు పండా. కనిపించని వుచ్చు ఒకటి బిగుసుకుంటున్న భావన.

"నాకు నిజంగానే తెలియదన్సార్"

కానిస్టేబుల్‌కి సైగ చేశాడు సబ్‌ఇన్‌స్పెక్టర్. సెల్‌లోని ముద్దాయిలనుండి ఒకతన్ని తీసుకొచ్చాడా కానిస్టేబుల్.

"ఇవి నీకమ్మిందెవరు? " యస్.ఐ. ప్రశ్నించాడతన్ని.

"ఇతనే. ." చెప్పాడతను, తడుముకోకుండా.

జరుగుతున్నది అర్ధమయ్యేసరికి చెమటలు పట్టాయి పండాకి. ఆ వ్యక్తి ఎవరో అతనికి నిజంగానే తెలియదు. అలాంటప్పుడు అవి తను అమ్మినట్టు చెబుతున్నాడంటే ఆ నేరం తనపైకి నెడుతున్నాడన్నమాట.

"ఇతన్ని నేనెప్పుడూ చూడలేదు సార్..." తడారిన గొంతు పెగుల్చుకుని అన్నాడు పండా.

"మతి తప్పి మాట్లాడుతున్నావా? అతనే స్వయంగా నువ్వు అమ్మావని చెబుతుంటే నటించడం దేనికి? ఎవరి కారు దొంగిలించి పార్ట్సుని ఇతనికి అమ్మేశావో మర్యాదగా చెప్పు" కుర్చీలోనుంచి లేచి నిజం చెప్పించడానికి సమాయత్తం అవుతున్నట్టు లాఠీ అందుకుని ప్రశ్నించాడు యస్.ఐ.





పండాకి గుండెల్లో దడ మొదలయింది. ఆ కేసులో తను పూర్తిగా ఇరుక్కుపోయాననే ఆలోచనతో బుర్ర పని చెయ్యడం మానేసింది.

"సార్! పిల్లలుగలోడ్ని. గంపెడు సంసారం నేనొక్కడ్నే పోషించాలి. ఇవి అతని దగ్గరకు ఎలా వచ్చాయో కాని నామీద ఆ నేరం మోపుతున్నాడు. నేను పొద్దున్న ఎనిమిదికిపోయి రాత్రి తొమ్మిదికి ఇంటికొస్తాను. ఇలాంటి తప్పుడు పనులు చేసేటోడ్ని కాదు. నామాట నమ్మకపోతే మా యజమాని నిహ్లానిగారిని అడగండి..." దీనంగా వేడుకున్నాడు పండా.

"నిన్నతను గుర్తుపట్టిన తరువాత నేను చెయ్యగలిగిందేమీ లేదు. బస్‌స్టాండ్ దగ్గర అనుమానాస్పదంగా సంచరిస్తుంటే కానిస్టేబుల్ పట్టుకున్నాడు. ప్రశ్నిస్తే కారు విడిభాగాలు నీ దగ్గర కొన్నట్టు చెప్పాడు. ఆ విషయం నీ ముందు వప్పుకున్నాడు కదా!"

హతాశుడయ్యాడు పండా.

"అలా అనకండయ్యా! మీరే రక్షించాలి... ఉద్యోగంపోతే పిల్లలు రోడ్డున పడతారు"

సబ్‌ఇనస్పెక్టర్ సైగ అందుకుని ఆ ముద్దాయిని తీసుకెళ్ళి సెల్‌లో వేసి అతనికి సిగరెట్ అందించాడు కానిస్టేబుల్. సిగరెట్ వెలిగించుకుని నవ్వాడతను. తను కూడా నవ్వుతూ సెల్‌కి తాళంవేశాడు కానిస్టేబుల్.

బిక్కచచ్చి నిలుచున్న పండాని పరిశీలనగా చూశాడు సబ్‌ఇనస్పెక్టర్. అతను తెలివైనవాడిలా కనిపించడంలేదు. చెయ్యని నేరం మీదపడితే అలాంటి వారికి మస్తిష్కం పనిచెయ్యదు. ఇప్పుడు కొంచెం చాకచక్యం చూపితే ఎన్నో విషయాలు వెల్లడిస్తాడు.

"నిన్ను చూస్తుంటే మంచివాడిలా కనిపిస్తున్నావు. ఈ పని ఎందుకు చేశావ్? "

"నేను నేరం చేసే మనిషిని కాదండి. నిజంగానే అతన్ని నేనెప్పుడూ చూడలేదు..." వినయంగా బదులిచ్చాడు పండా.

తల పంకించాడు యస్.ఐ.

"ఎంతకాలంనుంచి డ్రైవర్‌గా పనిచేస్తున్నావ్?"

"క్లీనరుగా చేరి డ్రైవింగ్ నేర్చుకున్నానండి. పదేళ్ళు టాక్సీ తోలాను. నాలుగేళ్ళనుంచి నిహ్లానిగారివద్ద డ్రైవరుగా చేస్తున్నాను"

"తొమ్మిదికి నువ్వు ఇంటికొచ్చేస్తే, ఆ తరువాత నిహ్లాని ఎక్కడికైనా వెళ్ళాలంటే ఎలా?"

"ఆయనే కారు తీసుకుని వెళతారండి"

"ఆ విషయం నీకెలా తెలుస్తుంది?"

"బయటకు వెళ్ళదల్చుకుంటే కారు షెడ్డులో పెట్టొద్దంటారండి. కారు పెట్టేసి వెళ్ళిపోతున్నప్పుడు మీటర్ రీడింగ్ రాసుకుంటాను. ఉదయం కారు తీసినప్పుడు రీడింగ్‌లో తేడా వుంటే పుస్తకంలో రాస్తాను"

"బుధవారం రాత్రి నిహ్లాని బయటకెళ్ళాడా?"

"వెళ్ళారండి... ఉదయం రీడింగ్ చూస్తే నాలుగు కిలోమీటర్లు తిరిగినట్టు తెలిసింది. సినిమాకెళ్ళొస్తూ నా బావమరిది హోటల్ కైలాష్‌వద్ద కారు చూశాడట"

"బుధవారానికి నాలుగైదు రోజులు ముందు మీ యజమానిని ఇంటినుంచి షాప్‌కి కాకుండా ఇంకెక్కడికైనా తీసుకెళ్ళావా?"

ఏమాత్రం తడుముకోకుండా రెండు ప్రదేశాలు చెప్పాడు పండా. నిహ్లాని సాధారణంగా ఎక్కడికీ వెళ్లడు కాబట్టి ఆ వివరాలు అతనికి గుర్తున్నాయి.

ఎప్పుడైనా కబురు చేస్తే రావాలని చెప్పి పండాని పంపివేశాడు ఆ స్టేషన్ సబ్ ఇన్స్పెక్టర్ సూరి. ఇద్దరు కానిస్టేబుల్స్‌ని పిలిచి చెరో చిరునామా ఇచ్చి వాచ్ చెయ్యమని పురమాయించాడు. స్టేషన్‌కి పదిగజాల దూరంలోని షెడ్డునుంచి కుర్రవాడొకడు వచ్చి కారు విడిభాగాలు గోనెసంచిలో వేసుకుని తన షెడ్డుకి తీసుకుపోయాడు.

కష్టపడి ద్వివేది ఇల్లు కనుక్కుంటే అతను అక్కడ మూడు సంవత్సరాల క్రితం నివసించాడని తెలిసింది. సిబ్బంది చేతికి ద్వివేది ఫొటో ఇచ్చి అతనెక్కడ వున్నాడో ఛోగట్టా చెయ్యమని పంపించాడు. అయినా అతని జాడ ఇంతవరకూ తెలియలేదు. ఆరోజుకి స్టేషన్‌లో పనిముగించుకుని హోటల్ కైలాష్‌కి వెళ్ళాడు సూరి.

"బుధవారం రాత్రి డ్యూటీలో ఎవరున్నారు?" రిసెప్షనిస్ట్‌ని అడిగారు.

"నేనే" చెప్పాడతను.

"ఆరోజు రాత్రి క్లాత్‌మర్చంట్ నిహ్లాని హోటల్‌కి వచ్చాడా?"

"వచ్చారు"

"ఎన్ని గంటలకు వచ్చాడు?"

"తొమ్మిది దాటివుంటుంది"

"ఎవరినైనా కలుసుకున్నాడా?"

"ఫోర్త్ ఫ్లోర్‌లోని టూ నాట్ త్రీకి వెళ్ళారు"

"అందులో ఎవరున్నారు?"

"రామ్‌బెహరా అనే కష్టమర్" రిజిష్టర్‌లో నమోదు చేసిన వివరాలు చూసి చెప్పాడు.

"అతని వృత్తి?"

"బట్టల వ్యాపారం"

"హోటల్‌కి ఎప్పుడొచ్చాడు? ఎప్పుడు వెళ్ళాడు?"

"ఆరోజు రాత్రి ఏడుకి రూము తీసుకుని తెల్లవారుజామున వెళ్ళిపోయాడు"

"అతనితో నిహ్లాని వున్నాడా?"

"లేరు... ఆయన ఎప్పుడు వెళ్ళిపోయారో నేను చూడలేదు"

"రామ్ బెహరా పోలికలు చెప్పగలవా?"

అతను రెండు క్షణాలు ఆలోచించి చెప్పాడు.

"ఆరడుగుల ఎత్తుంటాడు. బొద్దు మీసాలు, జుట్టు వెనక్కి దువ్వాడు. రంగు పూసినట్టు చర్మంపైన నల్లటి వెంట్రుకలు"

అతనికి కృతజ్ఞతలు చెప్పి బయటకొచ్చాడు సూరి. వీధి చివరవున్న ఆటోస్టాండ్

వైపు నడిచాడు. ఆటోల వెనుక కూర్చుని పులీ మేకా ఆడుతున్న డ్రైవర్లని ఎవరో హెచ్చరించారు. వాళ్ళు చప్పున లేచి ఆటోల ముందుకొచ్చారు.

"నమస్తే సార్! ఇలా వచ్చారేంటి? " తెలిసిన డ్రైవర్ సూరిని పలకరించాడు.

"గురువారం తెల్లవారుజామున హోటల్ నుండి ఆరడుగుల వ్యక్తి బయటకు వెళ్ళాడు. మీలో ఎవరైనా అతన్ని తీసుకెళ్ళారా? "

అతను మిగతా వారిని సంప్రదించి చెప్పాడు.

"ఎవరూ తీసుకెళ్ళలేదు సార్!"

"ఇప్పుడు అందరూ లేకపోవచ్చు మిగతా వారిని కూడా కనుక్కుని రేపు ఆ డ్రైవర్ని స్టేషన్‌కి రమ్మను..."

"అలాగే సార్..."

సూరి హోటల్ దగ్గరకొచ్చి బైక్ స్టార్ట్ చేశాడు.

ఆరోజు జరిగిందంతా మననం చేసుకున్నాడు. పండా ద్వారా తెలిసిన చిరునామాలవద్ద కానిస్టేబుల్స్‌ని కాపలా వుంచాడు. నైట్ బీట్‌కి వెళ్ళే సిబ్బంది వద్ద ద్వివేది ఫొటోలున్నాయి. ఏదైనా సమాచారం తెలిసిన మరుక్షణం తనని కాంటాక్ట్ చెయ్యమని చెప్పాడు. ఉదయానికి రిజల్ట్ కనిపించి తీరాలి.

వివిధ రాష్ట్రాల నేరస్తుల వివరాలు 'క్లూస్' లో వుంటాయి. అయితే రాజకీయ నేరాలకు సంబంధించిన వారికి ప్రాధాన్యత ఇవ్వలేదు. అందుచేత ద్వివేదిని కలిసిన ముగ్గురు వ్యక్తుల సమాచారం లభించలేదు. ద్వివేదిని పట్టుకుంటే మొత్తం వివరాలు తెలుస్తాయి.

మరో మార్గం లేదు.

★ ★ ★

ఇరవైతొమ్మిది శనివారం.

ఐదుగంటలకు రైల్వేస్టేషన్ దగ్గరున్న టీ కొట్టుముందు సైకిల్‌స్టాండ్ వేశాడు కానిస్టేబుల్ ఒకతను. నైట్ బీట్ ముగించుకుని ఇంటికెళుతూ టీ తాగడంకోసం అక్కడ ఆగాడు. వేడివేడి టీ చుక్కలు గొంతు దిగుతుంటే రాత్రంతా డ్యూటీ చేసినందువల్ల కలిగిన నిస్సత్తువ అదృశ్యమవుతుంది. హుషారుగా సైకిల్ తొక్కుకుంటూ పోవచ్చు.

అక్కడకి పది గజాల దూరంలో చీకట్లో ఇద్దరు వ్యక్తులు నిలుచున్నారు. టీ తాగుతున్న కానిస్టేబుల్ దృష్టి వాళ్ళమీద పడినా పట్టించుకోలేదు. ఎందుకంటే ఆ సమయంలో అతను దిగులుగా వున్నాడు. అసలు కానిస్టేబుల్ వుద్యోగమే అశాంతుల పుట్ట. ఇటు ప్రజల్ని అటు ప్రభుత్వాన్ని తృప్తిపరచలేని వృత్తి. కనీసం ఆ వృత్తిలో వున్నవారికైనా తృప్తి వుంటుందా అంటే అదీ లేదు.

అతను ఈమధ్యనే కూతురి పెళ్ళి చేశాడు. ఇప్పుడు కూతుర్ని అత్తవారింటికి పంపాలి. చేతిలో డబ్బులేక భార్యకి అనారోగ్యమని డాక్టర్ నుండి ఓ సర్టిఫికెట్ తీసుకుని వెల్ఫేర్ లోనుకి అప్లై చేశాడు. అదింకా శాంక్షన్ కాలేదు. ఈలోపు కూతుర్ని పంపమని అల్లుడు వత్తిడి చేస్తున్నాడు. ఏదోటి చెయ్యాల్సిన పరిస్థితి ఏర్పడి రాత్రి డ్యూటీకి పోతూ తన సమస్య స్టేషన్ సబ్‌ఇన్‌స్పెక్టర్ సూరికి విన్నవించాడు. ఉదయం స్టేషన్‌కి వచ్చినప్పుడు గుర్తుచేస్తే కమీషనర్‌తో మాట్లాడి లోన్ శాంక్షన్ చేయిస్తానని హామీ ఇచ్చాడతను. లోను శాంక్షన్ అవుతుందో లేదో అనే ఆలోచన మదిలో కల్లోలం రేపుతోంది.

టీ తాగి సిగరెట్ ముట్టించి సైకిల్ తీశాడు.

అదే సమయంలో ప్రతిరోజూ ఆ రూట్‌లో వెళ్ళే బస్సు వచ్చి రోడ్డుమీద ఆగింది. ఇద్దరు వ్యక్తులు బస్సెక్కడం కానిస్టేబుల్ కంటపడింది. ఆ దృశ్యం యధాలాపంగా తిలకించిన అతను షాక్ కొట్టినట్టు





వులిక్కిపడ్డాడు. బస్సు లోపలి వెలుగులో వారి రూపాలు స్పష్టంగా కనిపించాయి. జేబులోంచి ఫొటో తీసి ద్వివేది అతనేనని రూఢి చేసుకున్నాడు. ఇదంతా చేస్తుండగా బస్సు వాళ్ళిద్దర్నీ తీసుకుని వెళ్ళిపోయింది.

ఆ కానిస్టేబుల్ రెండు క్షణాలు ఆలోచించాడు. అప్పుడు వెళ్ళి సబ్ఇన్స్పెక్టర్‌కి చెప్పినా ఉపయోగం వుండదని, పది గంటలకు స్టేషన్‌కి వెళ్ళినప్పుడు చెప్పవచ్చునని అనుకుని ఇంటివైపు సాగిపోయాడు.

ఆ రూట్‌లో వెళ్ళే బస్సు అదొక్కటే కావడంవల్ల సిటీ లిమిట్స్ దాటకముందే రెండు బస్సుల జనం అందులో ఎక్కారు. ఆ సమయంలో బస్సు అందకపోతే మరుసటి రోజు వరకూ వేచి ఉండాలి. అందుకే ఆ బస్సులో వెళ్ళాల్సిన ప్రయాణీకులు రెండో ఆట సినిమా చూసొచ్చి బస్‌స్టాండ్‌లో కునుకు తీస్తారు.

బస్సు లోపల సిద్ధయ్య తప్ప మిగతా వారు చోటులేక నిలుచున్నారు. రైల్వేస్టేషన్ వద్ద ద్వివేదితో ఎక్కిన సుబ్బారెడ్డి రెండు టిక్కెట్లు దిగువ గ్రామానికి తీసుకున్నాడు. వింత వింత శబ్దాలు వెలువరిస్తూ నిండు గర్భిణిలా సాగిపోతోంది బస్సు.

బరంపురం లిమిట్స్ దాటేసరికి ప్రయాణీకులు వేలాడుతున్నారు. అతి నెమ్మదిగా మట్టి రోడ్డులోకి తిరిగింది బస్సు. అరగంట తరువాత ఓ గ్రామంలో ఆగితే ఇద్దరు ఎక్కారు తప్ప ఎవరూ దిగలేదు. వరుసగా పది నిముషాలకో గ్రామం చేరుతుంటే ప్రయాణీకులు దిగడం ప్రారంభించారు.

నలభై కిలోమీటర్ల దూరం చేరడానికి నాలుగు గంటలు పట్టింది. దిగువ గ్రామంలో ప్రయాణీకుల్ని దించి బస్సు వెళ్ళిపోయింది. అక్కడ మూడు పాకల్లో టీ కొట్టు, కిళ్ళీబడ్డీ, బార్బర్ షాపు వున్నాయి. నేలమీద గుడ్డ పరిచి అరటిపళ్ళు అమ్ముతున్నాడో వ్యక్తి. రోడ్డుకి కాస్తదూరంలో ఎడమవైపు చెట్లవెనుక దిగువ గ్రామంలోని ఇళ్ళు కనిపిస్తున్నాయి.

కొండలతోను, పచ్చటి చెట్లతోను స్వాగతమిస్తోంది ఆ గ్రామం.

"ఇక్కడ ఏదైనా తిని వెళదాం" సిద్ధయ్య అన్నాడు.

అందరూ టీ కొట్టులోకి నడిచారు. పెద్ద పెద్ద బ్యాగులు పట్టుకుని వెంటవస్తున్న ఇద్దర్నీ పరీక్షగా చూశాడు ద్వివేది. బరువు పనులు చెయ్యడానికి అలవాటు పడినట్టు వారి శరీరాలు రాటుదేలి వున్నాయి. ఇద్దరికీ ముప్పైలోపు వుంటుంది వయసు.

టీ కొట్టులో ఓ పక్క గ్రామస్తులు గుంపుగా కూర్చుని బస్సులో వచ్చిన ఆరోజు దినపత్రిక చదువుతున్నారు. సుబ్బారెడ్డి బృందం వారికెదురుగా బల్లమీద కూర్చుంది. ఆవిరిమీద వుడికించిన గ్లాసు ఆకారంలోని ఇడ్లీలు పెద్ద సిల్వర్ ప్లేటు నిండా కనిపిస్తున్నాయి. ఆకుల్లో ఆ ఇడ్లీలు పెట్టి కారప్పొడి వేసి అందించాడు టీ కొట్టు యజమాని. ఆ కొట్టులో మరో ఆహార పదార్థం లేకపోవడం చూసి అందరూ మౌనంగా వాటిని తిన్నారు.

అదే సమయంలో ఒకామె లోపలికి వచ్చింది.

వయసు తక్కువే అయినా నలిగిన మొహం ఎక్కువ చేసి చూపిస్తోంది. తైల సంస్కారం లేక తలవెంట్రుకలు బిరుసెక్కి ఎండు గడ్డిలా వున్నాయి. పోషణలేని శరీరం శుష్కించి ఉంది. పేపరు చదువుతున్న గ్రామస్తుల ముందుకు వెళ్ళిందామె. వాళ్ళల్లో బలంగా కనిపిస్తున్న వ్యక్తి ఆమెని చూసి మొహం చిట్లించి,

"ఏమిటి? " అని అడిగాడు.

"డబ్బులిస్తాను రమ్మన్నావు" గుర్తుచేస్తున్నట్టు నెమ్మదిగా, అంతమందిలో అడుగుతున్నందుకు జంకుతూ అందామె.

"నీకు బాకీ వున్నానా? " తీవ్రంగా అడిగాడతను.

"బియ్యం లేవు. డబ్బులిస్తే పొయ్యి వెలిగించి అన్నం వండుకుంటాను" దీనంగా

అంది.

అందరి దృష్టి వారిద్దరిమీద కేంద్రీకృత మైంది.

"ఏ పొయ్యి వెలిగిస్తావ్?" వ్యంగ్యంగా అన్నాడు.

ఆ మాటకి నవ్వారు అతని చుట్టూ వున్న వాళ్ళు.

వినోదం జరుగుతున్నట్టు నవ్వుతున్న గ్రామస్తుల్ని పరికించి చూశాడు ద్వివేది. మిగతా వారికంటే ఆమెతో మాట్లాడుతున్న వ్యక్తి ప్రత్యేకంగా కనిపిస్తున్నాడు.

"ఈ కడుపు చూడు..." పైట తప్పించి పొట్ట చూపించిందామె. లోపల ప్రేగులు లేనట్టు కడుపు వీపుకి అతుక్కుపోయింది.

"... దీని కోసమే రాత్రి నీదగ్గిర తొంగు న్నాను. పిల్లలకి రెండు రోజులనుంచి బువ్వలేదు. నువ్వు పొద్దున్న ఇస్తానంటే, పిల్లల్ని రాత్రి వూరుకోబెట్టాను. వెలుగొచ్చాక బియ్యం తెచ్చి అన్నం వండుతానని ఆశగా చూస్తున్నారు. డబ్బులియ్యి పోతాను"

ఆ స్త్రీ మొహంలో గూడుకట్టిన దైన్యం చూస్తుంటే ఎలాంటి వార్కైనా హృదయం ద్రవిస్తుంది. ద్వివేది కళ్ళు చెమ్మగిల్లాయి.

"నా దగ్గిర పొందిన సుఖానికి నువ్వు డబ్బులియ్యంది, నేనెందుకియ్యాల?" అని తెలివిగా అన్నట్టు వెకిలిగా నవ్వాడు.

మరోసారి గొల్లుమన్నారు చుట్టూ వున్న వాళ్ళు.

ఆమె దెబ్బతిన్నట్టు చూసింది. మనసులో ఏమనుకుందో కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. రోషం నిండిన కనులతో అతన్ని చూసింది.

"తాగొచ్చి తిండిలేక ఎండిన ఈ రొమ్ముల్ని ముద్దాడావు. పశువుకంటే హీనంగా ఒళ్ళు హూనం చేశావు. జంతు వులు కూడా ఆ పని చేస్తాయి. అందులో నీ గొప్పేటుంది? పిల్లల్ని పోషించడానికి మానం అమ్ముకునే నాలాంటి దాని వుసురు వూరికే పోదు, పురుగులట్టిపోతావు" ఆవే శంగా అంది.

ఆ వ్యక్తి పట్టలేని కోపంతో లేచి బలంగా కొట్టాడు.

బలహీనమైన ఆ స్త్రీ, చెంపమీద తగిలిన దెబ్బ తట్టుకోలేక గిర్రున తిరిగి కిందపడబో యింది. మెరుపులా అటు వురికి కిందపడ కుండా పట్టుకున్నాడు ద్వివేది. తను ఖాళీ చేసిన బల్లమీద ఆమెను కూర్చోబెట్టాడు. అతని మొహం నిప్పులో కాల్చినట్టు అరుణ వర్ణం దాల్చింది. అగ్నికణాల మాదిరి ఎరు పుని సంతరించుకున్న కళ్ళతో బలిసిన ఆబో తులాంటి ఆ వ్యక్తిని చూశాడు.

"వచ్చాడండి పోటుగాడు, బతుకుచెడిన దాని పక్షాన..." వ్యంగ్యంగా అన్నాడా వ్యక్తి, ద్వివేది మొహంలో మారిన భావాలు పట్టిం చుకోకుండా. ఈసారి అతనికి మద్దతుగా చుట్టూ వున్నవాళ్ళు నవ్వలేదు.

ఎదురు తిరిగిన జంతువుపైకి రౌద్రంగా దూకబోతున్న సింహంలా కనిపిస్తున్న ద్వివే దిని చూసి అక్కడనుంచి పలాయనం చిత్త గించాలనే కోరిక కలగడమే వాళ్ళు నవ్వక పోవడానికి కారణం.

"నిస్సహాయురాలైన ఆడదాన్ని కొట్టి క్షమించరాని తప్పు చేశావు. ఆమెకి డబ్బు ఇచ్చేసి క్షమించమని వేడుకో" ద్వివేది గొంతునుండి తూటాల్లా వెలువడ్డాయి మాటలు.

"ఇవ్వను, ఏం చేస్తావ్?" రొమ్ము విరుచు కుని అన్నాడతను.

ద్వివేది బదులివ్వలేదు.

అతని కుడికాలు వేగంగా పైకిలేచి ఆ వ్యక్తి గుండెల్ని తాకింది. అతను వెనక్కి విరుచుకు పడిపోవడంవల్ల బల్ల ఒరిగిపో యింది. దానిమీద కూర్చున్న గ్రామస్తులు హడావిడిగా లేచారు.

అక్కడ ఒక్కసారిగా నిశ్శబ్దం చోటుచేసు కుంది.

ద్వివేదిని వారించడానికి ప్రయత్నించి అతను తన చెయ్యి వెనక్కి నెట్టడంతో చిన్న బోయి కూర్చుండిపోయాడు సుబ్బారెడ్డి. ఆ





సమయంలో ఎవరి మాటా వినిపించుకునే స్థితిలో లేనట్టు ఆవేశంతో వూగిపోతున్నాడు ద్వివేది.

ఆ వ్యక్తి చొక్కా పట్టుకుని విసురుగా టీ కొట్టు బయటకు నెట్టాడు. కుడికాలితో గుండెలమీద తన్నాడు ద్వివేది. నలుగురు మనుషులు పట్టుకుని విసిరినట్టు రోడ్డవతల పడ్డాడతను. ద్వివేదిని చూస్తూ లేచి నిలుచున్నాడు.

టీ కొట్టులోని జనం బయటకొచ్చి ఇద్దరి చుట్టూ మూగారు. అంతవరకూ ఆ వ్యక్తి మాటలకు విరగబడి నవ్విన వారెవరూ కల్పించుకునే ప్రయత్నం చెయ్యలేదు. అదంతా చూసి అసహనంగా కదిలేడు సుబ్బారెడ్డి.

ద్వివేది ఒక మనిషి చేతిలోని కర్ర లాక్కుని ఆ వ్యక్తివైపు విసిరాడు. దానిని గాలిలోనే అందుకుని అదనపు శక్తి సమకూరినట్టు చూశాడావ్యక్తి.

"ఇంతమంది మధ్య మనం ఓ పందెం వేసుకుందాం. నీకు నచ్చిన రీతిలో కర్రతో నన్ను గాయపర్చు. నామీద నీకెంత కోపం వుందో చూపించు. నువ్వు ప్రయోగించే కర్ర నా శరీరానికి తాకనివ్వను. గాయపరిస్తే నువ్వు, లేకపోతే నేను గెలిచినట్టు లెక్క. ఓడిన వారు గెలిచినమనిషి మాట వినాలి. నీకిష్టమేనా? " అడిగాడు ద్వివేది.

తృళ్ళిపడ్డాడు సుబ్బారెడ్డి. ఎలాంటి సందడీ సృష్టించకుండా ఆ సెంటర్ వదిలిపెట్టాలి. అందుకు భిన్నంగా అందరి దృష్టి ఇటు మళ్ళింది. పళ్ళబిగువున కోపం నిగ్రహించుకున్నాడు.

కర్ర అందుకున్న వ్యక్తి ద్వివేదికి బదులు చెప్పకుండా ముందుకొచ్చి బలంగా తలమీదికి విసిరాడు. ఆ దెబ్బకి తల రెండుగా విచ్చిపోయి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోవాల్సిందే. కాని ఆ వ్యక్తిని నిశితంగా గమనిస్తున్న ద్వివేది చురుగ్గా కాళ్ళు కదిపి ఓ అడుగు పక్కకు జరిగాడు. కర్ర నేలకి తగిలింది. కర్ర వెనక్కి తీసుకుని నడుము పైకి విసిరాడతను. ముందుకి పడిపోయి చేతులతో శరీరం భూమికి తగలకుండా ఆపుకుని వెంటనే పక్కకు దొర్లాడు ద్వివేది. దూసుకొచ్చిన కర్రకంటే వేగంగా కదలడంవల్ల ఆ దెబ్బ కూడా మిస్ అయింది.

ఆ వ్యక్తి బట్టలు చెమటతో ముద్దయ్యాయి. మరో రెండుసార్లు ప్రయోగించి కర్రని కనీసం ద్వివేది శరీరానికి తాకించలేకపోయాడు. ఆవేశంతో కర్ర పారేసి ముందుకి దూకి ద్వివేది గొంతు పట్టుకోబోయాడు. కుడిచేత్తో అతని చేతులు పక్కకు నెట్టి ఎడమచేతి పిడికిలితో మొహం పైన గుద్దాడు. అతను బాధగా అరిచి జనం కాళ్ళ దగ్గరపడ్డాడు.

మృత్యువులా తనని సమీపిస్తున్న ద్వివేదిని గమనించి రెండు చేతులూ జోడించాడు వదిలేయమన్నట్టు.

"ఆమెను కొట్టినందుకు నీకు మామూలు శిక్ష చాలదు... నువ్వు బతికున్నంతకాలం ఆమెకు భత్యం ఇచ్చి పోషించు" చెప్పాడు ద్వివేది.

ఏం చెయ్యమన్నా చెయ్యడానికి సిద్ధంగా వున్నట్టు తలూపాడు ఆ వ్యక్తి.

"నేను మళ్లీ వస్తాను. ఆమెను ఏదైనా అన్నట్టు తెలిసిందో ఈసారి నిన్ను ప్రాణాలతో వదలను" కటువుగా హెచ్చరించాడు.

సుబ్బారెడ్డి మిగతావారికి సైగచేసి అక్కడనుంచి కదిలాడు. ఒక్కొక్కరు అతన్ని అనుసరించడం గమనించి దూరంగా నిలుచున్న ఆ స్త్రీ దగ్గరకు వెళ్ళాడు ద్వివేది.

"నా అవసరం కలిగితే బరంపురం రైల్వే స్టేషన్ దగ్గరకొచ్చి ఏదైనా టీ కొట్టులో ద్వివేది మజుందార్ కావాలని అడుగు..." అని, సుబ్బారెడ్డి వెళ్ళినవైపు నడిచాడు. ఇప్పుడు తను ముంబయ్‌లో వుంటున్నాననే విషయం ఆ క్షణంలో గుర్తు రాలేదతనికి.

రెండు కిలోమీటర్లు నడిచి అందరూ

చెట్టుకింద ఆగారు.

"అనవసరమైన విషయాల్లోకి తలదూర్చి పదిమంది దృష్టిని ఎందుకు ఆకర్షిస్తావ్?" కోపంగా అడిగాడు సుబ్బారెడ్డి.

చిన్నగా నవ్వాడు ద్వివేది.

"ఒక అమాయకురాలి కష్టం తీర్చకపోతే మనం బతకడం దండగ కదా!"

"బజారు మనుషులతో పెట్టుకుంటే పని అయినట్టే..." బసవప్ప అన్నాడు.

"ఈ దేశంలో బజారు మనుషుల శాతం అధికం. మీకు అధికారం వస్తే వాళ్ళందర్నీ ఏం చేస్తారు?" చురుగ్గా ప్రశ్నించాడు ద్వివేది.

సంభాషణ కట్ చేస్తున్నట్టు బ్యాగ్ నుండి ఓ జత జంగిల్ షూస్ తీసి ద్వివేది వైపు విసిరాడు సిద్ధయ్య.

★ ★ ★

బైక్ రోడ్డు పక్క చీకట్లో ఆపి చుట్టూ పరికించి చూశాడతను. సిటీ లిమిట్స్‌కి పదికిలోమీటర్ల దూరంలో డెవలప్ అవుతున్న ప్రాంతమది. ఆ నిర్మానుష్య ప్రాంతంలో చీకటి విడిది చేసినట్టుంది. మట్టిరోడ్డు మీద అరకిలోమీటరు నడిచాడు. ఒక డాబా దగ్గిర ఆగి తనకి కావాల్సిన చోటు అదేనని నిర్ధారించుకుని గేటు తెరిచి లోపలకు వెళ్ళాడు.

"టక్ టక్... టక్ టక్ టక్..." చూపుడు వేలితో లయబద్ధంగా తలుపు చప్పుడు చేశాడు.

ఆ తలుపు కొద్దిగా తెరుచుకుని అతను లోపలికి వెళ్ళిన మరుక్షణం నిశ్శబ్దంగా మూసుకుంది. ఎవరో అతని చెయ్యి పట్టుకుని నడిపించుకువెళ్ళారు. లోపల గది తలుపు కూడా మూసుకున్న తరువాత లైటు వెలిగింది. గది మధ్యలో టీపాయ్‌కి అటూ ఇటూ రెండు కుర్చీలున్నాయి.

"కూర్చో..." స్విచ్ బోర్డు దగ్గరనుంచి కదులుతూ అన్నాడు రామ్‌బెహరా.

అతను ఒక కుర్చీలో కూర్చుని టీపాయ్ మీదున్న విస్కీబాటిల్ పేరు చదివాడు. తల పంకించి సిగరెట్ ముట్టించుకుని అడిగాడు.

"ఎందుకు రమ్మన్నావ్?"

రామ్‌బెహరా రెండో కుర్చీ ఆక్రమించి, గ్లాసుల్లో విస్కీ పోసి షోడా కలిపాడు.

"తీసుకో..."

ఆ వ్యక్తి గ్లాసు అందుకుని సిప్ చేశాడు.

"ఒక పనిలో నాకు సహకరించడానికి మనిషి అవసరమొచ్చి నీకు కబురు చేశాను..." చెప్పాడు బెహరా.

అతను ఆశ్చర్యంగా చూశాడు. సాధారణంగా బెహరా ఎవరితోను డైరెక్ట్ లింక్స్ పెట్టుకోడు.

"నువ్వు కేవలం తోడుగా వుంటే చాలు. మిగతా పని నేను చేసుకుంటాను. ఈ యాభైవేలు అడ్వాన్సు, పని ముగిసిన తరువాత లక్ష ఇస్తాను" చెప్పి ఐదు వందరూపాయల కట్టలు అతనివైపు నెట్టాడు.

నోట్లకట్టల్ని క్షణకాలం చూసి దృష్టి బెహరావైపు తిప్పి అడిగాడు.

"ఇంతకీ పనేంటి?"

"ముగ్గుర్ని హతమార్చాలి..."

పని అటువంటిదే అయివుంటుందని అనుకోవడంవల్ల ఆశ్చర్యపోలేదతను. ఉత్సాహంగా ప్రశ్నించాడు.

"ఎక్కడ? ఎప్పుడు?"

"ఇది అడవిలో చెయ్యాల్సిన పని. ముప్పై ఆదివారం నుంచి నాలుగు రోజులు సిటీకి దూరంగా వుండాలి. ఏదైనా పనివుంటే వాయిదా వేసుకో..."

ఇక మాట్లాడుకోవాల్సిందేం లేనట్టు ఇద్దరూ మౌనంగా రెండు పెగ్గులు మందు పుచ్చుకున్నారు. ఆదివారం ఎక్కడ కలుసుకోవాలో తెలుసుకుని అతను డబ్బుతో బయలుదేరాడు. గదిలో దీపం ఆర్పి ముందు గది తలుపు ఓ రెక్క తెరిచి ఆ వ్యక్తి బయటకు వెళ్ళిన మరుక్షణం తలుపు





మూసి గడియ పెట్టాడు బెహరా.

ఆ ఇల్లు మార్చాల్సిన సమయం వచ్చిందని అనుకున్నాడు.

★ ★ ★

ఉదయం సిటీ లిమిట్స్ దాటి కానిస్టేబుల్ని కాపలా పెట్టిన చోటుకి వెళ్ళాడు సూరి. ఎదురింటి వరండాలో కూర్చుని ఆ ఇంటి యజమానితో కబుర్లు చెబుతున్న కానిస్టేబుల్ హడావిడిగా లేచి టోపీ పెట్టుకుని సెల్యూట్ చేశాడు.

"ఆ ఇల్లెవరిది? " డాబాని చూస్తూ అడిగాడు సూరి.

కానిస్టేబుల్‌తో మాట్లాడుతున్న ఇంటి యజమాని జవాబిచ్చాడు.

"మేమిక్కడ ఇల్లు నిర్మించకముందే అక్కడ డాబా వుందిసార్! దాని ఓనర్ కుర్దారోడ్‌లో వుంటాడట..."

"అతని పేరేమిటి? "

తెలియదన్నట్టు తలూపాడు.

"ప్రస్తుతం ఇంట్లో ఎవరుంటున్నారు? "

"అప్పుడప్పుడూ తాళం తీసుంటుంది తప్ప మనుషులు కనిపించరండి"

తలపంకించి ఆ డాబావైపు కదిలాడు సూరి. కొన్ని అడుగులు వేసి చప్పున ఆగి ఆశ్చర్యంగా అన్నాడు.

"తాళంవేసుందే..."

సూరి అన్నదేమిటో మొదట బోధపడలేదు కానిస్టేబుల్‌కి. రెండు క్షణాల తరువాత తలుపుకి వేలాడుతున్న తాళంకప్ప చూసి అయోమయానికి గురయ్యాడు. నిన్నటినుంచి కదలకుండా అక్కడే వున్నాడు. రాత్రి పదకొండు గంటల సమయంలో ఆ ఇంటికి ఒకతను వచ్చి వెళ్లాడు. ఆ విషయం తెల్లారకముందే ఫోనులో సూరికి చెప్పివచ్చాడు.

ఆ వివరణ విని ఫోన్ చెయ్యడానికి వెళ్ళినప్పుడే ఇంట్లోని మనిషి అదృశ్యమయ్యాడని గ్రహించాడు సూరి. జేబులోంచి తాళాల గుత్తి తీసి కాసేపు ప్రయత్నించి తెరిచాడు. కానిస్టేబుల్ని అక్కడే వదిలి లోపలకు వెళ్ళాడు.

రెండు కుర్చీలు, టీపాయ్, మంచం తప్ప... లోపల ఏమీలేవు. ఒకటి తప్పించి మిగతా గదులు వాడకానికి ఉపయోగించనట్టు దుమ్ముతో వున్నాయి. ఒక మనిషి శాశ్వత నివాసంలాలేదు. టీపాయ్ మీదున్న టెలిఫోన్ నెంబరు నోట్ చేసుకున్నాడు.

రాత్రి మనిషి వచ్చినప్పుడు వాచ్ చేస్తున్న కానిస్టేబుల్ని గమనించి వుండాలి. ఉన్నట్టుండి అదృశ్యం కావడానికి అంతకుమించి కారణం కనిపించడంలేదు. అంత ఎలర్ట్‌గా జీవిస్తున్న అతని వృత్తేమిటి?

బయటకొచ్చి తాళం వేసేసి, ఆ ఇంటికి ఎవరైనా వస్తే తనకి వెంటనే తెలియచెయ్యడానికి కానిస్టేబుల్‌కి చెప్పి స్టేషన్‌కొచ్చాడు. కొద్దిసేపు ఆలోచించి ఫోన్ దగ్గరకు లాక్కుని ఒక నెంబరు తిప్పాడు.

"నిహ్లాని స్పీకింగ్..." అటునుంచి వినిపించింది.

సూరి కుడిచెయ్యి మౌత్‌పీస్‌ని కర్చీఫ్‌తో మూసింది. గొంతు సర్దుకుని చెప్పాడు,

"రామ్ బెహరాని"

"ఇప్పుడేగా ఫోన్ చేశావు. నాలుగురోజులు వుండనని, సూరిని చంపడానికి అద్భుతమైన పథకం సిద్ధం చేశానని అన్నావు. అప్పుడు చెప్పడం మరిచాను. పథకం అమలు చేసేముందు నన్ను కాంటాక్ట్ చెయ్యి"

లైను కట్‌చేసి నుదురుకి పట్టిన చెమట తుడుచుకున్నాడు సూరి.

తనని చంపడానికి నియమించిన వ్యక్తి పేరు రామ్‌బెహరా. నిహ్లాని అతనితో ఒప్పందం కుదుర్చుకుని ఇద్దరూ హోటల్లో కలిశారు. అదేరోజు హత్యాప్రయత్నం జరిగింది. బుర్రలో కొలువు తీరిన సందేహాలు చాలావరకూ అదృశ్యమయ్యాయి.

రామ్‌బెహరా ఎక్కడికి వెళ్ళాడు?

అదేసమయంలో తెల్లవారుజామున

ద్వివేది బస్సెక్కడం చూసిన కానిస్టేబుల్ స్టేషన్‌కొచ్చి ఆ విషయం సూరికి చెప్పాడు. రెండు క్షణాలు మౌనంగా వుండిపోయాడు సూరి.

"పదిన్నరకి కమీషనర్ ఆఫీస్ దగ్గర వుండు, నేనొస్తాను" అని చెప్పి స్టేషన్ నుంచి బస్టాండ్ చేరాడు.

ఉదయం వెళ్ళిన ఆ బస్సు ఏజన్సీ గ్రామాల మీదుగా మధ్యాహ్నం ఇచ్ఛాపురం చేరుకుంటుంది. తిరిగి అక్కడ బయలుదేరి రాత్రి పదిగంటలకు బరంపురం వస్తుంది. రెండుగంటల్లో చేరాల్సిన ఇచ్ఛాపురం ఎనిమిది గంటల్లో చేరుకునే ఆ బస్సుని ఏజన్సీ గ్రామాల ప్రజలు మాత్రమే ఉపయోగించుకుంటారు. అంటే ద్వివేది ఏజన్సీ గ్రామం వెళ్ళి వుండాలి. అతను ఎక్కడ దిగాడో తెలియాలంటే బస్సు తిరిగి రావాలి.

బస్‌స్టాండ్ నుంచి కమీషనర్ ఆఫీస్‌కి వెళ్ళాడు సూరి. ఆఫీస్ ముందు కమీషనర్ కారుంది. చెట్టుకింద కానిస్టేబుల్ వున్నాడు.

"అవసరమైతే పిలుస్తాను, ఇక్కడే వుండు..." కానిస్టేబుల్‌తో చెప్పి కమీషనర్ రూమ్‌లోకి వెళ్ళాడు సూరి.

కదలకుండా నిలబడిపోయాడు కానిస్టేబుల్.

రెండునిముషాల తరువాత కాలింగ్‌బెల్ శబ్దానికి ఆఫీస్ ఆర్డర్లీ హడావిడిగా లోపలికి వెళ్ళడం గమనించాడు. క్షణంలో అంతకంటే వేగంగా బయటకొచ్చి మినిస్టీరియల్ స్టాఫ్ వుండేదిశగా పరిగెత్తాడతను. ఒక క్లర్క్ ఫైల్ పట్టుకుని కంగారుగా కమీషనర్ రూమ్‌లోకి వెళ్ళాడు. ఎప్పుడూ కనిపించే దృశ్యాలే కావడంతో కానిస్టేబుల్ నిర్లిప్తంగా వుండిపోయాడు.

ఆఫీస్‌ముందున్న వృక్షం నీడ విశాలంగా నేలమీద పరుచుకుంది. గాలికి చిన్నగా చప్పుడు చేస్తూ ఆకులు కదులుతున్నాయి. ఆ నీడలోని చల్లదనం, గాలిలోని స్వచ్ఛత చెట్టుకింద నిలబడిన కానిస్టేబుల్ ఆస్వాదించడంలేదు

"పద..." అని కార్యాలయంలోకి దారితీశాడు సూరి.

అతను బయటకు రావడం చూడని కానిస్టేబుల్ వులిక్కిపడి తన పరాకుకి తిట్టుకుంటూ సూరిని అనుసరించాడు. ఒక క్లర్క్ దగ్గర సూరి ఆగితే తనూ ఆగాడు కానిస్టేబుల్.

"ఇక్కడ సంతకం చెయ్యి" క్లర్కు అన్నాడు.

కానిస్టేబుల్ సంతకం చేశాడు.

"బ్యాంక్‌కి వెళ్ళి క్యాష్ తీసుకో" చెక్కు అందించి చెప్పాడు క్లర్క్.

ఆ చెక్కులో రాసున్న సంఖ్య చూసి తనకి వెల్ఫేర్ లోను శాంక్షన్ అయిందని గ్రహించి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. సిబ్బందిని బిడ్డల్లా చూసే అధికారి కింద పనిచెయ్యడం అతని సర్వీస్‌లో అదే ప్రథమం. కృతజ్ఞత ప్రకటించడానికి గొంతు సహకరించకపోతే, ఆ విషయం అర్థం చేసుకున్న కళ్ళు ఆ పనిచేశాయి.

సూరి సమర్థుడైన అధికారి అనడంలో ఎలాంటి సందేహంలేదు. అతను ఆ పేరు సంపాదించుకోవడానికి సిబ్బంది చూపించే విశ్వాసం కొంత కారణం. నడవలేని ఎద్దు కంటే నడవడానికి ఇష్టపడని ఎద్దు ఎక్కువ నష్టం కలిగిస్తుంది. మొదటిది అనారోగ్యమైతే, రెండోది అనారోగ్యకరమైన విధానం. ఇది తెలిసిన సూరి, సిబ్బంది సమస్యలు పరిష్కరించడం ద్వారా పనితీరు మెరుగుపడేట్టు చూస్తాడు.

అతని విజయరహస్యం అదే!

"పని చూసుకుని రేపు స్టేషన్‌కి రా..." కానిస్టేబుల్‌తో చెప్పి స్టేషన్‌కొచ్చాడు సూరి.

అక్కడ ఎదురుచూస్తున్న ఆటోడ్రైవర్ చెప్పాడు,

"గురువారం హోటల్ కైలాష్‌నుండి వచ్చిన కష్టమర్ని నేనే తీసుకెళ్ళాను సార్"

అతన్ని ఎక్కడ దించిందీ తెలుసుకున్నాడు సూరి. నిహ్లోని వెళ్ళిన ఇంటి వివరాలే అతను చెప్పాడు. ఫోన్ అందుకుని 'క్లూస్'కి రింగ్‌చేసి రామ్‌బెహరా గురించి అడిగాడు. అరగంట తరువాత రామ్‌బెహరా సమాచారం ఏమీలేదని 'క్లూస్' నుంచి ఫోన్ వచ్చింది.

★ ★ ★

ఆ ఇల్లు మార్చాల్సిన సమయం వచ్చిందనుకున్న బెహరా, తలుపు మూస్తున్నప్పుడు ఎదురింటి వరండాలో నిప్పుకణం ఒకటి చూశాడు. అక్కడ ఎవరో కూర్చుని సిగరెట్ కాలుస్తున్నారని గ్రహించాడు. పగలే మనుషులు సంచరించని ఆ ప్రాంతంలో అర్థరాత్రి ఎవరున్నారు?

కిటికీవైపు కదిలి బోల్ట్ తప్పించి ఒక రెక్క తెరిచి చూశాడు. చీకటివల్ల ఏమీ కనిపించడంలేదు. సిగరెట్ కాల్చడం పూర్తయినట్టు నిప్పుకణం నేలమీద పడింది. బెహరా ఓపిగ్గా వేచి వున్నాడు. ఆ వృత్తిలో సహనం చాలా అవసరం. ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటాడు కాబట్టే అతనిపేరు ఎప్పుడూ బయటకు రాలేదు. కొంతసేపు గడిచిన తరువాత అగ్గిపుల్ల వెలిగింది. ఆ కాస్త వెలుగులో ఓ ఆకారం లీలగా కనిపించింది. ఆ మనిషి ఇప్పట్లో అక్కడనుంచి కదలడని గ్రహించాడు.

కిటికీ దగ్గరనుంచి కదిలి గదిలోకి వచ్చాడు. ఆ ఇంటినుంచి ఎప్పుడు పడితే అప్పుడు వెళ్ళిపోవడానికి వీలుగా సామాను వుంచలేదు. ఎలాంటి ఆనవాళ్ళు లేకుండా సిగరెట్ పీకలు, అగ్గిపుల్లలు ఏరి ప్లాస్టిక్ సంచిలో వేశాడు. ఫోన్‌పైన వేలిముద్రలు లేకుండా తుడిచాడు.

కిటికీ దగ్గరే కూర్చుని నిరీక్షిస్తున్న బెహరాకి తెలతెలవారుతుండగా ఎదురింటి వరండాలోని వ్యక్తి స్పష్టంగా కనిపించాడు.

మొదటిచూపులోనే అతను పోలీసు మనిషిగా పసిగట్టాడు బెహరా. తన వునికి పోలీసులకు తెలిసిందా? రాత్రివచ్చిన మనిషిని అనుసరించారా?

ఆ పోలీస్ లేచి అవతలికి వెళ్ళడం చూసి సూట్ కేస్, ప్లాస్టిక్ సంచి తీసుకుని బయట కొచ్చి తలుపుకి తాళం వేశాడు.

★ ★ ★

జంగిల్ షూస్ వేసుకుని సుబ్బారెడ్డి బృందం ప్రయాణం ప్రారంభించింది. రెండుపక్కలా మోకాలి ఎత్తున పెరిగిన గడ్డిలో కాలిబాట స్పష్టంగా కనిపిస్తోంది. అక్కడక్కడా ఆ బాట చీలిపోతున్నా దారి సుపరిచితమైనట్టు సుబ్బారెడ్డి చకచకా అడుగులు వేస్తుంటే మిగతావారు అనుసరిస్తున్నారు. క్రమంగా దట్టమైన అడవిలోకి ప్రవేశించారు.

నిటారుగా కనిపిస్తున్న గుగ్గిలం చెట్లు ఆకాశాన్ని తాకుతున్నాయి. రకరకాల చెట్లతోను, పేరు తెలియని తీగలతోను నిండిన అడవిలో కాలిబాట సూటిగా వెళుతోంది. ఎగుడుదిగుడు నేలమీద అడుగులు జాగ్రత్తగా వేస్తూ చుట్టూ చూసుకుంటూ సాగిపోతున్నారు. అప్పుడప్పుడూ అడవికోళ్ళ అరుపులు వినిపిస్తున్నాయి. రంగురంగుల పిట్టలు చెట్లపైనుంచి పాటలు పాడుతున్నాయి. వల మాదిరిగా చెట్లకి అల్లుకున్న తీగలకు నీలి పువ్వులు, పాలపువ్వులు వున్నాయి.

ఒక్కొక్క అడుగు పడుతుంటే అడవి మరింత చిక్కనవుతోంది.

గలగల పారుతోన్న గెడ్డ దాటారు. నీటి అడుగున నేల, నీటిలో ఈదుతున్న చేపపిల్లలు కనిపించాయి. గెడ్డ అవతల ఎడమవైపుకి తిరిగి ఇంకా దట్టమైన అడవిలోకి వాళ్ళని తీసుకుపోయింది కాలిబాట. ఆకాశంలో మేఘాలు కమ్మినట్లు చిక్కటి చెట్లకొమ్మలను దాటి సూర్యకిరణాలు భూమిపైన ప్రసరించలేకపోతున్నాయి. చెట్లు నరికిన దానికి గుర్తుగా అక్కడక్కడా నేలమీద మొదళ్ళు దర్శనమిస్తున్నాయి.

నడక మందగించింది.

అందరికంటే వెనుక అడుగులు వేస్తున్న ద్వివేది పరిసరాలను జాగ్రత్తగా చూస్తున్నాడు. ఎప్పుడూ అడవిని చూడకపోవడం వల్ల ఆ ప్రయాణం ఉత్సాహంగా వుంది. అతను నడుస్తుంటే భుజానికి తగిలించుకున్న బ్యాగ్‌తోపాటు లోపల దాచిన విస్కీ సీసా కూడా కదులుతోంది.

బాట నెమ్మదిగా పైకి సాగడంవల్ల అడుగులు మరింత కష్టంగా పడుతున్నాయి. చెమట పట్టిన శరీరానికి చల్లటి గాలి తగిలి శ్రమ తెలియడంలేదు. ఒకపక్క చెమట ఆరుతుంటే, మరోపక్క స్వేదం ఉద్భవిస్తోంది. పూర్తిగా ఎత్తు ఎక్కి వెనక్కి చూస్తే నడిచి వచ్చిన మార్గం కనిపించలేదు. పచ్చదనం చిక్కగా ఎగుడుదిగుడుగా పరుచుకుంది. అక్కడనుంచి ఏటవాలుగా కిందకు దిగి మైదానం వంటి ప్రదేశం చేరుకుని పెద్ద వృక్షం నీడన ఆగారు.

సూర్యుడు నడినెత్తిపైకి చేరుకోవడంవల్ల వృక్షం కింద నీడ సమాంతరంగా పడుతోంది. లగేజి నుండి బ్రెడ్ తీసి తలొకటి ఇచ్చాడు సిద్ధయ్య. అందరూ రొట్టె తిని సీసాలతో తెచ్చుకున్న నీరు తాగారు. సిగరెట్ వెలిగించుకుని చెట్టుకి జారబడ్డాడు ద్వివేది. తలకింద చేతులు పెట్టుకుని అతని పక్కన పడుకున్నాడు సుబ్బారెడ్డి.

"ఇంకా ఎంతదూరం నడవాలి? " సుబ్బారెడ్డిని అడిగాడు ద్వివేది.

"సాయంకాలానికి చేరుకుంటాం. కోందులు అనే ఆటవిక జాతి గురించి ఎప్పుడైనా విన్నావా? " ప్రశ్నించాడు.

తెలియదన్నట్టు తలూపాడు ద్వివేది.

"బరంపురంలో పుట్టిన నీకు కోందుల గురించి తెలియకపోవడం ఆశ్చర్యంగా వుంది..." అని రెండుక్షణాల తరువాత చెప్పసాగాడు.





"మాక్ పెర్సన్ అనే అధికారి తెలుగులోని 'కొండ' అనే పదంనుంచి కోందు పుట్టిందని భావించాడు. కోందులు ఎక్కువగా భుజాలతో బరువులు ఎత్తుతారు కాబట్టి సంస్కృతంలోని 'స్కంధ' లేదా 'కంద' అనే పదాల నుండి కోందు పుద్భవించిందని కొందరంటారు. అనాగరిక సాంప్రదాయాలతో మూఢాచారాలు పట్టుకుని వేలాడే కోందు జాతి ప్రాచీన ఆదిమ తెగలకు చెందుతుంది. వీళ్ళు 'కుభి' భాష మాట్లాడతారు. ఒరియా లిపి ఆధారంగా కెప్టెన్ ఫ్రే అనే భాషా శాస్త్రవేత్త కుభి మాండలికాన్ని బోధనాస్థాయికి తీసుకొచ్చాడు" ఆగి వూపిరి తీసుకున్నాడు.

"కోందుల ఆచారాలు, నమ్మకాలు బహు విచిత్రంగా వుంటాయి. గుర్రం సిద్ధం చేసుకుని ఆయుధం తెచ్చుకోవడానికి కోందువెళితే తమ్ముడు ఆ గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడట. అన్నకి దక్కాల్సిన రాజ్యాన్ని తమ్ముడు ఆవిధంగా చేజిక్కించుకున్నాడు. తమ్ముని మోసం క్షమించి అన్న అడవిని నమ్మి జీవిస్తున్నాడని ఆ జాతి తమ బతుకుల గురించి చెప్పుకుని వాపోతుంది. ఎప్పుడో రాముడనే రాజు కొడుకు భార్యని, తమ్ముడ్ని వెంటపెట్టుకుని అడవికి వచ్చాడట. రాక్షస రాజుల అక్రమాలు రూపుమాపడానికి కోందులు రాముడికి నాయకత్వం అప్పగించారట. ప్రాస్నా వంశానికి చెందిన హనుమకోదు (హనుమంతుడు) అతనికి సాయం వెళ్ళాడు. రాముడు అన్నిగ్రామాల కోందుల్ని ఒకచోట చేర్చి సైన్యం తయారు చేశాడు. కోందులు యుద్ధంచేసి రాముడ్ని గెలిపించారని ఆ జాతి చెప్పుకునే పురాణ గాధ. నాగరీకులు పూజించే రాముడు ఈ కోందు జాతికి ఎలా పరిచయమో అంతుబట్టని విషయం"

"ఇన్ని వివరాలు మీకెలా తెలిశాయి?" ద్వివేది అడిగాడు.

"ఉద్యమంలో తిరిగినప్పుడు ఈ గ్రామాలకు వచ్చేవాడిని. వీరిభాషతోను, ఆచారాలతోను అప్పుడే పరిచయమేర్పడింది. వీళ్ళ గ్రామాలు ఎన్నోసార్లు మా ప్రాణాలు రక్షించాయి. మనం చేరబోయే మిణి అపాయు గ్రామపెద్ద దివుడు సావోతా నాకు మిత్రుడు" చెప్పాడు సుబ్బారెడ్డి.

గంట విశ్రాంతి అనంతరం తిరిగి ప్రయాణం కొనసాగించారు.

ఆకాశంలో సూర్యుడు పశ్చిమదిశకు దిగిపోతున్నాడు. మరో కొండ వారికి ఎదురైంది. నలభైదాటిన సుబ్బారెడ్డి అడుగుల్లో వేగం మందగించడంతో మిగతావారు కూడా నెమ్మదిగా నడుస్తున్నారు. సూర్యుడు మరింతగా కిందకు జారాడు. కొండెక్కి అలుపు తీర్చుకుని చెయ్యెత్తి చూపించి చెప్పాడు సుబ్బారెడ్డి.

"అదే మిణి అపాయు"

చిన్నపిల్లలు మట్టితో చేసిన బొమ్మల్లా గుంపుగా కనిపిస్తున్నాయి గుడిసెలు. రెండుకొండల నడుమ వున్న జాగాలో చెట్ల మధ్య వున్నదా గ్రామం. కొండమీద నుంచి కనిపించిన ఆ గ్రామం చేరడానికి గంటపైనే పట్టింది. గోచీలు పెట్టుకున్న మగవాళ్ళు, రొమ్ములకు ముతకచీర కప్పుకున్న ఆడవాళ్ళు, ఒంటిపైన ఎలాంటి ఆచ్ఛాదనాలేని పిల్లలు గ్రామంలోకి ప్రవేశిస్తున్న సుబ్బారెడ్డి బృందాన్ని చూసి భయంతో దూరంగా తప్పుకున్నారు.

కొత్త మనుషుల్ని చూసి ఓ కుక్క మొరగడంతో మరికొన్ని శునకాలు వంత పాడాయి. గ్రామంలో విచ్చలవిడిగా కోళ్ళు, పందులు సంచరిస్తున్నాయి. చెత్తాచెదారం పోగుపడి పరిసరాలు అసహ్యంగా కనిపిస్తున్నాయి.

దూరంగా నిలబడిన ఓ కోందుని సమీపించి అడిగాడు సుబ్బారెడ్డి.

"దివుడు సావోతా వున్నాడా?"

ఆశ్చర్యంగా తలూపాడతను.

సుబ్బారెడ్డి తిన్నగా ఓ గుడిసె దగ్గరకు

వెళ్ళాడు. ఒకతను గుడిసెనుంచి బయట కొచ్చి కళ్ళు చిట్లించి చూసి సుబ్బారెడ్డిని గుర్తుపట్టి స్నేహపూర్వకంగా నవ్వాడు. సూర్యుడు అస్తమించడానికి సమాయత్తమవుతున్న ఆ సమయంలో కూడా అతని మొహంలోని వెలుగు, వాళ్ళరాక సంతోషం కలిగించినట్టు తెలియచేస్తోంది.

"ఝూకరపేను పూజకి అతిథులొచ్చారు" గ్రామస్తులకు వినిపించేటట్టు చెప్పాడు దివుడు సాహోతా. కోందులంతా ఒక్కసారిగా అరిచి తమ సంతోషం వ్యక్తం చేశారు.

గ్రామంలో యాభైకి మించిలేని గుడిసెల్లో దివుడు సాహోతా గుడిసె కూడా కలిసిపోయింది. సాహోతా పదవి వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. దివుడు తండ్రి మరణించేవరకూ గ్రామపెద్ద (సాహోతా)గా వున్నాడు. సాహోతా తీసుకున్న నిర్ణయానికి గ్రామంలో తిరుగుండదు.

కుశలప్రశ్నల అనంతరం అతిథులకు రెండుపాకలు చూపించాడు దివుడు.

"ఝూకరపేను పూజంటే ఏమిటి? " సిద్ధయ్యని అడిగాడు ద్వివేది.

దివుడు సాహోతా నవ్వుతూ చూశాడు ద్వివేదిని. ఆ నవ్వులో సాటిమనుషుల పట్ల ప్రేమ, అభిమానం తప్ప మరో భావం లేదు. చింకి పంచె మడిచి గోచీలా కట్టుకున్నాడు. పిచ్చిగా పెరిగిన తలవెంట్రుకలు వెనక్కి లాగి ముడివేశాడు. మెలి తిరిగిన కండరాలతో శరీరం రాయిలా కనిపిస్తోంది.

"మీద ఆకాశం, కింద భూమి అన్నిటి కంటే గొప్పవి. కోందుజాతి ప్రకృతినే దైవంగా కొలుస్తుంది. గృహదేవతని తొలుత పూజించి పక్షంరోజుల తరువాత ఝూకరపేను పూజ జరుపుతాం. ఝూకరపేను అంటే తల్లి భూదేవి" చెప్పాడు దివుడు సాహోతా. అతని గొంతులో ఒరియా పదాలు చిత్రమైన యాసతో ధ్వనిస్తున్నాయి.





ఎవరో పిలిస్తే అతను వెళ్ళిపోయాడు.

రెండు గుడిసెల్లో సుబ్బారెడ్డి బృందం సర్దుకుంది.

గ్రామం చివరనుండి వాయిద్యాల సవ్వడి వెలువడుతోంది. అక్కడ యువతీయువకులు చేరి తరతరాలనుండి ఆచారంగా వస్తున్న 'ధింసా' నృత్యం చేస్తున్నారు. కల్లు, విప్పసారాయి వాసన గాలిలో కలిసి నలుదిశలా వ్యాపించింది. ఎవరు ఎంత తాగుతున్నారో తెలియని అయోమయస్థితి నెలకొందక్కడ.

దివుడు సాహోతా ముంతలతో విప్పసారా అతిథులకు పంపాడు. సుబ్బారెడ్డి, సిద్ధయ్య వాటిని కన్నెత్తి చూడలేదు. ద్వివేది ఒక ముంత అందుకుని కొద్దిగా రుచి చూశాడు.

ఘాటైన వాసనతో వేడిగా గొంతు దిగింది సారా.

గుడిసెలో నూనెదీపం వెలిగింది. అందరూ గెడ్డకెళ్ళి స్నానాలు చేసి వచ్చారు. మట్టి పాత్రలతోను, ఆకులతోను ఆహారపదార్థాలు తెచ్చారు కోందులు. దివుడు సాహోతా హడావిడిగా ఆ ఏర్పాట్లు చేశాడు. మట్టి పాత్రలోని చిక్కటి ద్రవపదార్థం చూసి విస్మయంగా అడిగాడు ద్వివేది.

"ఇదేమిటి? "

సుబ్బారెడ్డి నవ్వి చెప్పాడు.

"చోడంబలి... కోందుల ముఖ్యమైన ఆహారం. సంవత్సరంలో సగంరోజులు అంబలి తాగుతారు. జీలుగుచెట్ల బెరడు, మామిడి టెంకల గుజ్జు, దుంపలు తిని మిగతా రోజులు గడుపుతారు"

"ఈరోజు మాంసం తినను" ఆకులోని కూర పక్కకి నెట్టాడు ద్వివేది.

"ఎందుకని? "

"శనివారం"

"శనివారం సారా తాగొచ్చు, మాంసం తినకూడదు. అంతేనా? "

మౌనంగా వుండిపోయాడు ద్వివేది.

"నిత్యం పంచభక్ష్యపరమాన్నాలూ ఆరగించే మనుషులు ఆహారనియమం పాటిం

చడం సహజం. తిండికి మొహం వాచిన నిరుపేదని శనివారం అది తినొద్దు, ఇది తినొద్దంటే అతనిచ్చే జవాబు ఏమిటో ఆలోచించు"

విప్పసారా మత్తుని ఆ మాటలు వదలగొడుతున్నట్టు తోచి మట్టి పాత్రలోని చోడంబలి తాగి అలాగే నిద్రలోకి జారిపోయాడు ద్వివేది.



రాత్రి పదిన్నరకి బరంపురం బస్‌స్టాండ్‌కి వచ్చింది ఉదయం వెళ్ళిన బస్సు. సూరి బస్సు దగ్గరకు వెళ్ళి కండక్టర్‌కి ద్వివేది ఫోటో చూపించి అడిగాడు,

"ఇతను ఉదయం రైల్వేస్టేషన్ వద్ద బస్సెక్కాడు. ఎక్కడ దిగాడు?"

"అప్పుడు డ్యూటీ నాదికాదు సార్. ఆ స్టాఫ్ ఇచ్ఛాపురంలో దిగిపోయి తిరిగి రేపు రాత్రికి బస్సులో వస్తారు" చెప్పాడు కండక్టర్.

అంతవరకూ టెన్షన్‌గా ఎదురు చూసిన సూరి అనీజీగా కదిలాడు.

"ఇచ్ఛాపురంలో కండక్టర్ ఇల్లెక్కడ?"

"అతను భార్యని తీసుకుని పలాస వెళ్ళి రేపు మధ్యాహ్నం బస్సు టైమ్‌కి వస్తానని చెప్పాడు సార్"

మరోసారి అనీజీగా కదిలాడు సూరి.

ఫోటోలోని వ్యక్తి కనిపిస్తే స్టేషన్‌కి తెలియచెయ్యమని కండక్టర్‌కి చెప్పి బైక్‌వైపు నడిచాడు.

అనుకున్న పని పూర్తికాకపోవడంతో అశాంతిగా వుంది.

★ ★ ★

ఎయిర్‌బ్యాగ్‌తో ఆదివారం వుదయం రైల్వేస్టేషన్‌లోకి ప్రవేశించి చుట్టూ కలియచూశాడు ఆ వ్యక్తి. ప్లాట్‌ఫాం చివర పాసింజర్స్ వెయిటింగ్ ప్లేస్‌లో కూర్చుని కనిపించాడు రామ్ బెహరా. అటువైపు నడిచి అతని పక్కన కూర్చుని అడిగాడు,

"టిక్కెట్లు తీసుకున్నావా?"

ఫ్లాట్‌ఫాంమీద సంచరిస్తున్న పోలీసుల్ని గమనిస్తున్న బెహరా, తనచూపు మళ్ళించకుండానే తలూపాడు. ఆంధ్రప్రదేశ్‌లోకి వెళ్ళే ట్రైన్ వద్ద పోలీసు కాపలా వుంటుంది. ఒరిస్సానుండి అక్రమంగా మద్యం రవాణా చేసేవారిని పట్టుకోవడానికి ఆ ఏర్పాటు చేశారు.

డేగకళ్ళతో ప్రయాణీకుల్ని, వారి సామాన్లని పట్టిపట్టి చూస్తూ బెహరా కూర్చున్నచోటికి వచ్చారు పోలీసులు. బరువుగా కనిపిస్తున్న బ్యాగ్‌ల్ని చూసి ఒక పోలీసు లాఠీతో వాటిమీద కొడుతూ ప్రశ్నించాడు.

"లోపల ఏముంది?"

"బట్టలు"

బ్యాగ్‌లు ఎత్తి అటూఇటూ కదిపాడా పోలీసు. ఎలాంటి చప్పుడు వినిపించకపోవడంతో వాళ్ళిద్దరివైపు ఓసారి చూసి అక్కడనుంచి వెళ్ళిపోయాడు. వాళ్ళు వెళ్ళిపోవడం చూసి నవ్వాడు బెహరా. రైల్వేస్టేషన్‌లో బ్యాగ్స్ చెక్ చేస్తారని అతనికి తెలుసు. బ్యాగ్ కదిపితే సీసాలోని మద్యం చప్పుడు చేస్తుంది. అది ఆలోచించే వాటర్ బాటిల్ కూడా తీసుకురాలేదు బెహరా. నీటి శబ్దం విని బ్యాగ్ తెరిస్తే వెపన్స్ కనిపిస్తాయి.

మెయిల్లో జనరల్ కంపార్ట్‌మెంట్‌లో ఇద్దరూ ఎక్కారు. మూడుగంటల ప్రయాణం తరువాత శ్రీకాకుళం రోడ్డు స్టేషన్‌లో దిగి బయటకొచ్చారు. బస్‌స్టాండ్ చేరుకుని ఒక బస్సెక్కారు. జేబులోంచి ఒక స్లిప్ తీసి పదేపదే చూడటం గమనించి బెహరాని ఆ వ్యక్తి అడిగాడు,

"ఏమిటది? "

"కొత్త ప్రదేశాలు కాబట్టి పేర్లు రాసుకున్నాను"

పార్వతీపురం చేరుకుని లాడ్జిలో రూం తీసుకున్నారు. రూమ్‌బాయ్‌ని పిలిచి విస్కీ బాటిల్ తెప్పించాడు బెహరా.

★ ★ ★

మరునాడు ప్రయాణానికి సిద్ధపడిన సుబ్బారెడ్డి బృందాన్ని పండుగరోజు గ్రామం విడిచి వెళ్ళడం సాంప్రదాయం కాదని చెప్పి ఆపేశాడు దివుడు సావోతా. అదీగాక ఒకే సారి పాతిక కిలోమీటర్లు నడవటంవల్ల శరీరాలు ఇంకా విశ్రాంతి కావాలని కోరుతున్నాయి. అందుచేత ప్రయాణం వాయిదా వెయ్యడాన్ని ఎవరూ వ్యతిరేకించలేదు.

గెడ్డకెళ్ళి స్నానాలు చేసి వచ్చిన తరువాత అతిధుల్ని ఝూకరపేను పూజవద్దకు తీసుకుపోయాడు దివుడు. ఊరుచివరి మర్రి చెట్టు కింద శుభ్రంచేసిన చోట ఆటబొమ్మల్లాంటి గుర్రాలు, చిన్నచిన్న కత్తులు, ఈటెలు పడున్న ప్రదేశానికి చుట్టూ నిలబడున్న గ్రామస్తుల్లో కలిసిపోయింది సుబ్బారెడ్డి బృందం.

అలా పడున్న బొమ్మలకి ఎరుపు, నలుపు రంగు చుక్కలున్నాయి. విప్పసారా జల్లి మోకాలు ఎత్తు పందిరిమీద కోడిగుడ్లు చితక్కొట్టి వుంచారు. కొత్త తువ్వాలు చుట్టుకున్న రింగాజాని (పురోహితుడు) మంత్రాలు చదువుతూ పసుపురాసిన కోడిపిల్లకి బియ్యం తినిపించాడు. ఆ కోడి పిల్లని పైకెత్తి పందిరిచుట్టూ మూడుసార్లు తిప్పి చేత్తో పీక తెంపి రక్తం నేలమీద పోశాడు. ఎప్పటినుంచో అలా పోస్తున్న రక్తం అక్కడ పేరుకుని వుంది.

ఆ క్షణంకోసమే చూస్తున్నట్టు పెద్ద చప్పుడుతో డోలు మోగింది. రింగాజాని పెదాలు జోరుగా మంత్రాలు వల్లెవేస్తున్నాయి. ముసలమ్మలు ఒకరిచేతులు ఒకరు పట్టుకుని పందిరి చుట్టూ ఏడుసార్లు తిరిగారు. బెజుణి (మంత్రగత్తె) శ్లోకాలు చదువుతూ ఎగురుతోంది. సారా మత్తులో మునిగినట్టు ఆమె కళ్ళు సగం మూసుకున్నాయి. గ్రామస్తులు మరింత భయభక్తులు ప్రదర్శిస్తూ కదలకుండా వుండిపోయారు.

ఓ పక్క నిలుచుని ఆశ్చర్యంగా గమనిస్తున్నాడు ద్వివేది. కోడిపిల్ల పీక తెంపినప్పుడు అతని శరీరం జలదరించింది.

పూజ ముగియడంతో అందరూ వెనక్కి తిరిగారు.

★ ★ ★

సిద్ధయ్య వూరుబయటకు వెళ్ళడం చూసి ద్వివేది అనుసరించాడు. ఆ చల్లటి వాతావరణంలో ఇద్దరూ కొంతదూరం నడిచి ఓ మామిడి చెట్టుకింద కూర్చున్నారు. కొండ మీదనుంచి తెరలు తెరలుగా వస్తున్న గాలి విసురుగా మొహాలకు తగుల్తోంది. గాలికి ఆరిపోకుండా అటు తిరిగి అగ్గిపుల్ల వెలిగించి సిగరెట్ ముట్టించుకున్నాడు ద్వివేది.

"గోర్కీకి డబ్బు స్వంతం చేసుకోవడం ముఖ్యం కాని మిమ్మల్ని చంపడం కాదు కదా? " అడిగాడు.

"మేము బతికుండగా డబ్బు దక్కనివ్వమని అతనికి తెలుసు. పైగా అతను చేసిన ద్రోహం మాకు తెలిసిపోయిందని ఈ పాటికి గ్రహించి వుంటాడు. మమ్మల్ని బతకనిస్తే అతను ప్రమాదం కొని తెచ్చుకున్నట్టే"

"డబ్బు ఎక్కడుందో తెలియకుండా మిమ్మల్ని ఎందుకు చంపుతాడు? "

చప్పున ద్వివేది వైపు చూశాడు సిద్ధయ్య. "నిజమే... ఈ ఆలోచన నాకు




రాలేదు..."

"నా అంచనా నిజమైతే డబ్బు తెచ్చేవ రకూ అతను ఏమీ చెయ్యడు. డబ్బుతో వస్తున్నప్పుడు జాగ్రత్తగా వుంటే చాలు" అని మళ్లీ అడిగేడు.

"గోర్కీ ఎలాంటివాడు?"

"కమిట్‌మెంట్ వున్న నాయకుల్లో గోర్కీ ఒకడు. అతను పనిచేసే విధానం గమనించిన తరువాతే దళం అప్పగించాం. మా కార్యక్రమాలు విజయవంతం చెయ్యడానికి నిద్రాహారాలు మాని శ్రమించేవాడు. ఎన్నో మైళ్ళు తిరిగొచ్చి ఆదమరచి నిద్రపోతున్నప్పుడు కూడా పిలిస్తే పలికేవాడు. అతను ఉపన్యసిస్తుంటే ప్రజల్లో ఉప్పెనలాంటి ఆవేశం పుట్టేది. గోర్కీకి ఒబ్బంగి గ్రామంలో ఓ గిరిజన యువతితో పరిచయమేర్పడింది. ఆమెని కలవడానికి తరుచుగా ఆ గ్రామం వెళ్ళేవాడు. అటువంటి పరిచయాలు హానిచేస్తాయని మానుకోమని గోర్కీతో చెప్పాడు సుబ్బారెడ్డి. అది తన వ్యక్తిగత విషయమని పార్టీకి దానితో ఎలాంటి సంబంధం లేదని తెగేసి చెప్పాడు గోర్కీ. అప్పుడే ఇద్దరికీ ఘర్షణ జరిగింది. ఆవేశంతో చేతిలో గొడ్డలి సుబ్బారెడ్డిమీదకు విసిరాడు. గొడ్డలి తగిలి దవడ ఎముక ఆరంగుళాలమేర చీరుకుపోయింది. ఇద్దరి మధ్యా తిరిగి మామూలు సంబంధాలు నెలకొనడానికి చాలా రోజులు పట్టింది. ఆ గాయంవల్ల ఏర్పడిన మచ్చ కనిపించకుండా వుండటానికి గెడ్డం పెంచడం మొదలెట్టేడు సుబ్బారెడ్డి" ఆగి వూపిరి తీసుకున్నాడు సిద్ధయ్య.

"గోర్కీ డబ్బుమీద వ్యామోహంతో పోలీసులకు సహకరించాడని తెలిసినప్పుడు మొదట నేను నమ్మలేదు. అతను ఎన్‌కౌంటర్‌లో దళంతో పాటు మరణించాడనుకుంటే రహస్యస్థావరంలో ప్రత్యక్షమయ్యాడు. అతనొచ్చిన తరువాతే మామీద దాడి జరిగింది. ఆ సమయంలో అతను ఎలా తప్పించుకున్నాడో మేము చూడలేదు. పోలీసుస్టేషన్‌లో డబ్బు దాచిన చోటు చెప్పమని పోలీసులు నన్ను హింసించారు" మాటలు ఆపేసి కిందకు చూశాడు సిద్ధయ్య.

ఒక చీమ అతని కాలి బొటనవేలిని కుడుతోంది. కాసేపు దానిని చూసి అన్నాడు.

"అదెలా కుడుతున్నదో చూడు"

అందులోని విశేషం ఏమిటో బోధపడలేదు ద్వివేదికి.

"శరీరమంతా వంచి శక్తి కూడదీసుకుని మరీ కుడుతోంది, ఎందుకంటావ్?"

"అది దాని లక్షణం..."

"అంతేనంటావా? బలవంతుడైన మనిషి, మానవజాతి పుట్టుకనుంచి తమ జాతిపట్ల ప్రదర్శిస్తున్న రాక్షసత్వాన్ని నిరసిస్తున్నట్టు లేదూ అది కుడుతున్న తీరు? తన జాతిని ధ్వంసం చేసినందుకు ప్రతీకారం తీర్చుకుంటున్నట్టుంది కదూ దాని తపన? అట్టడుగు ప్రజల్లో ఈ పాటి పట్టుదల వుంటే దేశం ఎప్పుడో బాగుపడేది. కాదంటావా?"

ద్వివేది మాట్లాడలేదు.

కొంత సమయం అక్కడ గడిపి, చీమ వేలిపైనుంచి దిగి తన నివాసం వైపు సాగిపోయిన తరువాత ఇద్దరూ గ్రామంలోకి వచ్చారు. మధ్యాహ్నం కాసేపు నిద్రపోయి లేచేసరికి వారి బడలిక తీరిపోయింది. గ్రామంలో ఇంకా సందడి సాగుతూనే వుంది.

ఆ రోజంతా గ్రామంలో వుండటంవల్ల కోందుల గురించి ఎన్నో విషయాలు తెలిశాయి ద్వివేదికి.

జంతువులతోను, విషపురుగులతోను సహజీవనం చేసే కోందులకు బయటి ప్రపంచం గురించి అంతగా తెలియదు. వాళ్ళ అజ్ఞానం ఆసరా చేసుకుని ఫారెస్టు వాళ్ళు గ్రామంమీద పడతారు. కూడబెట్టుకున్న రూపాయలు, పెంచుకున్న కోళ్ళు పట్టుకుపోతారు. దొంగలెక్కలతో పంటలు

దోచుకుంటారు వ్యాపారులు. అయినా ఆ జాతి కోపం తెచ్చుకోదు.

ద్వివేది మనసు వికలమైంది.

★ ★ ★

ఉదయం లేచి కాఫీ తాగారు బెహరా, అతని స్నేహితుడు.

పది గంటల సమయంలో కాంప్లెక్స్‌కి వెళ్ళారు. బస్సెక్కి మూడు గంటల తరువాత మొండెంఖల్లులో దిగారు. చుట్టూ కొండలతో కాస్త పెద్దగానే వుందావూరు. చిరునామాలోని వ్యక్తిని కలవడానికి శ్రమపడాల్సిన అవసరం లేకపోయింది. ఆ వ్యక్తి వాళ్ళని ఇంట్లోకి ఆహ్వానించి ఒక గది చూపించాడు. అందులో రెండు మంచాలు, రెండు కుర్చీలు వున్నాయి.

"రేపు తెల్లవారుజామున మన ప్రయాణం. అంతవరకూ విశ్రాంతి తీసుకోండి..." చెప్పాడా వ్యక్తి.

బెహరా అతన్ని పరిశీలనగా చూశాడు. ఆ వ్యక్తికి నలభై వుంటుంది వయసు. క్రమశిక్షణ పాటించే వాడిలా జుట్టు దగ్గరకు కత్తిరించి వుంది.

"మేము ఎందుకొచ్చామో తెలుసా?" అతన్ని అడిగాడు బెహరా.

"తెలియదు"

బెహరాకి ఆశ్చర్యం కలిగింది.

"మేము వస్తామని నీకు చెప్పిందెవరు?"

ఏకవచన ప్రయోగానికి అతని మొహం ఎర్రబడింది. తమాయించుకుని చెప్పాడు.

"మా కామ్రేడ్" అని చెప్పి అక్కడ వుండటం ఇష్టంలేనట్టు వెళ్ళిపోయాడు. అతని ప్రవర్తన అర్థంకాక మౌనంగా వుండిపోయాడు బెహరా.

"వాడేంటి అలా మాట్లాడతాడు?" స్నేహితుడు విస్మయంగా అన్నాడు.

బెహరా పెదవి విరిచాడు.

"ఈ గదిలో కూర్చుని ఏంచేస్తాం? మందుంటే కాలక్షేపం అవుతుంది..."

అంగీకారంగా తలూపి ముందు గదిలోకి వచ్చాడు బెహరా. ఆ వ్యక్తి కూర్చుని ఏదో పుస్తకం చదువుతున్నాడు. బీరువా తలుపు తెరిచి వున్నందువల్ల నీట్‌గా పేర్చిన పుస్తకాలు కనిపిస్తున్నాయి.

"ఏం కావాలి?" ఆ వ్యక్తి అడిగాడు.

"వైన్ షాపుకి వెళ్ళొస్తాను"

అతను ఇబ్బందిగా కదిలేడు.

"మీ మాటలు వింటే ఒరిస్సా నుంచి వచ్చారని ఎవరికైనా ఇట్టే తెలిసిపోతుంది. అందుచేత బయట ఎక్కువగా సంచరించే ప్రయత్నం చెయ్యొద్దు. ఇక్కడి ప్రజలు ఆవులిస్తే పేగులు లెక్కపెడతారు" చెప్పాడు.

బెహరా సమాధానం ఇవ్వకుండా బయటకొచ్చి బస్సు దిగినచోట చూసిన వైన్‌షాప్‌కి వెళ్ళి నాలుగు విస్కీబాటిల్స్ కొన్నాడు. షాపతను ఆశ్చర్యంగా చూడటం గమనించి తను చేసిన తప్పు గ్రహించాడు. అలాంటి గ్రామంలో ఒకేసారి నాలుగు బాటిల్స్ పర్చేజ్ చేస్తే సహజంగానే కుతూహలం రేగుతుంది. చుట్టూ తిరిగి ఆ ఇంటికొచ్చాడు.

"మంచినీళ్ళు, రెండు గ్లాసులు కావాలి..." పుస్తకం చదువుతున్న ఆ వ్యక్తితో చెప్పి గదిలోకి నడిచాడు.

గ్లాసులు, పెద్ద స్టీలు చెంబుతో మంచి నీరు తెచ్చాడతను.

"అతనెవరు?" ఓ క్యాలెండరు చూపించి అడిగాడు బెహరా. అందులో తీక్షణంగా చూస్తున్న గెడ్డం వ్యక్తి బొమ్మ వుంది.

"కారల్ మార్క్స్..."

ఆ పేరు ఎప్పుడూ వినకపోవడంతో మాట్లాడలేదు బెహరా.

ఆ వ్యక్తి గదిలోంచి వెళ్ళిపోయిన తరువాత తలుపు దగ్గరకు వేసొచ్చి హుషారుగా బాటిల్ విప్పాడు స్నేహితుడు.

ఆ రాత్రి బెహరా, అతని స్నేహితుడు చెరో మంచంపైన పడుకున్నారు.

"బీప్... బీప్... బీప్.."

లేచి సెల్ తీశాడు బెహరా.




"బెహరాని మాట్లాడుతున్నాను"

"మీరెక్కడవున్నారు? "

"మొండెం ఖల్లు"

"రేపు వుదయం లొకేషన్‌కి వెళతారు. అక్కడ వెయిట్ చెయ్యండి. ప్రోగ్రాంలో ఎలాంటి మార్పులేదు"

"సరే..."

కాల్ కట్ అయింది.

నిద్రపోతున్న స్నేహితుని వైపు ఓసారి చూసి పడుకోబోతుండగా క్యాలెండరు మీద దృష్టి పడింది. ఆ గెడ్డం వ్యక్తి మరింత తీక్షణంగా చూస్తున్నట్టు గోచరించి, అదంతా భ్రమ అనుకుంటూ నిద్రకుపక్రమించాడు.

★ ★ ★

"నిన్న వుదయం రైల్వేస్టేషన్ దగ్గర బస్సెక్కిన ఇతను ఎక్కడ దిగాడో చెప్పగలవా? " రాత్రి పదిన్నరకి తిరిగొచ్చిన బస్సులోని కండక్టర్ని అడిగాడు సూరి.

"దిగువ గ్రామంలో దిగాడు సార్!" చెప్పాడా కండక్టర్.

"అతనితో ఎవరైనా వున్నారా? "

"ఓ గెడ్డం వ్యక్తి కూడా ఎక్కాడండి. అతనే టిక్కెట్ తీసుకున్నాడు"

ఎంతమంది జనం వున్నా ఒక్క చూపులో టిక్కెట్ తీసుకోని వారిని గుర్తించే నేర్పు ఆ కండక్టర్‌కి వుంది. గ్రామస్తులు ఎందుకొస్తున్నది, తిరిగి ఎప్పుడు బయలుదేరతారు వంటి వివరాలు అతనికి తెలుస్తాయి. కొత్త శాల్తీలు బస్సెక్కితే గుర్తుపడతాడు.

దిగువ గ్రామం ఏజన్సీకి ముఖద్వారం వంటిది. ద్వివేది అక్కడకెందుకు వెళ్ళాడు? అతను కనిపిస్తే స్టేషన్‌కి సమాచారం ఇమ్మని చెప్పి వచ్చేశాడు సూరి. ఉదయం దిగువ గ్రామానికి వెళ్ళడానికి నలుగురు కానిస్టేబుల్స్‌తో జీప్ రెడీ చెయ్యమని రైటర్‌కి చెప్పాడు.

★ ★ ★

తెల్లవారుజామున ప్రయాణానికి రెడీ అయింది సుబ్బారెడ్డి బృందం.

సామాన్లు మోసేవాళ్ళు వాటర్ బాటిల్స్‌లో నీరు నింపారు. వెంట తెచ్చిన టీ పొడి, పంచదార వుపయోగించి బ్లాక్‌టీ చేశారు. నిమ్మరసం పిండిన ఆ డికాషన్‌కి అదోలాంటి రుచి వచ్చింది. చలిగాలి తీవ్రంగా వీస్తున్న సమయంలో వేడివేడి బ్లాక్‌టీ తాగి, నిద్రపోతున్న మిణిఅపాయు గ్రామం దాటారు. దివుడు సావోతా కొంత దూరం వచ్చి వారిని సాగనంపి వెనక్కి తిరిగాడు.

ద్వివేది ఆగి వెళ్ళిపోతున్న అతన్ని చూశాడు.

దివుడుసావోతా చురుగ్గా అడుగులువేస్తూ క్రమంగా మంచు తెర వెనుక అదృశ్యమయ్యాడు. దట్టమైన మంచు మిణిఅపాయు గ్రామాన్ని కనిపించకుండా దాచేసింది. శరీరంనిండా బట్టలేకుండా ఆ వాతావరణం తట్టుకుని జీవనం సాగించడం చాలా కష్టం. అయినా కోందులు ఆ కష్టాన్ని తేలిగ్గా భరిస్తున్నారు.

మామిడి టెంకల్లోని జీడి ఎండబెట్టి పిండిచేసి దానితో గంజి కాచుకుని కడుపు నింపుకుంటున్నారు. కంప్యూటర్ విజ్ఞానం, సూపర్ స్పెషాలిటీ వైద్య విధానాలతో మనిషి వుక్కిరిబిక్కిరి అవుతుంటే, వీరు మంత్రాలతో జబ్బులు తగ్గుతాయని నమ్ముతున్నారు. అడవిలో పిచ్చి మొక్కల వెనుక దుంపలకోసం కోందులు భూమి తవ్వుతుంటే అక్కడ స్విస్ బ్యాంకుల్లో నాయకులు డబ్బు దాచుకుంటున్నారు. తరతరాలనుండి తిండిలేని వారిని వదిలేసి తరతరాలకు సరిపడే సంపద పోగేసుకుంటున్నారు.

అడుగులు పడుతున్నకొద్దీ ద్వివేది ఆలోచనలు చిక్కనవుతున్నాయి. అతను సుబ్బారెడ్డి బృందం వెనుక పరధ్యానంగా నడుస్తున్నాడు.

సూర్యోదయం అయింది.

మంచు తెర పూర్తిగా విడిపోయినప్పుడు ఒకచోట ఆగారు. పని వాళ్ళు సామాను దించి చితుకులు పేర్చి చిన్న పాత్రతో బ్లాక్‌టీ చేశారు. ప్లాస్టిక్ గ్లాసుల్లో పోసి తలొకటి అందించారు. అందరూ బిస్కట్స్ తిని ఆ టీ తాగారు.

ద్వివేది సిగరెట్ పాకెట్ తెరిచి సిగరెట్ వెలిగించుకున్నాడు. టీ చేసిన వ్యక్తి సిగరెట్ పాకెట్‌వైపు ఆశగా చూడటం గమనించి అతనికో సిగరెట్ ఇచ్చాడు. సిగరెట్ తీసుకుని కాల్చుకోవడానికి ప్రక్కకి వెళ్లాడతను.

ఇంతలో అడుగుల చప్పుడు వినిపించి అందరూ అటు చూశారు.

ఒక యువకుడు గబగబా నడిచిరావడం కనిపించింది. అతని కుడిచేతిలో పదునైన గొడ్డలి వుంది. ఎడమచేత్తో ఓ యువతి చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళుతున్నట్టు నడుస్తున్నాడు. ఆ యువతి బుగ్గలమీద ఎండిపోయిన కన్నీటి మరకలున్నాయి. కళ్ళల్లో దిగులుతో అతని వెంట అయిష్టంగా వెళుతున్నట్టుంది ఆమె వాలకం.

సుబ్బారెడ్డి బృందం వింతగా చూస్తున్నా ఆ యువకుడు నడక వేగం తగ్గించకుండా వాళ్ళని దాటాడు. చెంగున లేచి వాళ్ళిద్దరి మధ్యా చేరి ఆ యువతి చెయ్యి విడిపించాడు ద్వివేది. కన్నుమూసి తెరిచేంతలో జరిగిపోయిందా సంఘటన. ఆ యువతీ యువకులు జరగరానిది జరిగిపోయినట్టు నిశ్చేష్టులై వుండిపోయారు. ఇద్దరిలోనూ ఆందోళన.

ఆ యువకుడు తేరుకుని కుడిచేతిని గొడ్డలితోసహా పైకెత్తి బిగ్గరగా కొండభాషలో ఏదో అన్నాడు. ఆ భాష తెలియని ద్వివేది ముందుకి జరిగి ఆ యువతిని కవర్ చేశాడు.

అతని ప్రవర్తన కలిగించిన విస్మయం నుండి బయటపడి ఆందోళనగా అన్నాడు సుబ్బారెడ్డి.

"ద్వివేదీ! వాళ్ళని వెళ్ళనివ్వు..."అని

కానీ అప్పటికే ఆలస్యమైంది.

ద్వివేది ఆ యువకునివైపు అప్రమత్తంగా చూశాడు. అతను మెరుపులా ముందుకి దూకి గొడ్డలితో ద్వివేది మెడ నరకబోయాడు. గాలిని చీలుస్తూ వచ్చిన వేటుని తలవంచి తప్పించుకుని, కుడిచేతి పిడికిలితో అతని పక్కటెముకలమీద గుద్దాడు ద్వివేది. ఆ దెబ్బకి కొద్దిగా వెనక్కి తూలి నిలదొక్కుకుని నిలువుగా చీలుస్తున్నట్టు పైనుంచి తలపైకి గొడ్డలి దించాడతను. గాలిలోనే చేత్తో దానిని ఆపి, రెండో చేత్తో మొహం పైన చరిచాడు. ఆ యువకుని కళ్ళు బైర్లుకమ్మాయి.

ద్వివేది ఆలస్యం చెయ్యకుండా కుడికాలు విసిరాడు. ఆ యువకుడు గొడ్డలి వదిలి ఎగిరి తుప్పల్లో పడ్డాడు. లేచి వెనక్కి తిరిగి చూడకుండా చెట్లమధ్య అదృశ్యమయ్యాడు.

పాలిపోయిన మొహంతో చూస్తున్న ఆ పిల్లతో అన్నాడు ద్వివేది.

"నీకేం భయంలేదు"

సుబ్బారెడ్డి పళ్ళు పటపట కొరికాడు. ద్వివేదిమీద వచ్చిన కోపం నిగ్రహించుకుని ఆ పిల్లని కుభి భాషలో ఏదో అడిగాడు.

"పుబులి... మిటిం...ఉదూలియా..."

అర్థంకాని పదాలు వల్లెవేసిందాపిల్ల.

సుబ్బారెడ్డి తలపట్టుకుని కూర్చుండిపోయాడు.

"ఇప్పుడేం చేద్దాం?" దిగులుగా సిద్ధయ్యని అడిగాడు.

"ఏమయింది?"

సిగరెట్ ముట్టించుకుని తాపీగా ప్రశ్నించాడు ద్వివేది.

★ ★ ★

చెంపపైన ఛెళ్ళున తగిలిన దెబ్బకి ఆమె రోడ్డుమీద పడింది. అది మట్టిరోడ్డు కావటంవల్ల శరీరం అంతా దుమ్ము అంటుకుంది. ముడిజారి జుట్టు చెల్లాచెదురైంది.

"ఏమే... నీకు భత్యం కావాలా?" కర్క




శంగా అడిగాడు ఆమెను కొట్టినతను.

ఉదయం దిగువ గ్రామం సెంటర్‌లో జరిగిందా సంఘటన. టీ తాగి దినపత్రిక చదవడానికి గ్రామస్తులు వచ్చే సమయం అది. అటుగా వెళుతున్న ఆ స్త్రీని పట్టుకుని కొట్టాడావ్యక్తి. రెండురోజులక్రితం అదేచోట దెబ్బలు తినడానికి ఆమె కారణమనే కక్షతో చేశాడాపని.

గ్రామస్తులెవరూ అతన్ని వారించే ప్రయత్నం చెయ్యకుండా నిస్సహాయంగా చూస్తున్నారు. అతనంటే వారందరికి ఎంతో భయం. వెనుకా ముందు చూడకుండా ఇష్టమొచ్చినట్టు తిడతాడు. గ్రామంలో అచ్చోసిన ఆబోతులా సంచరించే అతన్ని మార్చడానికి చెయ్యని ప్రయత్నం లేదు. మొండివాడు రాజుకంటే గొప్పనే సామెత అతని విషయంలో నిజమైంది.

ఆ స్త్రీ భర్త అడవినుంచి కలప తెచ్చి అమ్ముకుని జీవించే నిరుపేద. ఒకనాడు కలపకోసం వెళ్ళిన అతన్ని పులి ఎత్తుకుపోయింది. పిల్లల్ని పోషించడానికి మరో దారి కనిపించక ఆమె ఆ మార్గం ఎన్నుకుంది. ప్రతిఫలం కోరకుండా వచ్చినప్పుడల్లా శరీరం అప్పగించమంటాడతను. డబ్బులిస్తే కాని వీలు కాదంటుందామె. అప్పటివరకూ రహస్యంగా వున్న ఆ వ్యవహారం మొన్న టీ కొట్టులో జరిగిన గొడవవల్ల అందరికీ తెలిసింది.

లేచి మట్టి దులుపుకుని అక్కడనుంచి వెళ్ళిపోవడానికి రెండడుగులు వేసిందా స్త్రీ. ఆమె చెంపమీద చేతి వేళ్ళు తాకినచోట చర్మం ఎర్రగా కందిపోయింది.

అతను జుట్టు దొరకబుచ్చుకుని కసిగా లాగాడు.

"నన్నొదులు..." బాధగా అరిచిందామె.

"నీ ప్రాణం తీసినా ఇక్కడ నీకు దిక్కు లేదే" జుట్టు మరింత గట్టిగా పట్టుకుని అన్నాడు.

సరిగ్గా అప్పుడే జీపు ఒకటి ఆగిందక్కడ. సబ్ ఇన్‌స్పెక్టర్ సూరి జీప్ దిగి వడివడిగా వాళ్ళ దగ్గరకు నడిచాడు. ఎవరో రావడం చూసి కూడా అతను జుట్టు వదల్లేదు.

సూరి ఏమాత్రం సంకోచించకుండా ఆ వ్యక్తి మెడమీద చేత్తో చరిచాడు. అతను జుట్టు వదిలి విసురుగా సూరివైపు తిరిగాడు. జీప్‌నుంచి దిగిన కానిస్టేబుల్స్ పరిగెత్తుకొచ్చి అతన్ని కమ్ముకున్నారు. శరీరంలో దెబ్బతగలని చోటు లేనట్టు లాఠీలతో కొట్టసాగారు.

టీ కొట్టు వద్దకు వెళ్ళి గ్లాసుతో నీరు తెచ్చి ఆమెకిచ్చాడు సూరి. రెండు గుక్కలు తాగి మిగతా నీరు మొహంపైన వంపుకుందామె.

లాఠీ దెబ్బలు భరించలేక ఆ వ్యక్తి సూరి కాళ్ళమీద పడ్డాడు. అంతవరకూ చూపించిన అహంకారం మటుమాయమయింది.

"తప్పయిపోయింది... ఇక నుంచి రోజూ భత్యం ఇస్తాను" మతి చలించిన వాడిలా అన్నాడు.

అతని వాగుడు పట్టించుకోకుండా కానిస్టేబుల్స్‌కి సైగచేశాడు సూరి. అతన్ని లాక్కెళ్ళి జీప్‌లో పడేశారు వాళ్ళు. టీ కొట్టు అతనికి ద్వివేది ఫొటో చూపించి అడిగాడు సూరి.

"ఇతన్ని ఎప్పుడైనా చూశావా? "

"చూశానండి... మొన్న బస్సు దిగాడు" అని ఆరోజు అక్కడ జరిగిందంతా పూసగుచ్చినట్టు వివరించాడు. ఆ వ్యక్తి పిచ్చిపిచ్చిగా మాట్లాడిన మాటలకు అర్థం అప్పుడు బోధపడింది సూరికి.

"అతనొక్కడే వున్నాడా? "

"మొత్తం ఆరుగురండి, ఇక్కడే ఇడ్లీ తిన్నారు. గెడ్డం వున్నబాబు డబ్బులిచ్చాడు"

"వాళ్ళు ఎటు వెళ్ళారు? "

"మిణి అపాయు దారిపట్టారండి"

"మిణి అపాయు? "

"కొండల్లోని కోందు గ్రామమండి"

సూరి జీప్‌వద్దకు వచ్చాడు.

"నన్ను వదిలేయండి బాబూ! రోజూ



భత్యం ఇస్తానంటున్నాగా..." ఆ వ్యక్తి దీనంగా అన్నాడు.

అతన్ని జీప్ దిగమని డ్రైవర్‌కి కొన్ని సూచన్లు ఇచ్చాడు సూరి. ముగ్గురు కానిస్టేబుల్స్‌ని తీసుకుని జీప్ వెళ్ళిపోయింది. ఆ వ్యక్తిని పరిశీలనగా చూసి, అతను ఏ భావనతో వున్నాడో అదే కంటిన్యూ చెయ్యాలని నిర్ణయించుకున్నాడు సూరి.

"ఆమెకు భత్యం ఇవ్వడానికి నీకేదయినా ఇబ్బంది వుందా? " అడిగాడు.

అతను జవాబు చెప్పడానికి రెండు క్షణాలు వ్యవధి తీసుకుని చివరికి లేదన్నట్టు తలూపాడు.

"ఇప్పుడు మాట తప్పినట్టు మరోసారి తప్పితే నీ కీళ్ళు తప్పిస్తాను" హెచ్చరించాడు.

ఆ వ్యక్తి అప్పటికప్పుడు ఆరోజుకి సరిపడే డబ్బు ఇచ్చాడు. సూరికి నమస్కారం చేసి వెళ్ళిపోయిందా స్త్రీ.

మిణిఅపాయు అక్కడకి పాతిక కిలోమీటర్ల దూరం వుంటుందని చెప్పాడు టీ కొట్టు మనిషి. రోడ్డుమీద నాలుగు కిలోమీటర్లు వెళితే నాటు బళ్ళు తిరిగే మార్గం ఒకటి వుంది. ఆ దారిలో బందికార గ్రామంవరకూ వెళ్ళవచ్చు. అక్కడనుంచి మూడు గంటలు నడిస్తే మిణిఅపాయు చీకటిపడకముందు చేరుకోవచ్చునని కూడా ఆ మనిషి సలహా ఇచ్చాడు. అలా వెళితే కనీసం పదికిలోమీటర్లదూరం నడవక్కర్లేదు.

పన్నెండు గంటలకు జీప్ తిరిగొచ్చింది. మార్గం చూపించడానికి ఒకతన్ని తీసుకుని బయలుదేరాడు సూరి. నాలుగు కిలోమీటర్ల తరువాత బండి దారిలోకి ప్రవేశించింది జీప్. చెట్ల కొమ్మలు రాసుకుంటూ, రాళ్ళ మీద ఎగిరెగిరిపడుతూ బందికార గ్రామం చేరింది.

ఎవరి బ్యాగులు వాళ్ళు తీసుకుని వెంట వచ్చిన మనిషి చూపించిన బాటలో నడవసాగారు. చీకటిపడకముందే మిణిఅపాయు చేరుకున్నారు.

దివుడు సాహోతా ఆశ్రయం ఇచ్చాడు.

★ ★ ★

"ఈ గుహలో నిర్భయంగా పడుకోవచ్చు వెనుకవైపు కొండ దిగితే నీటి మడుగు ఒకటి వుంటుంది. ఇది అత్యంత రహస్యప్రదేశం" చెప్పాడా వ్యక్తి.

వెలుగు రాకముందే మొండెంఖల్లులో బయలుదేరి మధ్యాహ్నానికి ఆ కొండపైకి వచ్చారు. కాలిబాట విడిచి ముళ్ళడొంకలు, తుప్పలు దాటుకుని ఏటవాలుగా నడిచి ఆ ప్రదేశం చేరుకున్నారు. అది ఎత్తైన కొండ కావడంవల్ల ఆకాశం తలని తాకుతున్నట్టుంది. చుట్టూ కనుచూపుమేర అడవి పైభాగం స్పష్టంగా కనిపిస్తోంది. కొండ కింద అంతు చిక్కని లోయ. అది దాటితే మరో కొండ. ఆ కొండ వెనుకవుంది ఒరిస్సా సరిహద్దు.

"అటు చూడండి..." చేత్తో చూపించాడు.

"విశాలంగా కనిపిస్తున్న ఆ మర్రివృక్షం కింద ఒక కాలిబాట వుంటుంది. ఒరిస్సా నుండి ఆంధ్రాలోకి వచ్చేవారు ఆ బాట వుపయోగిస్తారు. మీరు ఇక్కడ నుంచే వారిని గమనించవచ్చు. ఒక విషయం మాత్రం మీరు గుర్తుంచుకోండి. ఈ ప్రాంతానికి చుట్టు పక్కల చాలాదూరం వరకూ ఆటవిక గ్రామాలు లేవు. సాధారణంగా గిరిజనులు ఇటువైపు సంచరించరు. ఒకవేళ ఎవరైనా తారసపడితే చూడనట్టు తప్పుకోండి. సమాధానం ఇవ్వాల్సివస్తే వేటకొచ్చామని చెప్పండి"

పది నిముషాల తరువాత అతను వెళ్ళిపోయాడు.

"ఏంటిగూరూ! ఇక్కడ వదిలేశాడు" చుట్టూ వున్న తుప్పల్లోకి అనుమానంగా చూస్తూ అన్నాడు స్నేహితుడు.

సమాధానం చెప్పకుండా రాయిమీద కూర్చుని మర్రిచెట్టుని చూశాడు బెహరా.




కంటికి కనిపిస్తున్న ఆ చెట్టు చాలా దూరంలో వున్నదని గ్రహించడానికి ఎక్కువసేపు పట్టలేదతనికి. ఆ పని అప్పగించిన మనిషి బైనాక్యులర్ ఎందుకిచ్చాడో బోధపడింది.

చీకటి కమ్ముకున్నట్టు హఠాత్తుగా వెలుగు తగ్గిపోయింది. తలెత్తిచూస్తే ఒక అల్లరి మేఘం కొండని చుట్టుముట్టడం కనిపించింది. పది నిముషాల్లో ఆ మేఘం వెళ్ళిపోయి తిరిగి వెలుగొచ్చింది.

రామ్‌బెహరా బ్యాగునుంచి పేపరులో చుట్టిన వెపన్ విడిభాగాలు తీసి కిందపెట్టాడు. కొబ్బరినూనె సీసాలో దూదిముంచి ఆ భాగాలకు అప్లై చేశాడు. పొడవాటి ఐరన్‌రాడ్‌కి గుడ్డ చుట్టి బేరల్ శుభ్రం చేశాడు. ఆయిల్ రాసిన భాగాలను పొడిగుడ్డతో తుడిచి జోడించాడు.

మూడువందల గజాల దూరంలోని మనిషిని హతమార్చే సెల్ఫ్ లోడింగ్ రైఫిల్స్ రెండు తయారయ్యాయి. అట్టపెట్టెలోని తూటాలు మెగ్జిన్స్‌లో నింపి రైఫిల్స్‌కి అమర్చాడు. ఒక రైఫిల్ స్నేహితునికి ఇచ్చి బైనాక్యులర్‌తో మర్రిచెట్టు కిందనున్న బాటని చూశాడు. ఆ బాట కొండని సమీపించి అవతలికి వెళ్ళిపోయింది.

సూర్యుడు అస్తమించాడు.

స్నేహితుడు గుహలో కొవ్వొత్తి వెలిగించాడు. ఆ వెలుగులో కొండని జాగ్రత్తగా దొలిచినట్టు కనిపించింది గుహ. ఇద్దరూ ఒకరిపక్క ఒకరు బెడ్‌షీట్స్ పరుచుకున్నారు. స్నేహితుడు విస్కీబాటిల్ బయటకు తీశాడు. వాళ్ళు ఆ బాటిల్ ఖాళీ చేసే పనిలో నిమగ్నమయ్యారు.

బయట కాటుక అద్దినట్టు చీకటి. దానికి తోడు హోరుమనే గాలిచప్పుడు. ఆ వాతావరణంలో కొన్నిరోజులు వుండాలంటే చాలా ధైర్యం కావాలి. జీవితంలో మొదటిసారి కలిగిన ఆ అనుభవం భరించేశక్తి కడుపులోని మద్యం ఇస్తోంది.

ఖాళీబాటిల్‌తో బయటికొచ్చి చీకట్లోకి దానిని బలంగా విసిరాడు బెహరా. కొన్నిక్షణాల నిశ్శబ్దం అనంతరం చెట్లను రాసుకుంటూ కిందకు సాగుతున్న శబ్దం వచ్చి చప్పున ఆగిపోయింది. బెహరా నొసలు సాలోచనగా ముడివడింది. బహుశా అది చెట్టుకొమ్మలో చిక్కుకుపోయివుండాలి.

ఆహారపొట్లాలు విప్పి భుజించారు. సీసాలతో తెచ్చిన నీరుతాగి సిగరెట్లు వెలిగించారు.

క్రమంగా చలి రెట్టింపయింది. అప్పుడప్పుడూ అడవి జంతువుల అరుపులు భీకరంగా వినిపిస్తున్నాయి. లోడుచేసిన రైఫిల్స్ దగ్గర పెట్టుకుని నిండుగా బ్లాంకెట్స్ కప్పుకుని పడుకున్నారు.

వెంటనే నిద్ర పట్టేసింది.

★ ★ ★

"పీకలమీదకి తెచ్చి ఏమయిందని అడుగుతున్నావా?" కోపంతో కస్సున లేచాడు సుబ్బారెడ్డి.

ఆ సమయంలో సుబ్బారెడ్డితో మాట్లాడటం మంచిది కాదని తోచి సిగరెట్ కాల్చడంలో మునిగిపోయాడు ద్వివేది. అతనికి ఎందుకంత కోపం వచ్చిందనే ఆలోచన మనసులో కదులుతున్నా మౌనంగా వుండిపోయాడు.

ఓ నిముషం నిశ్శబ్దంగా గడిచింది.

"ఈ పిల్ల పేరు పుబులి. మిటింగ్రామానికి చెందిన కోందు పడుచు. మనం వెళుతున్న గ్రామానికి పెద్ద హోర్గుణసావోతా కూతురు..." చెప్పాడు సుబ్బారెడ్డి. కోపం అదుపు చేసుకున్నా స్వరంలో తీవ్రత తగ్గలేదు.

"...కోందుజాతిలో అత్యంత ప్రధానమైన ఆచారం ఉదూలియా. యుక్తవయసు వచ్చిన కోందుయువకుడు వేటనెపం మీద చుట్టుపక్కల గ్రామాలకు వెళ్ళి తనకి నచ్చిన పిల్లని చూసుకుంటాడు. ఆ పిల్ల ఒంటరిగా ఉన్నప్పుడు మాటలు కలిపి చెయ్యి పట్టు

కుంటాడు. అలా చెయ్యి పట్టుకున్న మగవాడితో ఆ పిల్ల వెళ్ళిపోతుంది. ఆమెను తన గ్రామం తీసుకుపోతాడతను. ఆ పిల్ల తల్లిదండ్రులు వచ్చిన తరువాత పిల్లవాని తండ్రి వారికి విందుచేసి, పిల్ల పుట్టింటివారికి కొంత సొమ్ము చెల్లించి పెళ్లి జరిపిస్తాడు. పిల్లని తీసుకొస్తున్నవాడిని ఎవరైనా ఆపితే వాళ్ళ మధ్య యుద్ధం జరుగుతుంది. గెలిచినవాడికి ఆ పడుచును చేసుకునే హక్కు కలుగుతుంది. ఉదూలియా అంటే అదే..."

ద్వివేది నోట్లోని సిగరెట్ జారిపోయింది.

తను చేసిన పని ఎటువంటిదో తెలిసేసరికి శరీరం చెమటతో తడిసింది. తడారిపోయిన గొంతు సర్దుకున్నాడు.

"ఇందులో నా తప్పేముంది? వాళ్ల ఆచారం గురించి తెలియక అడ్డువెళ్ళాను. అడవుల్లో నివసించే కోందులకు ఏవో ఆచారాలుంటే అవి మిగతావారికి ఎలా తెలుస్తాయి? " అడిగాడు ద్వివేది.

"ఆటవికుల రాజ్యంలోకి ప్రవేశించినప్పుడు కొంత నిగ్రహం పాటించాలి. ఆ పిల్ల రక్షించమని కోరకుండా వారి మధ్యకు నువ్వెళ్ళడం తప్పు. లోకరక్షకునిలా ప్రతీదానిలో తలదూరిస్తే పరిణామాలు ఇలానే వుంటాయి" సిద్ధయ్య మెత్తగా మందలించాడు.

"ఇప్పుడు మించిపోయిందేం లేదు. మీరిక్కడే వుండండి... నేను మిణిఅపాయు వెళ్ళి ఆ యువకునికి క్షమాపణలు చెప్పుకుని ఈ పిల్లని అతనికి అప్పగించి వస్తాను..." ద్వివేది అన్నాడు.

సుబ్బారెడ్డి తల అడ్డంగా వూపాడు.

"కోందులకు ఆత్మాభిమానం అధికం. తీసుకొస్తున్న పిల్లని మరొకరికి కోల్పోయిన తరువాత తిరిగి ఆమెను కోందులు స్వీకరించరు. పరాయివాడు గెల్చుకున్న పిల్లని కన్నెత్తి చూడరు"

అనవసరమైన చిక్కులు తెచ్చిన ఆ పిల్లని పరీక్షగా చూశాడు ద్వివేది.

పదహారు, పదిహేను సంవత్సరాలకు మించదు వయసు. సన్నగా కనిపిస్తున్నా దృఢంగా వుంది. సమున్నత వక్షద్వయాన్ని మరుగుపరచడానికి ముతకచీర శాయశక్తులా ప్రయత్నిస్తోంది. పుట్టింది మొదలు శ్రమించడం తప్ప సుఖించడం తెలియనట్టు శరీరం రాయిలా వుంది. జుట్టు రంగుదారంతో ముడివేసి సిగలో కొండపూలు తురుముకుంది. ఎరుపురంగు పూసలదండ మెడలో వేలాడుతోంది.

ఆ పిల్ల తనవైపు చూడటం గమనించి దృష్టి మరల్చి అన్నాడు.

"పదండి... ఇక్కడ వుండి చింతించడం వల్ల ప్రయోజనంలేదు. ఈ పిల్ల విషయం మిటిం గ్రామంలో తేల్చుకుందాం..."

అందరూ అక్కడనుంచి కదిలారు.

తనకి సపోర్ట్ చేసిన సుబ్బారెడ్డి వెనుక నడుస్తోంది కోందుపడుచు పుబులి. ఒక చోట నెమలిపిట్ట పురివిప్పి ఆడుతోంది. ఆ దృశ్యాన్ని ద్వివేది తప్ప మిగతావారు చూసి ఆనందించారు. కొండల్లో పుట్టిన ఆ పిల్ల వల్ల ఎదురైన సమస్య ఎలా పరిష్కరించుకోవాలో తెలియక సతమతమవుతున్నాడు ద్వివేది.

సూర్యుడు తలపైకి చేరుకున్నప్పుడు ఆగి రొట్టెలు తిన్నారు. పుబులి తనికిచ్చిన రొట్టెలు ఆకలిమీదున్నట్టు మాట్లాడకుండా తినేసింది. కాసేపు విశ్రాంతి తీసుకుని బయలుదేరి కొంతదూరం నడిచారు.

"అమ్మా..." అరిచి కూర్చుండిపోయాడు బసవప్ప.

అతన్ని కాటువేసిన సర్పం వేగంగా పొదల్లోకి దూరింది. ద్వివేది రెండు అంగల్లో బసవప్పని సమీపించి కాలు పరీక్షించాడు. కాలిపిక్కమీద పాముకాటు కనిపించింది. జంగిల్‌షూ విప్పి ప్యాంటు మోకాలివరకూ లాగి కర్చీఫ్‌తో కాటుకి జానెడు దూరంలో కట్టుకట్టాడు.

"కంగారుపడకుండా కదలకుండా అలాగే





పడుకో..." అని చెప్పి తన బ్యాగ్‌నుండి కొత్త బ్లేడు తీశాడు.

పాముకాటు వేసినచోట బ్లేడ్‌తో నిలువుగా గంటుపెట్టాడు. రక్తం చివ్వున చిమ్మింది. ముందుకి వంగి రక్తం పీల్చి ఉమ్మసాగాడు ద్వివేది.

పుబులి పొదల్లోకి వెళ్ళి చిన్న చిన్న ఆకులు గుప్పెడు తెచ్చింది. వాటిని నలిపి ద్వివేదిని పక్కకుతోసి గాయంపైన పసరు పిండి, ఆ పిప్పి గాయంపైన వుంచి కట్టు కట్టింది. పెద్ద ఆకులు కోసుకొచ్చి విసనకర్ర మాదిరి పట్టుకుని విసరడం ప్రారంభించింది.

ద్వివేది నోరు శుభ్రం చేసుకుని సిగరెట్ ముట్టించి ఓ రాయిమీద కూర్చున్నాడు.

అరగంట తరువాత బసవప్ప కొద్దిగా కదిలాడు. కళ్లు తెరిచి తన చుట్టూ మూగినవారిని గమనించి లేవబోయాడు. పుబులి చెయ్యి అందుకుని అతన్ని కూర్చోబెట్టింది. ఆ కాస్త సమయంలోనే జబ్బుపడిన వాడిలా బసవప్ప మొహం పీక్కుపోయింది.

"నడవగలవా?" సిద్ధయ్య అడిగాడు.

సమాధానం చెప్పలేదు బసవప్ప.

సుబ్బారెడ్డి పనివారికి ఏదో చెప్పాడు. వాళ్లు లగేజినుండి కత్తితీసి తుప్పలు దాటి వెళ్లి పొదవాటి కర్రలు నరుక్కొచ్చారు. అడవితీగల సాయంతో ఒక మనిషి పడుకునే విధంగా కట్టారు. బసవప్పని దానిమీదకు ఎక్కించి భుజాలకు ఎత్తుకున్నారు.

పుబులి పనివాళ్ళ లగేజి కొంత తీసుకుంది. మిగిలిన లగేజి తలా కొంచెం అందుకున్నారు. పుబులి సూచించిన ప్రకారం అడ్డదారిలో ప్రయాణించి సూర్యుడు అస్తమించడానికి ముందే మిటిం గ్రామం చేరుకున్నారు.

పుబులిని చూసి ఒక్కసారి గ్రామంలో అలజడి చెలరేగింది.

★ ★ ★

మిటిం గ్రామంలోని కోందులు పిల్లలతో సహా రచ్చబండ దగ్గర చేరారు. పంచాయితీ జరుగుతున్నప్పుడు గ్రామస్తులు హాజరు కావడం అక్కడ రివాజు. ఒకరినొకరు తిట్టుకున్నా, దొంగతనం చేసినా, ఇల్లు కట్టడానికి, అడవి నరికి బాగుచేసి వ్యవసాయం చెయ్యడానికి, గొడవలు జరిగినప్పుడు పంచాయతీ జరిపి నిర్ణయం తీసుకుంటారు.

ఆరోజు జరిగే పంచాయితీకి ఓ ప్రత్యేకత వుండటంవల్ల లేవలేని ముసలివాళ్ళు కూడా ఓపిక చేసుకుని రచ్చబండ దగ్గర గుమికూడారు. ఆ సాయంకాలం గ్రామానికి వచ్చిన మనుషులు ఓ పక్క కూర్చున్నారు.

పంచాయితీ ప్రారంభమయింది.

మిణిఅపాయుకి చెందిన దివుడు సాహోతా కొడుకు రెండురోజుల క్రితం వేట కోసం మిటిం గ్రామం వచ్చాడు. పుబులి నీరు తేవడానికి గెడ్డకెళ్ళింది. దివుడు సాహోతా కొడుకు ఆమె చెయ్యి పట్టుకుని తీసుకుపోయాడు. న్యాయంగా మిటిం గ్రామపెద్దలు మిణిఅపాయు వెళ్ళి కన్యాశుల్కం పుచ్చుకుని పెళ్ళి జరిపించాలి. ఇది అనాదిగా వస్తున్న ఆచార వ్యవహారం. అయితే మార్గమధ్యలో ద్వివేది మజుందార్ అనే నాగరీకుడు కోందు యువకునితో యుద్ధంచేసి పుబులిని తిరిగి గ్రామానికి తీసుకొచ్చాడు.

ఈ వివరాలు అందరికీ తెలియపర్చి ముందుగా ద్వివేదిని వివరణ అడిగాడు గ్రామపెద్ద హర్గుణసాహోతా.

ద్వివేది లేచి నిలుచున్నాడు.

అక్కడ వున్న గ్రామస్తుల కళ్ళు అతన్ని పరీక్షించాయి. పెళ్లికాని పడుచులు తమ తల్లిదండ్రుల వెనకనుంచి దొంగచూపులు చూశారు. ఝూకరపేనుకి దయపుడితే అటువంటి మగవాడు మొగుడుగా దొరుకుతాడనే ఆలోచన వారి మనస్సుల్లో కదులుతోంది.

"అతను పుబులిని బలవంతంగా తీసుకు

పోతున్నాడని భావించి రక్షించాను. మా సమాజంలో ఆడపిల్లని బలవంతంగా తీసుకువెళ్ళడం నేరం. నిస్సహాయులైన ఆడవాళ్ళకు సాయపడటం మానవధర్మం. మీ గురించి, మీ ఆచారాల గురించి నాకు తెలియదు. అందుచేత పుబులికి సహాయం చెయ్యాలని మాత్రమే విడిపించానని మీరు గ్రహించాలి" చెప్పి కూర్చున్నాడు ద్వివేది.

అంతకంటే ఎక్కువ మాట్లాడటం అనవసరమని తలిచాడు అతను. నిజానికి ఆ వ్యవహారం అక్కడ చర్చకు రావడం ఇష్టం లేదు. అతని ఇష్టానికి వ్యతిరేకంగా పంచాయతీ జరుగుతోంది.

సుబ్బారెడ్డి లేచి అందరివైపు ఓసారి చూసి గొంతు సర్దుకున్నాడు.

"అతను చెప్పింది నిజమే! తప్పు అని తెలియక పుబులిని విడిపించాడు. మీ గ్రామాలు తిరిగిన మాలాంటివారికి తప్ప మీ ఆచారాలు ఇతరులకు తెలియవు. ఉదూలియా పూర్వకాల రాక్షస వివాహపద్ధతికి చెందినది. ఈ రకమైన వివాహం మా సమాజంలో చట్టవిరుద్ధం. అందుచేత ద్వివేది చేసిన పని పెద్దమనసుతో క్షమించాలి..." గంభీరంగా పలికింది సుబ్బారెడ్డి కంఠం.

చుట్టూ కమ్ముకున్న చీకటి పారద్రోలడానికి కాగడాలు వెలిగించి నాలుగువైపులా పెట్టారు. ఒకరి మొహం ఒకరికి కనిపించని అస్పష్టమైన వెలుగది. ఆ సమయంలో అడవి ఆదమరచి నిద్రపోతోంది. జంతువులు సంచారానికి బయలుదేరినట్టు అరుపులు ప్రస్ఫుటంగా వినిపిస్తున్నాయి. గాలి వీస్తున్నప్పుడల్లా చెట్లకొమ్మలు రాసుకున్న చప్పుడౌస్తోంది. చలిగాలి శరీరాలను వణికిస్తోంది.

సభ్యత అనే ముసుగుకింద కపటం దాచుకోవటం తెలియని కోందులు నిద్రరానట్టు హార్గుణసావోతా తీర్పుకోసం చెవులు రిక్కించి వేచి చూస్తున్నారు.

గ్రామపెద్దల అభిప్రాయం అడిగి తెలుసుకుని చివరగా లేచి నిలుచున్నాడు హార్గుణ సావోతా.

"తెలిసి ముట్టుకున్నా తెలియక ముట్టుకున్నా అగ్గేటి చేస్తుంది?" చుట్టూ కూర్చున్న వారిని ఉద్దేశించి అడిగాడు.

"కాలుతుంది..." ముక్తకంఠంతో చెప్పారు.

ద్వివేది మొహం పాలిపోయింది.

"కోందు సమాజ ఆచారం ప్రకారం ద్వివేది మజుందార్ అనే ఇతను పుబులిని గెలుచుకున్నాడు. ఆమెని తీసుకెళుతున్న యువకుడు ఇతనితో తలపడడానికి ముందు "నాతో యుద్ధం చేస్తావా?" అని అడిగితే, పుబులిని వెనక్కి తీసుకుని జీవితాంతం రక్షణ కల్పిస్తానని జవాబిచ్చాడు. ఈ మనిషి ఎక్కడివాడైనా పద్ధతి ప్రకారమే పుబులిని గెలిచాడు. కాబట్టి రేపు సూరీడు కనిపించిన క్షణంలో హారుపేను (వనదేవత) సాక్షిగా గ్రామపురోహితుడు పెళ్ళి జరిపిస్తాడు"

అక్కడ కూర్చున్న గ్రామస్తులు ఒక్కసారిగా సంతోషంతో అరిచారు. ఎవరో డోలు వాయించారు. కడవలతో విప్పసారా మోసుకొచ్చారు. ఒకరినొకరు తోసుకుంటూ తాగడం మొదలెట్టారు. క్షణాలలో అక్కడి వాతావరణం మారిపోయింది.

ద్వివేదితోపాటు మిగతావారికి కూడా మతిపోయింది ఏంచెయ్యాలో తెలియక హార్గుణ సావోతా కోసం వెదికాడు సుబ్బారెడ్డి. ఆ హడావిడిలో అతను ఎక్కడా కనిపించలేదు. భారమైన హృదయాలతో గుడిసెలకు తిరిగొచ్చారు.

బ్యాగునుండి విస్కీబాటిల్ తీసి తాగడం మొదలెట్టాడు ద్వివేది. తనకోసం తెచ్చిన ఆహారపదార్థాలు కన్నెత్తి చూడలేదతను. గ్రామపెద్ద అటువంటి నిర్ణయం తీసుకుంటాడని ఊహించకపోవడంతో ఖంగుతిన్నాడు. పరిపరివిధాలుగా ఆలోచిస్తూ





బాటిల్ అంతా తాగేసి ఒళ్ళు తెలియకుండా పడుకుండిపోయాడు.

ఎప్పుడు తెల్లవారిందో, ఎవరు తనని లేపడానికి ప్రయత్నించారో అతనికి తెలియదు. శరీరానికి నీళ్ళు చల్లగా తగిలేసరికి కళ్ళు సగం తెరిచాడు. ఒంటిమీద డ్రాయరు మాత్రం మిగిల్చి గెడ్డలో కూర్చోబెట్టారు కోందు పడుచులు. గుప్పెళ్ళతో చిలి ఆకులు పట్టుకుని ఒళ్ళు తోమసాగేరు. కండలు తిరిగిన శరీరాన్ని విశాలమైన ఛాతీని పట్టి పట్టి రుద్దినా కిక్కురుమనలేదు ద్వివేది.

కోందుల దృష్టిలో వివాహం పవిత్రమైన కార్యం. పుట్టినరోజు, గిట్టేరోజు తెలియదు. తెలిసి జరిగే ఒకేఒక్క కార్యం పెళ్ళి. అందుకే కోందు సమాజం భార్యకి ఎంతో విలువ ఇస్తుంది. "నా మొగుడు సరిగ్గా చూడటంలేదు. ఇవాళనుంచి పెళ్లితాడు తెంచుకుని నేపోతున్నాను" అని ఆడది అంటే, ఆ ఒక్కమాటతో పెళ్లిబంధం తెగిపోతుంది. సంతానం తండ్రిది కాబట్టి, అయిష్టం చెప్పేందుకు ఆడదానికి అడ్డు లేదు.

మల్కనగిరి అడవుల్లో "బండాపరజా" అనే జాతి అడవి మనుషులున్నారు. ఆ జాతిలో ఆడవాళ్లు బట్టలు కట్టుకోకూడదని సీత శాపం ఇచ్చిందట. వనవాసంలో సీత దుస్తులు విడిచి గెడ్డలో స్నానం చేస్తుంటే బండాపరజా స్త్రీలు హేళనగా నవ్వారట. కోపం వచ్చి సీతాదేవి వారికి శాపం ఇచ్చింది. అప్పటినుంచి ఆ జాతి ఆడవాళ్ళు నగ్నంగా సంచరిస్తారు. బండాపరజా స్త్రీలకు స్వేచ్ఛ అధికం. మగవాళ్ళను వరుసగా నిలబెట్టి పిరుదులమీద వాతపెట్టి త్రుళ్ళిపడనివాడిని పెళ్ళాడతారు. ఆయుధాలు చేపట్టి వేటాడి మగవాడిని పెంచుతారు.

ఆ జాతివారిలా కాకపోయినా కోందుల్లో

స్త్రీకి విలువ వుంది. రచ్చబండ వద్ద పంచాయతీ జరపడానికి ముందు తన కూతురి అభిప్రాయం అడిగి తెలుసుకున్నాడు హార్గుణసావోతా. ఆడపిల్ల కోరిక మన్నించాలి కాబట్టి దానికి అనుగుణంగానే తీర్పు చెప్పాడు.

తెల్లారేసరికి హార్గుణ సావోతా ఇంటి ముందు చిన్నపందిరి వెలిసింది. గ్రామస్తులెవరూ ఆ రాత్రి నిద్రపోలేదు. కొత్తకుండతో ఎవరూ ముట్టని నీరు అర్ధరాత్రి గెడ్డకెళ్ళి తెచ్చాడు పురోహితుడు. ఆ నీటితో పందిరికి ఒకమూల మంగళకలశం పెట్టాడు.

బాజాలు మోగాయి.

ద్వివేదిని తీసుకొచ్చి పందిరిమధ్య నిలబెట్టారు. నీటితో వున్న కొత్తకుండని పుబులి తలకెత్తుకుంది. ద్వివేది చుట్టూ మూడుసార్లు ఆ కుండతో తిరిగింది. పురోహితుని సూచన ప్రకారం తన కుడికాలు ఎత్తి పుబులి ఎడమపాదంపైన పెట్టాడు ద్వివేది. మంత్రాలు చదువుతూ వధూవరుల తలలు వంచి కుండలోని నీరు కుమ్మరించాడు పురోహితుడు.

పెళ్ళి అయిపోయింది.

అంతవరకూ ద్వివేది మెదడ్ని ఆవరించిన స్థబ్దత క్రమంగా తొలిగిపోయింది.

★ ★ ★

ఉదయం అతిథులు ఖాళీచేసిన గుడిసెల్ని చీకటిపడుతున్నప్పుడు మిణిఅపాయు వచ్చిన సూరి బృందానికి ఇచ్చాడు దివుడు సావోతా. సూరి యూనిఫాంలో లేకపోయినా అతనితో వచ్చినవారు డ్రెస్‌లో వుండటంవల్ల అతన్ని ఓ అధికారిగా గుర్తించాడు దివుడు.

గాలికి, వానకి భయపడి గుడిసెలు నక్కగోతుల్లా నిర్మించుకున్నారు కోందులు. కిటికీలు లేని గుడిసెకు అమర్చిన ద్వారం చాలా చిన్నది. ఇంటి చూరు నేలని తాకడానికి ప్రయత్నిస్తున్నట్టు కిందకి వుంది. సగానికి పైగా వంగితే తప్ప మామూలు మనుషులు గుడిసెలోకి వెళ్ళలేరు. సూరి శ్రమపడి లోపలకి వెళ్ళాడు. లోపల చిన్నదీపం వెలుగుతోంది. తనకంటే ఓ అడుగు ఎత్తున్న పైకప్పు చూసి చిన్నగా నవ్వుకున్నాడు సూరి.

అతనితో వచ్చిన కానిస్టేబుల్స్ రెండో గుడిసెను ఆక్రమించారు.

దివుడు సావోతా హడావిడి పడుతుంటే వారించాడు సూరి. అతని ద్వారా నిన్న వచ్చిన ఆరుగురు వ్యక్తులు మిటిం గ్రామం వెళ్ళినట్టు తెలుసుకున్నాడు. దివుడు సావోతా కొడుకు గాయపడి వచ్చాడని, మిటిం గ్రామసావోతా కూతుర్ని తీసుకొస్తుంటే ఆరుగురు వ్యక్తులు తారసపడి అందులో ఒకవ్యక్తి ఆ పిల్లని విడిపించాడని కూడా తెలిసింది.

ఏదో కలకలం వినిపించి బయటకొచ్చాడు సూరి. ఒక గుడిసెముందు కాగడాలు వెలుగుతున్నాయి. అక్కడ కొంతమంది గ్రామస్తులు మూగారు. వాళ్ళ మధ్య అస్థిపంజరంలా ఎండిపోయిన ముసలమ్మ పూనకం వచ్చినట్టు ఆడుతోంది.

"మాంగురు, ఆరాడగురు-దికిరాయి పాకరాయి..." అనే పదాలు బొంగురు గొంతుతో పలుకుతూ, ఎండుపుల్లలవంటి చేతులు గాలిలో కదిలిస్తూ పిచ్చిపట్టినట్టు గెంతుతోంది.

"అక్కడ ఏం జరుగుతోంది? " దివుడ్ని అడిగాడు సూరి.

కోందులు ఒకరితో ఒకరు మాట్లాడుకోవడానికి 'కుభి' భాష ఉపయోగిస్తారు. చిన్నతనంనుంచి సంతకి పోయి రావడంవల్ల వారికి ఒరియా పరిచయమవుతుంది. గ్రామానికి వచ్చిన నాగరీకులతో కూడబలుక్కున్నట్టు ఒరియా మాట్లాడతారు.

అతను నిట్టూర్చి చెప్పాడు.

"కోందు బిడ్డడికి జబ్బు చేసింది దొరా! మంత్రగత్తె మంత్రాలు చదువుతూ ఆడితే





అమ్మవారు పూని జబ్బు నయమవుతుంది..."

"హాస్పటల్‌కి తీసుకెళ్ళరా?"

"అంటే ఏటి దొరా?"

అతనికి హాస్పటల్ అనే పదం పలకడం రాలేదని గ్రహించి సమాధానం ఎలా చెప్పాలా అని ఆలోచించాడు సూరి.

"రోగాలు నయంచేసే దానిని హాస్పటల్ అంటారు. జబ్బుచేసిన వారికి అక్కడ మందులిస్తారు..."

"అదెక్కడుంటుంది దొరా?"

"బరంపురంలో..."

"కస్పాసంత తప్ప మా కోందులకు మరేటి తెలవదు. జబ్బు మనిషికి డంబర బాత్రి వేళ్ళ, నల్లమిరియాలు తినిపిస్తాం..."

"మంత్రాలతో జబ్బులు తగ్గవు..."

"మా తాత, ముత్తాతలు అదేచేసి ఉప్పు కొనడానికి పోయారు (చనిపోయాడు అనడానికి బదులుగా వాడేమాట). ఇప్పుడు మేము కూడా రోగాలకు మంత్రాలు వేస్తున్నాం. మేము ఉప్పుకొనడానికిపోతే మా పిల్లలు కూడా మంత్రాలు వేయిస్తారు..."

ఆటవికుల గురించి పుస్తకాల్లో చదివాడు. నాగరికత సోకని, అభివృద్ధి నోచుకోని గిరిజనుల్ని ప్రత్యక్షంగా చూస్తుంటే ఆశ్చర్యం కలుగుతోంది. బెడ్‌షీట్ మీద నడుము వాల్చి ఆలోచిస్తున్నాడు సూరి.

ఆ గ్రామం సందర్శించడం అతనికి మరుపురాని అనుభవం.

★ ★ ★

మెలకువ వచ్చిన వెంటనే స్నేహితుడ్ని తట్టిలేపాడు బెహరా. రాత్రి మద్యం తాగడంవల్ల ఇద్దరూ ఒళ్ళు మరిచి నిద్రపోయారు. సూదిలా నిలువుగా వున్న ఆ కొండ వెనక్కి నడిచి రాళ్ళమీద జాగ్రత్తగా అడుగువేసి కిందకు దిగారు. ఒకచోట నీళ్ళ మడుగు కనిపించింది. కొండలోని చిన్నపగులునుంచి ఒక్కొక్క చుక్క మడుగులో పడుతోంది. స్వచ్ఛంగా, తెల్లగా వుందా నీరు. బాటిల్స్ నిండా నీరు నింపాడు బెహరా.

సహజసిద్ధంగా ఏర్పడిన ఆ నీటి మడుగుకి చుట్టూ జంతువుల అడుగుల గుర్తులున్నాయి. మడుగునిండితే నీరు కిందకు జారుతున్న జాడ ఒకపక్క కనిపిస్తోంది. రాళ్ళ మధ్య పెరిగిన అడవితీగలు మడుగు పైన వేలాడుతూ అందాన్ని తెచ్చిపెట్టాయి. ఒక చెట్టు పసుపు పచ్చని పూలు విరగబూసింది. రాలిన పూలు నీటిలోను, మడుగు చుట్టూ పడి అలంకరించినట్టుంది.

స్నానాలు చేసి పైకివచ్చారు. నీరు కాచి తాగడానికి వసతులు లేవు కాబట్టి బాటిల్స్ ఎండలో పెట్టాడు బెహరా.

రొట్టెలు తిని రాయిమీద కూర్చున్నారు. ఎదురుగా వున్న కొండవెనుకనుంచి బయట కొచ్చాడు సూర్యుడు. కొంత సమయం గడిచిన తరవాత వున్నట్టుండి చిన్న అలికిడయింది. ఇద్దరూ ఆయుధాలు అందుకుని అలికిడి వినవచ్చినవైపు చూశారు.

ఎదురుగా వున్న తుప్పల్ని దాటుకుని కొండగొర్రె ఒకటి ఇవతలకొచ్చింది. ఆ ప్రాంతంతో తనకి పరిచయమున్నట్టు నిర్భయంగా గడ్డిపరకలు కొరకసాగింది. బంగారురంగు వెంట్రుకలపైన సూర్యకాంతి పడి మెరుస్తోంది.

స్నేహితుడ్ని శబ్దం చెయ్యొద్దని సైగచేసి రైఫిల్ ఎత్తాడు బెహరా. కుడికంటితో గురి చూసి ట్రిగ్గర్ నొక్కాడు. పెద్ద చప్పుడుతో రైఫిల్‌నుండి వెలువడిన తూటా కొండగొర్రె కడుపులోకి దూసుకుపోయింది. దెబ్బతగిలిన మరుక్షణం అది ఎగిరిపడింది. లేచి పరిగెత్తడానికి ప్రయత్నించి సాధ్యంకాక గిలగిలా కొట్టుకోసాగింది. దానితోపాటు కదిలిన తుప్పలు కాసేపటికి నిశ్చలంగా వుండిపోయాయి. బెహరా రైఫిల్ పక్కనపెట్టి కొండగొర్రె శరీరాన్ని లాక్కొచ్చాడు.

"దీన్ని ఏంచేద్దాం?" స్నేహితుడు అడి



గాడు.

సిగరెట్ ముట్టించి ఆ మూగప్రాణి విగత శరీరంవైపు చూసి అన్నాడు.

"ఆలోచిద్దాం..."

"రైఫిల్ పేలిన శబ్దానికి ఎవరైనా వస్తారేమో? "

"వస్తే ఏమవుతుంది? " ఎదురుప్రశ్నించాడు బెహరా.

గుహలోకి వెళ్ళి నైఫ్ తెచ్చాడతను. ఒక చెట్టుకి కనిపిస్తున్న పెద్ద పెద్ద ఆకులు చూపించి కోసుకురమ్మని స్నేహితుడ్ని పురమాయించాడు. అతను తెచ్చిన ఆకులు నేల మీద పరిచి కొండగొర్రె శరీరాన్ని వాటిపైన పడేశాడు.

నైఫ్‌తో కొండగొర్రె తొడచీల్చి ఓ మాంసం ముక్క వెలుపలికి లాగాడు. నాలుగు కాళ్ళ నుంచి పక్కటెముకలనుంచి కొంత మాంసం తీసి నీటితో శుభ్రంచేసి ఆకుల మీద పెట్టాడు. ఆహారంతోపాటు తెచ్చిన టేబుల్ సాల్ట్ మాంసం ముక్కలకు అద్దాడు.

అతని పనులు ఆశ్చర్యంగా చూస్తున్నాడు స్నేహితుడు.

ఒక మొక్కనుండి రెండు పుల్లలు విరిచి సూదిగా చెక్కాడు. నిప్పురాజేసి, పుల్లలకి మాంసం ముక్కలు గుచ్చి వాటికి కొబ్బరి నూనె రాసి నిప్పులమీద కాల్చాడు బెహరా. కాల్చిన ముక్కలకి మిరియాలపొడి జతచేసి మధ్యాహ్నం బ్రెడ్‌తోపాటు తిన్నారు. ఆ మాంసం రుచిచూసి స్నేహితుడు మెచ్చుకోకుండా వుండలేకపోయాడు.

"నువ్వు తెలివైనవాడివి... మరికొంత మాంసం కాలిస్తే రాత్రి మందులోకి బ్రహ్మాండంగా వుంటుంది"

నవ్వాడు బెహరా.

"బాయిల్డ్ ఎగ్స్‌కోసం తెచ్చిన పెప్పర్, సాల్ట్ అయిపోయాయి" చెప్పాడు.

అయిష్టంగానే కొండగొర్రె శరీరాన్ని లోయలోకి విసిరేశాడు స్నేహితుడు. ఒకరి తరువాత ఒకరు మరింత జాగ్రత్తగా బాట వైపు చూడసాగారు. పది నిమిషాలకోసారి బైనాక్యులర్‌తో పరిశీలిస్తున్నారు. సూర్యుడు పశ్చిమదిక్కు జారిపోయేవరకూ డేగకళ్ళతో పరికించారు.

సమయం నెమ్మదిగా గడుస్తోంది.

వెలుగు తగ్గిపోయి దానితోపాటు చలిగాలి మొదలయింది. మరికొంతసేపు చూసి ఇద్దరూ గుహలోకి వెళ్ళారు. పగలు ప్రయాణమే కష్టమైతే ఆ మార్గంలో రాత్రి ఎవరొస్తారు? అదే ఆలోచనతో కొవ్వొత్తి వెలిగించి బాటిల్ ఓపెన్ చేశారు.

"మనం ఎదురుచూస్తున్న మనుషులు రేపు వస్తారా? " అడిగాడు స్నేహితుడు.

"రావాలి... ఒకవేళ రాకపోతే మనకి తెలుస్తుంది"

"ఎలా? "

"పని అప్పగించిన మనిషి సెల్‌ఫోన్ ద్వారా చెబుతాడు"

అప్పుడే సెల్ మోగింది.

"హల్లో! రామ్‌బెహరాని..."

"లొకేషన్ ఎక్కడ? "

"సూదికొండ"

"రేపు ఉదయం మర్రిచెట్టు కిందనున్న బాటలో నడిచి కొండ చేరుకోండి. కొండ అవతలివైపు సగంవరకూ దిగి రాళ్ళచాటున ఆగండి. ఇదంతా మధ్యాహ్నం పన్నెండుగంటలలోపు జరగాలి. అక్కడనుంచి మీకు కొండకిందనున్న మైదానం స్పష్టంగా కనిపిస్తుంది. సాయంకాలంలోపు నేను చెప్పిన మనుషులు ఆ మైదానంలోకి వస్తారు. చెరో పక్కనుంచి వాళ్ళమీద నాలుగురౌండ్లు పేల్చండి. ఆ కాల్పుల్లో ఎవరూ గాయపడకూడదు. ఆ పనిచేసి వెంటనే సూదికొండ చేరుకోండి. అర్థమైందా? "

"మొదటి మనిషిని కాల్చేస్తే ఒకపని అయిపోతుందికదా? "

"వద్దు... ఈ చిన్న మార్పుతో పథకం యథాతథంగా అమలుచెయ్యాలి"




"సరే..."

కట్ చేశాడు బెహరా.



పెళ్లయిన తరువాత వధూవరులను తీసుకెళ్ళి ఒక గుడిసెలో వదిలాడు పురోహితుడు. పుబులివైపు ఓసారి చూసి సిగరెట్ వెలిగించుకుని ఓ మూల కూర్చుండిపోయాడు ద్వివేది. ఆ పరిస్థితికి కారణమైన ఆమెను ఎలా నిందించాలో తెలియడం లేదు. నిందిస్తే మరో ప్రమాదం ముంచుకొస్తుందేమోననే సందేహం కలగకపోలేదు. అందుకే మౌనంగా వుండిపోయాడు.

ఇంతలో కొంతమంది కోందు పడుచులు నాట్యంచేస్తూ, పాటలు పాడుతూ ఆ గుడిసెవద్దకు వచ్చారు. కొందరు గుడిసెలోకి దూరి పుబులిని లాక్కెళ్ళిపోయారు.

"జయకే, డుంబర, డుంబరహే..."

వాళ్ళ భాషలో వినిపిస్తున్న ఆ పాట దూరమయింది.

ద్వివేది మజుందార్ అనే తను ఎక్కడ పుట్టాడు.? తనకి ఇష్టం లేకపోయినా ఇదంతా ఎందుకు జరిగింది? ఎప్పుడూ వినని, కనీసం పేరు తెలియని ఆ గ్రామంలో పెళ్ళి జరగడమేమిటి? బలవంతమైన సర్పము చలిచీమల చేతజిక్కి చచ్చినట్టుంది తన పరిస్థితి.

ద్వివేది పరిపరివిధాలుగా ఆలోచిస్తున్న ఆ సమయంలో సుబ్బారెడ్డి వచ్చి సానుభూతిగా చూశాడు.

"ఇప్పుడేం చెయ్యాలనుకుంటున్నావ్?" అడిగాడు.

జవాబు ఇవ్వలేదు ద్వివేది.

"మనం, ఒక ముఖ్యమైన పనిమీద వెళుతున్నామని మూడు, నాలుగు రోజుల్లో తిరిగొస్తామని చెప్పి హర్గుణసాహోతాని ఒప్పిస్తాను. మధ్యాహ్నం విందులో నువ్వు కల్లు, సారాయి ముట్టుకోకు. ఒకవేళ అతను అంగీకరించకపోతే బలప్రయోగం చేసి వెళ్ళాల్సివుంటుంది..." అన్నాడు.

అంతకంటే మార్గంలేదు కాబట్టి ద్వివేది తలూపాడు.

అక్కడనుంచి బయటపడటం పెద్ద సమస్యేం కాదు. అయితే వాళ్ళని మోసగించి వెళ్ళాలని ద్వివేది అనుకోవడంలేదు. కోందుల వద్ద డబ్బులేకపోయినా విలువలు పుష్కలంగా వున్నాయి. అడవిని నమ్ముకుని, అడవిలో పండే పంట అమ్ముకుని బతుకుతున్నారు. దేశాన్ని ప్రేమించని వాడితోను, దేశరహస్యాలు అమ్మి డబ్బు సంపాదించే వాడితోను, తల్లితండ్రులకు తిండిపెట్టనివాడితోను పోలిస్తే జంతువుల మధ్య జీవించే కోందు నిజమైన మనిషి. అతనికి నాగరికత తెలియదు. నయవంచన చెయ్యడు. పిచ్చిపిచ్చి ఆచారాలు వదలడు. శరీరంనిండా బట్టతొడగడు. అయినా కూడా అతని మనసు వెన్నెలంత నిర్మలం. హృదయం ఆకాశమంత విశాలం.

సుబ్బారెడ్డి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

కోందు పడుచులు పుబులిని ఇంటింటికి తిప్పుతున్నారు. ప్రతి ఇంటివద్ద ఆమెకి పూసలు, రంగురంగుదారాలు బహుమతిగా ముడుతున్నాయి. వయసుమళ్ళిన స్త్రీలు పుబులిని ముద్దులతో ముంచెత్తుతున్నారు.

సారాకుండలు, కల్లుడబ్బాలు ఊరు మధ్య పెట్టించాడు హోర్గుణసాహోతా. గ్రామంలోని మగవారంతా వాటిచుట్టూ చేరి కడుపు పట్టినంత తాగుతున్నారు. నిషాతో తూలుతున్న మనుషులతో గ్రామం అంతా ఒకటే హడావిడి. కొందరు మాట్లాడుతుంటే మరికొందరు పాటలు పాడుతున్నారు. ఒక చోట రాళ్ళు పేర్చి పొయ్యి ముట్టించారు. విందుకోసం ఇంటికో కోడి వచ్చింది. కాస్త వయసు మళ్ళిన ఆడా, మగా అక్కడ చేరి పనుల్లో పాలుపంచుకున్నారు. అటూ ఇటూ హడావిడిగా ఏవో ముఖ్యమైన పనులమీద పోతున్నట్టు పిల్లలు తిరుగుతున్నారు.

సూర్యుడు ఆకాశం మధ్యకు వచ్చేసరికి వంటలు పూర్తయ్యాయి.

పుబులి గుడిసెకు తిరిగొచ్చి తన అమాయకమైన కళ్ళతో ద్వివేదిని చూసింది. అతను మాటా, మంతీ లేకుండా అలాగే కూర్చున్నాడు. తల్లి గుర్తురావడంతో అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏటాలోచిస్తున్నావ్ మావా? " ఒక్కొక్క అక్షరం కూడబలుక్కుని ఒరియాలో అడిగింది పుబులి.

చప్పుడుకి చురుగ్గా తలతిప్పిన నాగులా చూసి పూసలు, రంగురంగుదారాలు పట్టుకుని అమాయకంగా నిలుచుని వున్న పుబులిని చూసి తమాయించుకున్నాడు.

"ఏంలేదు" చెప్పాడు.

"ఝొలా (గెడ్డ) దగ్గరకి పోదామా, పూలు దొరుకుతాయి"

ఆ మాటతో ద్వివేది పూర్తిగా చల్లబడిపోయాడు.

"ఇప్పుడు కాదు. నేనొక ముఖ్యమైన పని మీద వెళుతూ మీ గ్రామంలో చిక్కుకుపోయాను. నన్ను వెళ్ళనిస్తే మూడురోజుల్లో పనిపూర్తి చేసుకుని వస్తాను. మీ అయ్యతో చెప్పి వస్తావా? " అడిగాడు.

"నన్ను తీసుకెళతావా? " ఆశగా అడిగింది.

"నువ్వు మాతో రావడం ప్రమాదం. పని ముగించుకుని వస్తానని హోరుపేను సాక్షిగా చెబుతున్నాను..."

అతని తడికళ్ళను గమనించి గుడిసె నుంచి బయటికొచ్చి తండ్రిని వెదుక్కుంటూ వెళ్ళింది.

సుబ్బారెడ్డి, తండ్రి ఒక చెట్టుకింద కూర్చుని కనిపించారు. అప్పటికే సుబ్బారెడ్డి అభ్యర్థన తిరస్కరించాడు హోర్గుణసాహోతా. ఇక బలప్రయోగం తప్ప మరోమార్గం లేదని నిశ్చయించుకుని సుబ్బారెడ్డి లేవబోతున్నప్పుడు పుబులి అక్కడికి వెళ్ళింది.

అంతవరకూ అక్కడ అదే సంభాషణ జరగడంతో విసుగ్గా కూతుర్ని చూశాడు హోర్గుణసాహోతా.

"ఈయన అదే అడిగితే కుదరదని చెప్పాను"

"హోరుపేనుమీద ఆన చెప్పినోడు ఏడకి పోతాడు, పంపించు అయ్యా!" గారాబంగా అంది.

కూతురు మొహంలోకి చూశాడు హోర్గుణ సాహోతా. అతని భార్య చనిపోయి పదిహేను సంవత్సరాలైంది. అప్పటినుంచి కూతురు పుబులే అతని ప్రపంచం. పులితో పోరాడమని కూతురు అడిగితే సాధ్యాసాధ్యాలు చూడకుండా ఆ పనికి సిద్ధపడే మనిషతను. వీపుకి గుడ్డకట్టి చిన్నారి పుబులిని కూర్చోబెట్టుకుని వ్యవసాయపని చేసుకునేవాడు. అలాంటి కూతురు ఇష్టపడిందని పరాయిదేశంవాడికిచ్చి పెళ్ళిచేశాడు. వివాహం జరిగి కొన్ని గంటలు కూడా కాక ముందే అతన్ని వెళ్ళనివ్వమంటోంది.

కూతుర్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలియక నిట్టూర్చాడు.

"పూజారిని పిలుచుకురా..." కూతురుతో చెప్పాడు.

పుబులి అక్కడనుంచి లేడిలా పరిగెత్తింది. పదినిమిషాల్లో గోచీపెట్టుకున్న పూజారి కర్రసాయంతో సాహోతా వద్దకు




వచ్చాడు.

"నా కూతురి పెనిమిటి పనిమీద పోతా డట... యోగం చూసి చెప్పు..."

పూజారి తలెత్తి ఆకాశంవంక చూశాడు. సూర్యుడు తలకి తిన్నగా వుండటం గమనించి, వేళ్ళమీద ఏవో లెక్కలు వేశాడు. అతనివైపు వూపిరి బిగపట్టి చూస్తున్నాడు సుబ్బారెడ్డి. అతను యోగం బాగుండలేదని చెబితే ఏం చెయ్యాలనే దాని గురించి అంతరంగం ఆలోచిస్తోంది.

క్షణాలు గడుస్తున్నాయి.

"ఝూకరపేను పూజ చేయించి, విందు కుడిపి పంపు" అని చెప్పి అక్కడనుంచి తన పాకవైపు గబగబా నడిచాడు పూజారి. దారిలో ఒకచోట ఆతృతగా చూస్తున్న పులిని గమనించి ఆగకుండానే తలూపుతూ వెళ్ళిపోయాడు.

ఝూకరపేను పూజ పూర్తయింది.

సుబ్బారెడ్డి బృందం విందు అనంతరం గ్రామం విడిచిపెట్టింది. గ్రామస్తులు చాలా మంది పొలిమేరవరకూ వచ్చారు. హార్గుణ సాహోతా పక్కన నిలుచున్న పులిలి తడి చూపులు వెళుతున్న ద్వివేదిని వెంటాడాయి.

రాత్రికి డుంబాగూడ చేరుకుందా బృందం. నిజానికి అక్కడ ఆగాలని మొదట అనుకోలేదు. మిటిం గ్రామంలో మధ్యాహ్నం బయలుదేరటంవల్ల తప్పనిసరై డుంబాగూడ వెళ్ళారు. పదిగుడిసెల ఆ గ్రామం కొండవెనుక వుంది. ఒక కోందు కుటుంబం పక్క గుడిసెలో సర్దుకుని వారు పడుకోవడానికి చోటిచ్చింది.

మ్యాప్‌కింద పరిచి టార్చి సాయంతో చెప్పాడు సిద్ధయ్య.

"రేపు ఉదయం బయలుదేరి ఈ కొండ దిగి మైదానం దాటి ఆ కొండెక్కి దిగితే ఆంధ్రా చేరుకుంటాం. కొండ దిగిన క్షణంనుంచి జాగ్రత్తగా వుండాలి..."



"మీరెప్పుడయినా బరంపురం వస్తే దీనిని ఎవరికి చూపించినా నా దగ్గరికి తీసుకొస్తారు..." అని చెప్పి దివుడు సాహోతాకి విజిటింగ్‌కార్డ్ ఇచ్చి మిణిఅపాయు నుంచి బయలుదేరాడు సబ్‌ఇన్‌స్పెక్టర్ సూరి.

ఒకమనిషిని వారితో పంపాడు దివుడు.

నిజానికి అతను చాలా విచారంగా వున్నాడు. పక్కగ్రామంనుంచి కొడుకు పడుచుని తీసుకొస్తుంటే దారిలో అడ్డుకుని ఆమెని తిరిగి తీసుకుపోవడం అవమానకరమైన విషయం. ప్రతి సంవత్సరం రెండు గ్రామాలవారు కలిసి వేటకి వెళతారు. అంతేకాకుండా మిటింగ్రామంతో మిణిఅపాయుకి బంధుత్వముంది. కోందు సమాజంలో అరుదుగా జరిగే సంఘటన వల్ల మిటిం వాళ్ళముందు తలదించుకునే పరిస్థితి ఏర్పడింది. ఆ విచారం కుంగదీస్తున్నా కనిపించనివ్వకుండా సూరి బృందాన్ని సాగనంపాడతను.

గోచీ పెట్టుకుని గొడ్డలి భుజంపైన వేసుకుని దారిచూపిస్తూ కోందు నడుస్తుంటే, అతన్ని అందుకోలేక ఆయాసపడుతోంది సూరి బృందం. దొంతులు దొంతులుగా అంతు చిక్కనట్టు కనిపిస్తున్నాయి కొండలు. పొడవుగా కొన్ని, వెడల్పుగా కొన్ని ఒకదాని పక్కన ఒకటి బారులు తీరాయి.

రకరకాల చెట్లతో అడవి దట్టంగా వుంది. కొన్ని చెట్లకు రంగురంగుల పూలు పూస్తే, మరికొన్నిటికేవో కాయలు వేలాడుతున్నాయి. ఎక్కడ పుట్టిందో తెలియని గెడ్డ ఒకటి కొండవంపులోంచి నెమ్మదిగా ప్రవహిస్తోంది.

ఒకేసారి అంత దూరం నడిచే అలవాటు లేకపోవడంవల్ల ఆ కోందుతో సమానంగా అడుగులు వెయ్యలేపోతున్నారు. రెండు గంటలు ఏకబిగిన నడిచి ఒకచోట ఆగారు. తుప్పలవైపు వెళ్ళి పెద్ద దుంపతో తిరిగొచ్చాడు కోందు. గోధుమరంగులోని ఆ దుంప చుట్టూ అప్పుడే తవ్వి తీసినట్టు



మట్టి కనిపిస్తోంది. మట్టి దులిపి గొడ్డలితో పగులగొట్టి తలోముక్క ఇచ్చాడతను.

గుమ్మడికాయ ముక్కలా కనిపించినా లోపలి పదార్థం తియ్యగా వుంది. కోంధు స్త్రీలు కొండలమీదకెళ్లి తీగలు గుర్తుపట్టి దుంపలు సేకరిస్తారు. తల్లి అడవికెళ్ళి తెచ్చే దుంపలకోసం పిల్లలు ఎదురుచూడటం పరిపాటి.

దారిలో అక్కడక్కడా ఆగుతూ మిటిం గ్రామం చేరేసరికి చీకటిపడింది. అప్పటికి సూరి బృందం పూర్తిగా అలిసిపోయింది. ఉదయం గ్రామంలో జరిగిన శుభకార్యానికి సంబంధించిన హడావిడి ఇంకా సమసిపోలేదు. మిణిఅపాయు కోంధు తనతో వచ్చిన వారిని హార్గుణసావోతాకి పరిచయం చేశాడు.

వారిని సాదరంగా ఆహ్వానించాడు.

ద్వివేదికి పుబులిని ఇచ్చి పెళ్ళిచేశారని, మధ్యాహ్నం విందు ఆరగించి వాళ్ళు ఆంధ్రా వైపు వెళ్ళారని, మూడురోజుల్లో తిరిగొస్తారని తెలుసుకున్నాడు సూరి. అంతవరకూ వచ్చి వారిని వదిలిపెట్టే ఆలోచనలేదు కాబట్టి తను కూడా ఆ మార్గంలో వెళ్ళాలని నిర్ణయించుకుని హార్గుణసావోతాని అడిగాడు సూరి.

"ఎక్కడుంటాడో, ఏంచేస్తాడో తెలియనివాడితో కూతురు పెళ్ళి ఎలా చేశావ్?"

నోరంతా తెరిచి నవ్వాడు హార్గుణసావోతా. చదువూసంధ్యా లేని ఆ కోంధు మొహం కాంతివంతం అయింది.

"పైన ఆకాశం, కింద భూమి మేం పూజించే దేవతలు. వీటిని తప్పుకుని ఎవరూ మనుగడ సాగించలేరు. అతను ఎక్కడివాడైనా గ్రామపడుచుకుని గెలుచుకుని మావాడయ్యాడు. వనదేవత సమక్షంలో ఆమె ఇష్టంలేకుండా అది జరిగిందంటారా? ధరిత్రిమాత పూజచేసినవాడిని ఆ దేవత రక్షించి మా గ్రామం తీసుకొస్తుంది..."

తమ దేవతపట్ల అంతులేని విశ్వాసం ప్రకటించిన అతన్ని చూస్తుంటే విస్మయం కలిగింది సూరికి.

★ ★ ★

తుప్పలు, పొదలు దాటి కాలిబాటలోకి ప్రవేశించారు బెహరా, అతని స్నేహితుడు. ఇద్దరూ లోయదాటి ప్రధానబాట చేరుకుని నడవసాగారు. కొండపైనుంచి కనిపించిన మర్రిచెట్టు చేరుకోవడానికి చాలా సమయం పట్టింది. ఆ చెట్టుకిందనుంచి కొండవైపు అడుగులు వేశారు.

ముందు నడుస్తున్న బెహరా చప్పున ఆగిపోయాడు.

నాలుగుగజాల దూరంలో బాటకి అడ్డంగా నల్లగా ఏదో కనిపించింది. లావుపాటి తాడు మాదిరిగా కనిపిస్తున్న అది నెమ్మదిగా పాకడం చూసి కొండచిలువ అని గుర్తించాడు. రెండుక్షణాలు ఆలస్యంగా చూసిన స్నేహితుడు నిర్ఘాంతపోయి ఊపిరి బిగపట్టాడు. క్రమంగా అతని మొహం నిండా స్వేదం అలుముకుంది.

ఒక్క అంగుళం కూడా కదలకుండా నిలుచున్నచోటనే ఉండిపోయాడు. కొండచిలువ చర్మం సూర్యకాంతిలో మెరుస్తోంది. ఎంతో భారంగా తొందరేమీ లేనట్టు అది బాటని దాటుతోంది. ఓరకంట చెమటలు కక్కుతున్న స్నేహితుడ్ని చూసి అతను భయపడుతున్నాడని గ్రహించాడు బెహరా. కొండచిలువ శరీరం సన్నబడి తోక కనిపించిన కొన్ని క్షణాలకు పూర్తిగా అవతలికి వెళ్ళిపోయింది.

ఇద్దరూ అక్కడనుంచి కదిలారు. స్నేహితుడు నడుస్తూనే అప్పుడప్పుడూ వెనక్కి చూడటం బెహరా దృష్టిపథం నుండి దాటిపోలేదు. ఇద్దర్నీ ఆ బాట కొండపైకి తీసుకుపోయింది.

కొండ సగంవరకూ దిగి కిందనున్న మైదానం స్పష్టంగా కనిపించేచోట కూర్చున్నారు. బైనాక్యులర్‌తో ఆ ప్రాంతాన్ని పరి





శిలించాడు బెహరా గడ్డిలోని కాలిబాట వెంట బైనాక్యులర్ కదిపి చివరివరకూ అంటే అవతలి కొండదాకా చూశాడు. ఎక్కడా మనుషుల జాడ లేదు.

అప్పుడు సరిగ్గా పన్నెండయింది.

★ ★ ★

డుంబాగూడ నుంచి బయలుదేరింది సుబ్బారెడ్డి బృందం.

బసవప్ప పూర్తిగా కోలుకుని ఎప్పటిలాగే అడుగులు వేస్తూ సామాను మోసేవారితో మాట్లాడుతూ నడుస్తున్నాడు.

మిటిం గ్రామంలో హడావిడి నెలకొన్నా బసవప్పని నిర్లక్ష్యం చెయ్యలేదు పుబులి. ఎలాంటి విషానికైనా విరుగుడుగా పనిచేసే ఒకమొక్క ఆకులు తేవడానికి అడవికెళ్ళింది. గ్రామంలో పంచాయతీ జరుగుతుంటే కాలికి కట్టుకట్టి ఏదో పసరు తాగమని ఇచ్చింది.

నిజానికి బసవప్ప చాలా అదృష్టవంతుడు.

కోందులకు పాము విషాన్ని నిర్వీర్యం చేసే మొక్క గురించి తెలుసు. అయితే పాముకాటు తిన్నవాడికి ఆ మొక్క ఆకుల పసరు ఇవ్వడానికి సమయం వుంటేనే ప్రాణాలు దక్కుతాయి. బసవప్ప రక్తంలో చేరిన విషం చాలావరకూ తొలగించడంవల్ల సత్వర ప్రమాదం తప్పింది. అందుచేత పుబులి వైద్యంతో పూర్తిగా కోలుకున్నాడు.

ఆ బృందంలో ద్వివేది ఒక్కడే విచారంగా వున్నాడు.

మిటిం గ్రామంలో జరిగిన పెళ్ళి అతని మనసుని కల్లోలపరిచింది. అది బొమ్మల పెళ్ళిగా కొట్టిపారేయడానికి మనసు తిరస్కరిస్తోంది.

నంబియార్ అమాయకులపట్ల ప్రత్యేకమైన అభిమానం ప్రదర్శించేవాడు. సాటిమ

నిషిని కష్టపెట్టడానికి ఇష్టపడని అతను పిల్లల్ని, స్త్రీలని అమాయకులుగానే పరిగణించేవాడు. భార్య చేసిన మోసంవల్ల ఆడవారిని నమ్మడని ఈమధ్యనే తెలిసినా, స్త్రీలు ఎదురైనప్పుడు గౌరవంగా ప్రక్కకు తొలిగేవాడు. అటువంటి వ్యక్తితో సాహచర్యంవల్ల కోందులు చేసిన పెళ్ళిని తేలిగ్గా తీసుకోలేక పోతున్నాడు.

"ఇక్కడ కాసేపు ఆగుదాం..." సిద్ధయ్య అన్నాడు.

అందరూ అతను చూపించిన చెట్టు కిందకు వెళ్ళారు. మైదానంనుంచి వీస్తున్న చల్లటి గాలి చెమటతో తడిసిన శరీరాలకు తగులుతోంది. అక్కడక్కడా చెట్లతో కింద మోకాలి ఎత్తు గడ్డితో విశాలంగా వుంది మైదానం.

చెట్టు కింద కూర్చున్న తరువాత బ్యాగ్ నుండి స్టెన్‌గన్ తీసిచ్చాడు సుబ్బారెడ్డి. రాగి, ఇత్తడి లోహాలతో చేసిన బుల్లెట్స్ నింపిన మెగ్జిన్ కూడా అందించాడు.

"ఆ కొండదాటితే మనం ఆంధ్రాలోకి ప్రవేశించినట్టే. ఇప్పుడే మనం మరింత జాగ్రత్తగా అడుగులు వెయ్యాలి..." సుబ్బారెడ్డి చెప్పాడు.

తలో బ్రెడ్ ఇచ్చాడు సిద్ధయ్య.

బ్లాక్‌టీ తాగి అందరూ చెట్టుకింద విశ్రమించారు. చేతిగడియారం పన్నెండు దాటినట్టు చూపిస్తుంటే సూర్యుడు తలపైనుంచి పక్కకు జరిగాడు. సుబ్బారెడ్డి హెచ్చరికతో గంట తరువాత అక్కడనుంచి కదిలారు. ఒకరివెనుక ఒకరు నడుస్తూ మైదానం చివరనున్న కొండని సమీపించారు.

ధన్, ధన్... ధన్, ధన్.

పరిసరాలు మారుమోగుతూ వినిపించిన ఆ శబ్దానికి అదిరిపడి నేలపైన పడిపోతూ, తన ముందున్నవారిని కిందకు నెట్టి అరిచాడు ద్వివేది.

"అంతా కిందపడుకోండి..."

మిగిలినవారు అతను చెప్పినట్టు చేశారు.

ద్వివేది తలెత్తి శబ్దం వచ్చిన దిక్కు చూశాడు. అక్కడ పెద్దపెద్ద రాళ్ళు తప్ప మనుషులు లేరు. ఆ రాళ్ళ దగ్గరినుంచే కాల్పుల శబ్దం వెలువడిందని అక్కడ ఎవరైనా వున్నా తమకి కనిపించే అవకాశం లేదని గ్రహించాడు. నడుస్తున్న మనిషిని కాల్చిచంపడానికి అది అనువైనచోటు కాదు. ఆ ఆలోచన వచ్చిన మరుక్షణం పైకిలేచాడు.

"లేవకు..." ఆందోళనగా అన్నాడు సుబ్బారెడ్డి.

"పర్లేదు, మీరు కూడా లేవండి..." చెప్పి తాపీగా ఓ చెట్టువైపు కదిలాడు ద్వివేది.

సందేహిస్తూనే ఒక్కొక్కరు లేచి అతన్ని అనుసరించారు.

"అది గోర్కీచేసిన పనే..." సాలోచనగా అన్నాడు సుబ్బారెడ్డి. తూటాలు వెంటుక్రవాసి తేడాలో నేలకి తగలడంవల్ల కలిగిన ఆందోళన అతని మొహంలో ప్రతిఫలిస్తోంది.

"కావచ్చు.. మనని చంపడానికి కాల్పులు జరపలేదు" సిగరెట్ వెలిగించుకుని చెప్పాడు ద్వివేది.

అంతా తెల్లబోయారు.

కొండమీదున్న రాళ్ళు చూపించి అడిగాడు ద్వివేది.

"అక్కడనుంచి భూమికి ఎంత దూరముంటుంది? "

"సుమారుగా కిలోమీటరు వుండొచ్చు.." బసవప్ప చెప్పాడు.

"నేనడిగింది మనిషి నడిచి వచ్చేదూరం కాదు. తూటా ప్రయాణించే దూరం..."

ఎవరూ సమాధానం చెప్పలేదు.

"సుమారు ఎనిమిదివందల మీటర్లు వుంటుంది. అంతదూరంలోని టార్గెట్‌ని పడగొట్టే రైఫిల్ ఇంతవరకూ తయారుకాలేదు" తన మనసులోని ఆలోచన వెల్లడించాడు.

"తూటాలు నేలకి తగిలాయని మర్చి





పోకు..." సిద్ధయ్య అన్నాడు.

"మర్చిపోలేదు. ఎవరైనా అక్కడనుంచి బలంగా ఓ రాయి విసరగలిగితే అది కూడా నేలకి తగులుతుంది. భూమ్యాకర్షణ శక్తి వల్ల పైనుంచి కాలిస్తే తూటా నిర్ధారిత దూరంకంటే ఎక్కువ ప్రయాణం చేస్తుంది. ప్రతీ ఆయుధానికి కిల్లింగ్ రేంజ్, ఎఫెక్టివ్ రేంజ్ అనే రెండుదశలు వుంటాయి. మనని చంపదల్చుకుంటే కిల్లింగ్ రేంజ్‌లోకి వచ్చేవరకూ ఆగి ఫైర్ చేసేవారు. అంతే కాని చీమల్లా కనిపించే రేంజ్‌లో మనమీద తూటాలు కాల్చేవారు కాదు"

ఆ రీజన్ సమర్థిస్తున్నట్టు తలూపాడు బసవప్ప. రక్తంలోకి ప్రవేశించిన పాము విషంతోపాటు అకారణ ద్వేషం కూడా తొల గించాడు ద్వివేది.

"అయితే ఎందుకోసం కాల్పులు జరిపి నట్టు?" అడిగాడు సుబ్బారెడ్డి.

అది అంతుబట్టనట్టు తల అడ్డంగా వూపాడు ద్వివేది.

★ ★ ★

తెల్లవారుజామున మిటిం గ్రామంనుంచి బయలుదేరిన సూరికి, హార్గుణసాహోతా పురమాయించిన మనిషి దారి చూపిస్తు న్నాడు.

తెలతెలవారుతుండగా మంచుతో తడిసిన అడవి కొత్త అందాలు సంతరించుకుంది. చెట్లకొమ్మలు వంగి బొట్లుబొట్లుగా మంచుని రాలుస్తున్నాయి. ఆ చుక్కలు మీదపడి జలదరింపుకి గురవుతున్నట్టు మొక్కలు తలలు వూపుతున్నాయి. ఆ సమ యంలో ప్రకృతిని చూడడానికి రెండు కళ్ళూ సరిపోవడంలేదు.

ఆ కారడవిలో పులులు, ఎలుగుబంట్లు, విషసర్పాలు వున్నాయి. ఎప్పుడు ప్రాణానికి ముప్పు కలుగుతుందో తెలియదు. కొండ అంచున నడుస్తున్నప్పుడు పట్టు తప్పితే లోయలోకి జారిపోతారు. సన్నని బాటలో ఒకరివెనుక ఒకరు జాగ్రత్తగా అడుగులు వెయ్యాలి. చెట్లమధ్య నిలువెత్తు కోపిరి గడ్డి నడుమ ముందుమనిషి వెనుకవాడికి కని పించడు.

అగమ్యగోచరమైన ఆ కీకారణ్యంలో పుట్టి పెరిగిన కోందు చురుగ్గా వెళుతుంటే సూరి బృందం అనుసరించలేకపోతోంది.

మధ్యాహ్నానికి కొండపైకి చేరి కూర్చుండి పోయారు. ఆ కోందు తుప్పల్లోకి వెళ్ళి లావుపాటి చెట్టునొకదానిని పరిశీలించి తాటి ఆకుల్లా కనిపిస్తున్న మట్టలు నరి కాడు. ఉల్లిపాయ వలిచినట్టు మొదలు పై భాగాన్ని తొలగించాడు. చివరగా మొవ్వు తెగ్గొట్టి ముక్కలుచేసి తలొకటి ఇచ్చి తిన మని సైగచేశాడు. లేత కొబ్బరి ముక్కల్లా వుంది దాని రుచి.

"ఆంధ్రా సరిహద్దు ఇంకెంత దూర ముంది?" అడిగాడు సూరి.

"ఈ కొండ దిగి అవతలి కొండ దాటితే సవర, జాతాపులు నివసించే అడవి వస్తుంది. అదే ఆంధ్రా..."

కింద విశాలమైన మైదానం కనిపిస్తోంది. ఆ మైదానంలో కాలుపెట్టాలంటే కనీసం ఓ గంట పడుతుంది.

ధన్... ధన్... ధన్... ధన్...

ఆ శబ్దానికి అందరూ వులిక్కిపడ్డారు.

శక్తివంతమైన రైఫిల్ నుండి వచ్చిన శబ్దంగా గుర్తించి తనవారికి సైగచేసి వేగంగా కొండదిగడం ప్రారంభించాడు సూరి. ఎంత వేగంగా దిగినా అరగంట పైనే పట్టింది.

కనుచూపుమేర నరసంచారం లేదు.

రైఫిల్ పేలిన శబ్దం వచ్చిన దిశని అంచనా వెయ్యడానికి ప్రయత్నిస్తూ చుట్టూ పరిశీలనగా చూశాడు. చెట్టుకింద కాలి ఆరిన చితుకులు కనిపించాయి. నేలమీద గడ్డి నలిగి అంతకుముందు మనుషులు సంచరించినట్టు తెలియచేస్తోంది. అంటే ద్వివేది బృందం ఎక్కువ దూరంలో లేదన్న మాట. ఉత్సాహంగా తనవారివైపు చూశాడు

సూరి.

విపరీతమైన అలసటకి గురైనట్టు వారు నేలమీద కూలబడి కనిపించారు.

★ ★ ★

రైతు కుటుంబంలో జన్మించిన బసవప్ప పెద్దగా చదువుకోలేదు. ఎకరం భూమిపైన జీవించే కుటుంబం అతనిది. సంవత్సర మంతా కష్టపడితే కాని తిండిగింజలు ఇంటి కిరావు.

బసవప్ప అప్పుడప్పుడూ పొలానికి వెళ్ళినా వ్యవసాయ పనిమాత్రం అబ్బలేదు. తండ్రి పురమాయించిన పనులు మొక్కుబ డిగా చేస్తాడంతే. చద్దన్నం తిని ఇంట్లోంచి బయటపడి వూరుచివర చింతచెట్టు దగ్గరకు చేరుకునేవాడు. చిన్నప్పుడు బడికి పంప కుండా పశువులు కాయడానికి తోలితే అలా తయారయ్యేవాడు కాదని, కోపం వచ్చిన ప్పుడు తల్లిమీద అరిచేవాడు తండ్రి.

ఒకరోజు నిద్రపోతున్న బసవప్ప చెవు లకు తల్లి శోకాలు వినిపించి చప్పున లేచాడు. ఇంటిగుమ్మంలో రాటకి జారబడి నిస్త్రాణగా కూర్చుని ఒంటినిండా గాయా లతో కనిపించాడు తండ్రి. ఆ గాయాలు శుభ్రం చేస్తూ ఏడుస్తోంది తల్లి. కోపంలో కూడా హుందాగా ప్రవర్తించే తండ్రి మోములోని బాధ అతని అంతరంగాన్ని కల్లోలపరిచింది.

ఒక్క ఉదుటున తండ్రిని సమీపించి అడి గాడు,

"ఏమయింది? "

"ఏదైనా జరుగుద్ది... కడుపున పుట్టిన వాడు అసమర్థుడైతే"

"ఏం జరిగిందో చెప్పండి? "

తల్లి బలవంతంగా దుఃఖం ఆపుకుంది.

అనవసరమైన విషయాలలో జోక్యం చేసుకోని సాత్విక కుటుంబం వారిది. బస వప్ప పుట్టేనాటికి హారతికర్పూరంలా హరిం చుకుపోయిన భూమి ఎకరం మిగిలింది.

బసవప్ప తండ్రి అందరికీ అందుబాటులో వుండేవ్యక్తి. ఎవరు పిలిచినా వెళ్ళి సాయ పడే స్వభావం అతనిది.

ఆచరణలో వున్న పద్ధతి ప్రకారం తెల్లవా రుజామున ఒక గంటపాటు పొలానికి నీరు పెట్టుకోవాలి బసవప్ప తండ్రి. ఆరోజు కామందు పొలానికి గట్టువేసి తన పొలం గట్టు తెగ్గొట్టాడతను. అటుగా వచ్చిన కామందు తనని అడక్కుండా గట్టు వేసినం దుకు బూతులు తిట్టి కర్రతో కొట్టాడు.

ఆ వివరాలు తెలుసుకుని తోకతొక్కిన త్రాచులా పిచ్చెత్తిపోయాడు బసవప్ప. తల్లి పిలుస్తున్నా వినిపించుకోకుండా కామందు ఇంటికి వెళ్ళాడు.

అప్పుడే పొలంనుంచి వచ్చి కొబ్బరిచెట్టు నీడలో కూర్చుని చుట్ట కాల్చుకుంటున్నాడ తను.

"ఏరా! ఇటొచ్చావ్? " అడిగాడు బసవ ప్పని.

"ఏరా ఏంటి? నాకు నీ కూతుర్ని చేశావా? " ఎర్రటి కళ్ళతో తీక్షణంగా అడి గాడు.

కంగుతిన్నాడు కామందు. ఏరా అన్నా, మరోటి అన్నా నోరు మెదపరు గ్రామ స్తులు. ఇరవై సంవత్సరాలు దాటని బస వప్ప మాటలకు వుగ్రుడయ్యాడు.

"కళ్ళు నెత్తికెక్కాయా? " అని విసురుగా లేవబోయాడు.

బసవప్ప కాలెత్తి అతని గుండెలమీద తన్నాడు. కుర్చీతో సహా వెనక్కి పడిపో యాడు భారీకాయుడైన కామందు. కుర్చీ పక్కనున్న కర్ర అందుకుని నాలుగు దెబ్బ లువేసి పనివాళ్ళు రావడం గమనించి అక్క డనుంచి బయటపడ్డాడు. కామందు మను షులకు చిక్కకూడదని టౌన్‌కి వచ్చాడు. రైల్వేస్టేషన్‌లో కదలడానికి సిద్ధంగా వున్న ఓ రైలు ఎక్కి కూర్చున్నాడు.

లక్ష్యంలేని ప్రయాణం మొదలైంది.

ఆకలి ఎంత తీవ్రమైందో మొదటిసారి తెలిసివచ్చిందతనికి. తిండికోసం మనిషి





Anupama

పడే తాపత్రయంలోని ఔచిత్యం బోధపడింది. ఆకలి పసిగట్టి భోజనానికి పిలుచుకుపోయే తల్లి ప్రేమలోని గొప్పదనం అర్ధమవుతోంది. కొడుకుని మందలిస్తూ ఒక్క పరుషపదమైనా వుపయోగించని తండ్రి అనురాగం మనసు గుర్తుపట్టింది.

నీళ్ళు కడుపునింపవని తెలిసి కూడా మరోసారి నీరు త్రాగి నడవసాగాడు బసవప్ప. దారిపక్కన కళ్ళుతిరిగి పడిపోయిన అతన్ని ఒక యువకుడు తన రూమ్‌కి తీసుకెళ్ళాడు. బసవప్ప వివరాలు తెలుసుకుని అక్కడే వుండమని, ఏదోపని చూస్తానని చెప్పాడా యువకుడు.

అతను ఉదయం వెళ్ళి రాత్రి రూమ్‌కి తిరిగొచ్చేవాడు. అలిసిపోయినట్టు సమయం వృధా చెయ్యకుండా నిద్రపోయేవాడు. అతను ఏం చేస్తున్నాడో, ఎక్కడ తింటున్నాడో తెలిసేదికాదు. బసవప్ప ఖర్చులకు కొంత డబ్బిచ్చి ఓ గుడ్డసంచి తగిలించుకుని వెళ్ళేవాడు.

ఒకసారి బసవప్పని తనతో బస్‌స్టాండ్‌కి తీసుకెళ్ళాడతను. చుట్టూ పరిశీలనగా చూసిన అతని మొహం కళ తప్పింది. బసవప్పకి ఎడంగా కదులుతూ అన్నాడు,

"టాయిలెట్‌లోకి పద..."

అయోమయంగా చూశాడు బసవప్ప.

"దిక్కులు చూడకుండా నడు..." కటువుగా అన్నాడు.

బసవప్ప టాయిలెట్‌లోకి నడిచాడు.

ఓ నిమిషం తరువాత ఆ యువకుడు వచ్చి ఒక డైరీ అందించాడు.

"దానిని బొడ్లో దాచుకుని దూరంగా వెళ్ళిపో..." అని అక్కడికి దగ్గర్లోని నీలావతి అనే గ్రామం వెళ్ళి డైరీ ఎవరికి అందజెయ్యాలో చెప్పి టాయిలెట్‌లోకి దూరి తలుపు మూసుకున్నాడు. అది కొన్ని సెకన్ల వ్యవధిలో జరిగింది.

బసవప్ప బయటకొచ్చి ఖాళీగా కనిపించిన బెంచీమీద ఏమీ ఎరుగని వాడిలా కూర్చున్నాడు. బుర్రనిండా ప్రశ్నలు.

డైరీలో ఏముంది?

ఆ యువకుని మొహంలో చోటుచేసుకున్న ఆందోళనకి కారణమేమిటి?

ఇప్పుడేం జరుగుతుంది?

ఇంతలో ఆ యువకుడు టాయిలెట్ నుంచి వచ్చి అంతకుముందు నిలబడిన స్థానంలో బస్సుకోసం చూస్తున్నవాడిలా నిలుచున్నాడు. ఇద్దరు వ్యక్తులు ఆ యువకునికి చెరోపక్క సర్దుకున్నారు. చూస్తుండగానే వారు ముగ్గురూ అక్కడనుంచి కదిలి ఓ వ్యాన్ ఎక్కి వెళ్ళిపోయారు.

ఆ యువకుడు చెప్పినట్టు నీలావతి గ్రామం వెళ్ళాడు బసవప్ప. డైరీలో ఏముందో చూడాలనే కోరిక కలిగినా దానిని బయటకు తీసే ధైర్యం చెయ్యలేకపోయాడు. యువకుడు చెప్పిన పేరుగల వ్యక్తిని కలుసుకుని డైరీ అందించి జరిగిన విషయం చెప్పాడు. బసవప్పని తీసుకెళ్ళి జీడిమామిడి తోటలో కొందరు వ్యక్తులకు పరిచయం చేశాడతను. ఆయుధాలతో వున్న ఆ వ్యక్తులు బసవప్పని అభినందించారు.

ఆ డైరీలో తీవ్రవాద ఉద్యమానికి చెందిన అత్యంత కీలక సమాచారం వుందని బసవప్పకి తరువాత తెలిసింది.

అప్పుడే అతని జీవితం కొత్తమార్గం పట్టింది.

అనతికాలంలోనే విప్లవ సంఘంలో కార్యకర్తగా గుర్తింపు తెచ్చుకున్నాడు బసవప్ప. రెండు సంవత్సరాలు పనిచేసి ఓ మహిళా కార్యకర్తతో ప్రేమలో పడి పార్టీ సభ్యుల సమక్షంలో ఆమెను భార్యగా స్వీకరించాడు. మరో రెండు సంవత్సరాలు గడిచాయి.

ఒకసారి పనిమీద ఓ గ్రామం వెళ్ళొచ్చి, భార్య మరో సభ్యునితో సన్నిహితంగా వుండడం చూశాడు. పట్టలేని ఆవేశంతో ఆమెను అక్కడే కాల్చి చంపాడు. సెంట్రల్ కమిటీ సమావేశమై అతన్ని పార్టీనుంచి

బహిష్కరించింది.

అప్పుడే సిద్ధయ్య నిర్వహిస్తున్న గిరిజన చైతన్య సమితిలో చేరాడు. అప్పటికే సుబ్బారెడ్డి అక్కడ వున్నాడు

"లేచి మొహాలు కడుక్కోండి" సుబ్బారెడ్డి గొంతు వినిపించింది.

సెంట్రీగా వుండి ఆలోచనల్లో మునిగిపోయిన బసవప్ప బాహ్యప్రపంచంలో పడ్డాడు. కూర్చున్నచోటునుంచి లేచి గన్ ద్వివేది చేతికిచ్చాడు. రాత్రి గెడ్డ పక్క ఆగిన సుబ్బారెడ్డి బృందంలోని వ్యక్తులు తలోపక్క చెదిరిపోయారు.

ఒక చెట్టునుంచి పుల్ల విరిచి నోట్లో పెట్టుకున్నాడు ద్వివేది. అతనికి నాలుగడుగుల దూరంలో గెడ్డ ఒడ్డున కూర్చున్నాడు బసవప్ప.



గుహనుండి బయటకొచ్చాడు బెహరా.

ప్రకృతి నల్ల కంబళి కప్పుకున్నట్టు చీకటి దట్టంగా వుంది. కాటుకలాంటి ఆ చీకటిని విచ్ఛిన్నం చెయ్యడానికి తూర్పుదిక్కున ఆకాశం తెల్లబడుతోంది. ఆ మార్పు గుర్తించినట్టు రాత్రంతా అదేపనిగా అరిచిన కీచురాళ్ళు ఇప్పుడు ఆగి ఆగి అరుస్తున్నాయి. అగమ్య గోచర కీకారణ్యంలో వెలుగు వెదజల్లడానికి ప్రయత్నించిన మిణుగురులు క్రమంగా అదృశ్యమవుతున్నాయి. చీకటితో స్నేహం చేసిన చలిగాలి ఓటమి అంగీకరించని సైనికునిలా ఇంకా వీస్తూనే వుంది.

మధ్యాహ్నం కొండదిగువకొచ్చినవారిపై కాల్పులు జరిపి గుహకు తిరిగొచ్చి బాటని జాగ్రత్తగా గమనించారు. చీకటిపడిన తరువాత ఓ టార్చి బాట వెంట రావడం కనిపించింది. వెలిగి ఆరుతున్న టార్చిని అనుసరించి వారెక్కడ ఆగిందీ చూసి వెనక్కి వచ్చారు. ఆ రోజు పని పూర్తవుతుందనే వుత్సాహంతో తెల్లవారుజామున నిద్రలేచాడు బెహరా.

తూర్పున ప్రారంభమైన వెలుగు ఆకాశాన్ని ఆక్రమిస్తోంది.

బెహరా గుహలోకి వెళ్ళి స్నేహితుడ్ని లేపాడు. సరిగ్గా అప్పుడే సెల్ మ్రోగింది.

"బెహరా! రెడీనా?"

"రెడీనే..." చెప్పాడు.

"వాళ్ళు గెడ్డపక్కన ఆగారు"

"తెలుసు"

"కొండవెనుక నీళ్ళమడుగు చూసేవుంటావు. దానికి ఎడమవైపు చిన్న కాలిదారి వుంది. ఆ దారిలో వెళితే పెద్ద బూరుగు వృక్షం చేరుకుంటారు. అక్కడనుంచి చూస్తే గెడ్డ ఒడ్డున టార్గెట్ కనిపిస్తుంది"

బెహరాకి ఆశ్చర్యం కలిగింది. ఎక్కడో వున్నవాడికి ఇదంతా ఎలా తెలిసింది? అదే అడిగాడు సెల్‌లో మాట్లాడుతున్న వ్యక్తిని.

"అనవసరమైన ప్రశ్నలతో సమయం వృధా చెయ్యకు. నువ్వు చంపబోతున్న వ్యక్తులు సామాన్యులుకారు"

కాల్ కట్ అయింది.

సెల్ పాకెట్‌లో పెట్టుకుని కొన్నిక్షణాలు ఆలోచిస్తూ వుండిపోయాడు బెహరా. వృత్తిపరంగా ఎన్నో హత్యలు చేశాడు. కానీ ఇది వాటన్నిటికంటే భిన్నమైంది. పని అప్పగించిన వ్యక్తి గురించి కానీ చంపబోతున్న





వారి గురించి కానీ ఏమీ తెలియదు. వీలై నంత తొందరగా పని ముగించుకుని వెళ్ళి పోవడం మంచిదనే ఆలోచన వచ్చింది.

కొండ దిగి మడుగుకి ఎడంపక్క అస్ప ష్టంగా కనిపిస్తున్న బాటలో ప్రవేశించారు. మంచుతో తడిసిన గడ్డిపైన అడుగులు వేస్తూ బూరుగు వృక్షం చేరుకున్నారు. గెడ్డ వద్ద ఇద్దరు మనుషులు వున్నారు. బెహరా సైగ అందుకుని వెనక్కి తిరిగి నిలుచు న్నాడు స్నేహితుడు. వెనుకనుంచి ఎవరూ రాకుండా తీసుకున్న జాగ్రత్త అది.

బెహరా టార్గెట్‌ని గురిచూసి ట్రిగ్గర్ నొక్కాడు.

ధన్...

"అమ్మా..." అరుస్తూ టార్గెట్ వెనక్కి విరుచుకుపడిపోయింది. మరుక్షణం రెండో వ్యక్తి గన్ పేలుస్తూ టార్గెట్‌ని భుజంపైన వేసుకుని మెరుపులా చెట్లమధ్యకి పరిగె త్తాడు.

వందగజాల దూరంలోని మనిషికి తూటా తగిలితే అది వెన్నునుంచి దూసుకు పోతుంది. ఒకవేళ తూటా ఎముకల్లో చిక్కుకున్నా బతికే అవకాశం వుండదు. ఆ విషయం తెలుసు కనుకనే ఆ ప్రదేశం వదిలి వేగంగా వెనక్కి వచ్చేశాడు బెహరా.

కొండ సమీపించి తమనెవరూ అనుసరిం చడం లేదని నిర్ధారించుకుని సిగరెట్ ముట్టించాడు. జేబులోంచి కవరు తీసి ఒక ఫొటోని రెండుముక్కలు చేసి పడేశాడు. ఇద్దరూ కొండెక్కి అనువైన ప్రదేశం చూసు కుని కూర్చున్నారు.

బెహరాపక్కన కూర్చున్న స్నేహితుడు తుప్పల్ని తాకుతున్న తన పాదాల్ని చప్పున వెనక్కి లాక్కున్నాడు.

"నీకు పాములంటే భయమా?" అడి గాడు బెహరా.

"నాకు సర్పగండముంది" చెప్పాడతను.

"కాళ్ళకి బూట్లున్నప్పుడు భయం దేనికి?"

"చిన్నప్పుడు నన్ను పడుకోబెట్టిన చాపమీ దకి పాము వచ్చిందట. తలుపులన్నీ వేసుంటే లోపలికి పాము ఎలా వచ్చిందో ఎవరికీ అంతుబట్టలేదట. సర్పగండ మున్నవాళ్ళు పాముకాటుతో మరణిస్తారని పెద్దలు చెప్పారట"

బెహరా మాట్లాడలేదు.

చిన్నప్పటినుంచి సర్పంవల్ల మరణిస్తాననే నమ్మకంతో పెరిగిన వాడికి మాటలు చెప్పి భయం పోగొట్టడం అసాధ్యం. ఆలోచిస్తూ తలతిప్పి చప్పున కిందకు వంగాడు బెహరా. కింద చెట్లమధ్య కొన్ని ఆకారాలు కదులుతున్నాయి. బైనాక్యులర్ తీసి చూసే సరికి అవి చెట్ల వెనుక అదృశ్యమయ్యాయి.

నొసలు ముడివేసి పైకివచ్చిన మార్గం వైపు చూసి ఉలిక్కిపడ్డాడు. ఒక వ్యక్తి నేలని పరీక్షిస్తూ కొండవరకూ వచ్చి మెరు పులా రాయి వెనక్కి దూకడం కనిపిం చింది.

బైనాక్యులర్‌తో ఆ వ్యక్తిని చూసిన మరు క్షణం చిరునవ్వు ఒకటి పెదవులపైన ప్రత్య క్షమయ్యింది.

★ ★ ★

గెడ్డవెంట కొంతదూరం నడిచి ఒకచోట ఆగి మొహం కడుక్కున్నాడు సిద్ధయ్య. బట్టలు విడిచి డ్రాయరుతో నీటిలోకి దిగాడు. చల్లటి నీరు తగిలి నరాలు జివ్వు మన్నాయి.

అతనికి చిన్నతనంనుంచి అటువంటి నీటిలో స్నానం చేసే అలవాటుంది. పది సంవత్సరాల జైలు జీవితం ఆ అలవాటుకి ఫుల్‌స్టాప్ పెట్టింది. చిన్నగా నవ్వుకుని నీటిలో మునిగితేలాడు. కుర్రాళ్ళతో ఏటికి పోయి గంటల తరబడి ఈతకొట్టిన బాల్యం గుర్తొచ్చింది.

పదహారు నిండకముందే పన్నెండు సంవ త్సరాల పిల్లతో పెళ్ళిచేశారు తల్లిదండ్రులు. అప్పట్లో బాల్య వివాహాలు అధికం కాబట్టి చెట్లకింద పిల్లలతో ఆడుకునే సిద్ధయ్య ఓ పిల్లకి మొగుడయ్యాడు. ఓసారి పట్నంలో



కన్యాశుల్కం నాటకం చూశాడు.

అప్పటినుంచి రకరకాల ఆలోచనలు మనసుని అతలాకుతలం చేశాయి. సందేహాల నివృత్తికి గ్రంధాలయం సహకరించింది. ఆచారాలను తరిచి చూసే స్వభావం అలవర్చుకున్నాడు. ప్రజల్లోని మూఢాచారాలు తొలగించడం అంత తేలిక కాదని, సమాజం సమూలంగా మారినప్పుడే అది సాధ్యమని భావించాడు.

కళాశాలలో చదువుతున్నప్పుడు ఓ విద్యార్థి సంఘం నాయకునితో పరిచయం ఏర్పడింది. అప్పుడే కమ్యూనిజం గురించి చదవడం ప్రారంభించాడు. క్రమంగా అతని ఆలోచనా విధానంలో మార్పు వచ్చింది. భావవ్యక్తీకరణ, తెలుసుకున్న విషయాలు అందరికీ వివరించి చెప్పే సామర్థ్యం అతన్ని పార్టీకి సన్నిహితం చేశాయి. ఉప్పెనలా విరుచుకుపడిన తీవ్రవాదంవైపు మొగ్గి అడవి మార్గం ఎంచుకున్నాడు.

కొంతకాలం పనిచేసి విభేదాల వల్ల పార్టీని వదిలి గిరిజన చైతన్య సమితిని ప్రారంభించాడు. గిరిజనులతో కలిసిపోయి వారి సమస్యలు పరిష్కరించేవాడు. సిద్ధయ్యకి తరచుగా ఓ సమస్య ఎదురయ్యేది. దోపిడీకి అలవాటు పడిన వ్యాపారులు అతని మాట లెక్కచేసేవారుకాదు. రామసుబ్బారెడ్డి సహాయంతో గోర్కీ ఆధ్వర్యంలో ఒక దళాన్ని ఏర్పాటుచేశాడు.

ధన్

ధన్, ధన్, ధన్

ఆ శబ్దాలకు ప్రవాహంలా సాగిపోతున్న ఆలోచనలకు ఆనకట్టపడింది. కంగారుగా నీటినుంచి బయటకొచ్చి ఓ రాయి వెనుక కూర్చుని చెవులు రిక్కించాడు. గెడ్డ దిగువ నుంచి వచ్చిన ఆ కాల్పుల శబ్దం తిరిగి వినిపించలేదు.

ఏమయిందక్కడ?

రెండు నిముషాల తర్వాత లేచి బట్టలు అందుకుని నాలుగడుగుల దూరంలోని చెట్టు వెనక్కి చేరాడు. అడవిలోని సమస్త ప్రాణి కూడబలుక్కుని మౌనం వహించినట్టు ఎలాంటి చప్పుడు వినిపించడంలేదు. బట్టలు వేసుకుని ఒక్కొక్క చెట్టు దాటుకుంటూ వెళ్ళసాగాడు.

కుడివైపు ఏదో కదిలిన అలికిడికి గుండె ఆగినట్టయింది. అలాగే కొన్ని క్షణాలు కదలకుండా వుండిపోయాడు. అతని వూపిరి అతనికే బరువుగా వినిపిస్తోంది.

ఒక ఆకారం తుప్పలమధ్య నుంచి బయటకొచ్చింది. సామాన్లు తెచ్చిన మనిషి. నిశ్శబ్దంగా వుండమని అతనికి సైగచేసి బసచేసిన చోటుకి చేరుకున్నాడు సిద్ధయ్య.

సుబ్బారెడ్డి, ద్వివేది చెట్లమధ్య కనిపించారు. వారిముందు బసవప్ప నిర్జీవదేహం పడుంది.

"తూటా గుండెల్లో తగిలింది. .." చెప్పాడు ద్వివేది.

ఎడమ పక్క గుండెల్లో తూటాచేసిన గాయం కప్పుకోవడంవల్ల ప్రాణాలు పోయినా చెయ్యి అక్కడేవుంది. రక్తాన్ని పీల్చుకుని తెల్లచొక్కా అరుణవర్ణం దాల్చింది. ప్రాణాలు వదిలేముందు అనుభవించిన బాధ ముఖమంతా పరుచుకుంది.

సిద్ధయ్య కనులు అశ్రువులతో నిండిపోయాయి.

అందరూ గ్రామాలు తిరుగుతుంటే అతను గిరిజన చైతన్య సమితి కార్యాలయంలో వుండి వంటలు చేయించి పంపేవాడు. దళానికి అవసరమైన వస్తువులు సమకూర్చడం, ఎప్పటికప్పుడు సమాచారం అందచెయ్యడం వంటి బాధ్యతలు నెరవేర్చేవాడు. బసవప్ప ఆచూకీ చెప్పమని తల్లిదండ్రుల్ని వేధిస్తున్న కామందు, అతను విప్లవకారుడుగా మారాడని తెలిసి వారి జోలికి వెళ్ళడం మానుకున్నాడట. అది చెప్పి కళ్ళల్లో నీరు చిప్పిల్లేవరకూ పడిపడి నవ్వేవాడు.

అతనికి బంధువులు గుర్తొచ్చేవారో లేదో




తెలియదుకాని ఎన్నడూ వారి ప్రస్తావన తెచ్చేవాడుకాదు. ఒంటరిగా వున్నప్పుడు మాత్రం అతని కళ్ళు చెమర్చేవి. బసవప్ప మాటల్లో ఆప్యాయత తొంగి చూస్తే తల్లి గుర్తొచ్చిందని, ఎవరినైనా మెత్తగా మంద లిస్తే తండ్రి మనసులో మెదిలాడని, అర్ధ రాత్రి మగోమనిషితో కబుర్లు చెబుతుంటే భార్య జ్ఞాపకమొచ్చిందని అర్థం. అంతకు మించి తనవారి గురించి ప్రస్తావించని విలువైన కార్యకర్త అతను.

బసవప్ప బుగ్గల్ని ప్రేమగా స్పృశించాడు సిద్ధయ్య. ఆకాశంలో ఉదయించిన భానుడు ఎరుపైతే అంతకంటే ఎర్రగా వుంది సిద్ధయ్య ముఖం.

వారిని అక్కడే వదిలి రైఫిల్ పేలిన దిక్కు నడిచాడు ద్వివేది. బసవప్పని తీసు కుని పరిగెడుతూ కొమ్మలు కదిలిన శబ్దం విన్నాడు. అంటే ఫైర్ చేసిన మరుక్షణం శత్రువు అక్కడ నుంచి వెళ్ళిపోయి వుండాలి. ఆలోచనలు కదులుతుంటే బూరుగు వృక్షం సమీపించి నేలని పరీక్షిం చాడు.

గడ్డపైన పరుచుకున్న మంచు చెదిరి అడుగులు స్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటిని అనుసరించి కొంతదూరం నడచి ఆగిపోయాడు. జాడలు అదృశ్యమయ్యా యంటే శత్రువు అక్కడే పొంచి వుండాలి. అలా అనుకున్న మరుక్షణం రాయి వెనక్కి దూకాడు.

పరిసరాలని పట్టి పట్టి చూసి, ఒక పొద దాటి శత్రువు కొండపైకి వెళ్ళినట్టు గ్రహించి తలెత్తాడు. సూదిగా కనిపించింది కొండ. పొంచివున్న శత్రువుని వెదకడంలో చాలా ఇబ్బందులు వున్నాయని తట్టి వెనక్కి తిర గబోయాడు. పొదవద్ద పడివున్న కాగితం ముక్కలమీద దృష్టిపడింది. వాటిని తీసి

# ఏరిన ముత్యాలు

★ ఈనాడు చేయగలిగింది ఇప్పుడే చేస్తే రేపు ఇంతకంటే బాగా చేయవచ్చు

-గురునానక్

★ ప్రసంగం ప్రేమగాధ వంటిది. ఎవరైనా ప్రారంభించవచ్చు. సమాప్తి చేయడమే నైపుణ్యం.

-రాజాజీ

★ ఉత్తమ తరగతికి చెందిన హాస్యం సమాజంలో సభ్యుడికి ఉత్తమ ఆభరణం

-శామ్‌లెవెన్‌సన్

★ ఇంకొకరు నవ్వటానికి ముందు మొదట నిన్ను చూసి నీవు నవ్వుకో.

-రిచర్డ్‌నే

★ హితమును, ప్రియమును అగు వాక్కు దుర్లభం

-కిరాతార్జునీయం

★ సుఖసౌరభాన్ని నీమీద జల్లుకుంటేగానీ ఇతరులపై చిలికించలేవు

-సి.జి.జంగ్

★ ఒకనాటిమాట మరొకనాటికి బాట అవుతుంది.

-రాధాకృష్ణ

★ మేధావులు తాము నిర్ణయించుకున్న కార్యాన్ని వదిలిపెట్టరు.

-అబ్రహాంలింకన్

★ ఆదాయ, వ్యయాలు తెలియని వారికి ఉన్నదంతా నాశనమవుతుంది.

-జి.ఇంగెర్‌సాల్

★ నిరాశచెందకుండా పరాజయాన్ని భరించడం, ధైర్యానికి సునిశితమైన పరీక్ష

-బెర్నార్డ్‌షా

★ జీవితాన్ని పూర్తిగా సద్వినియోగం చేసుకునే నైపుణ్యం పొదుపు. పొదుపు శీలానికి మూలం.

-సి. దిలీప్ బెనర్జీ

★ వివేకి మనసుకు కళ్ళెం వేయగలడు. మూర్ఖుడు మనసుకు బానిస అవుతాడు

-పుబ్‌లియస్

★ తన పనిని సాధించడానికి ఇతరుల మేధను ఉపయోగించుకునే వాడే మేధావి

-డోన్‌పియట్

★ స్థిరచిత్తుడు విధిని, చపల చిత్తుడు అవకాశాన్ని నమ్ముతాడు.

- సెనెకా

★ ఒకే విషయాన్ని ఇతరులు చూసినట్లే చూసి, కొంత భిన్నంగా ఆలోచించటంలోనే పరిశోధన ఆధారపడి ఉంది.

-బెంజిమెన్ డిజ్రేలి

సేకరణ: పి.వి.రమణకుమార్

ఒక ఫొటోకి చెందినదిగా గుర్తించి రెండి టిని దగ్గరకు చేర్చాడు.

బసవప్ప రూపం ప్రత్యక్షమయింది.

చంపాల్సిన మనిషి ఫొటో తీసుకుని శత్రువు వచ్చాడా? ఫొటో తెచ్చి బసవప్పని చంపడానికి గోర్కీకి అతను అపరిచితుడేం కాదు. అంటే గోర్కీ పురమాయించిన మనిషి ఈ హత్య చేసివుండాలి. ఫొటో మీదున్న నెంబరు గమనించి నొసలు ముడి వేశాడు. మరికొంత మందిని చంపబోతు న్నారని దాని అర్థమా?

ఆ ముక్కలు జేబులో వేసుకుని కలవర పరుస్తున్న ఆలోచనలతో వెనక్కి వచ్చాడు ద్వివేది.

★ ★ ★

ఆ రాత్రి కొండమీద వుండిపోయింది సూరి బృందం.

ఎలాగైనా ద్వివేదిని కలుసుకోవాలనే పట్టుదలతో ఆగకుండా ప్రయాణించి అక్క డివరకూ వచ్చారు. సూర్యుడు అస్తమించిన కొన్ని నిముషాలకు చీకటి అలుముకోవ డంతో మార్గం అగుపించదని ఆగిపో యారు. చీకట్లో అసంఖ్యాకంగా మిణుగు రులు ఎగురుతుంటే సూరి బుర్రలో లెక్కలే నన్ని సందేహాలు విహరిస్తున్నాయి.

దివుడు సాహోతా, హోర్గుణ సాహోతాల ద్వారా సేకరించిన వివరాల ప్రకారం- ద్వివే దిని తీసుకెళుతున్న వ్యక్తులు ఒకప్పుడు తీవ్రవాద ఉద్యమంలో పనిచేసినవారు. ఎప్పుడో అడవిలో దాచిన డబ్బు తీసుకుని వస్తారు. సరియైన సమయంలో వారిని అరెస్ట్ చెయ్యాలి. ఈలోపు ద్వివేదిని కలిసి మరిన్ని వివరాలు తెలుసుకోవాలి.

ఆలోచిస్తూ చీకట్లోకి చూస్తున్న సూరి కళ్ళకి కాంతిరేఖ ఒకటి కనిపించింది. వెంటనే కోందుని పిలిచి చూపించాడు. ఆ కాంతి అరగంట తరువాత కనిపించడం మానేసింది.

ఎండుపుల్లలు ఏరుకొచ్చి ముట్టించాడు కోందు. చలి అధికంగా వుండటం వల్ల అందరూ మంట చుట్టూ కూర్చున్నారు. దారిలో సేకరించిన కొండరేగిపళ్ళు తలో కాసిన్ని తిన్నారు. దూరంనుంచి ఏదో జంతువు అరుపు ఆగిఆగి వినిపిస్తోంది.

ఎప్పుడు నిద్ర ముంచుకొచ్చిందో తెలి యదు సూరికి. హఠాత్తుగా మెలకువ వచ్చి కళ్ళు తెరిచాడు. అప్పటికి చితుకుల మంట ఆరిపోయింది. తూర్పుదిక్కున ఆకాశం తెల్ల బడుతూ కనిపించింది.

లేచి ఒళ్ళు విరుచుకుని చుట్టూ చూశాడు.

వెలుగు రేఖలు అడవిపైన పల్చటి తెరలా పరుచుకున్నాయి. చలిగాలి శరీ రాన్ని వణికిస్తూనే వుంది. అయినా కొండ పైనుంచి అడవిని చూసి మైమరచిపో యాడు. క్రమంగా వెలుగు నలువైపులా సర్దుకుంటోంది.

అందర్నీ లేపి కొండ దిగేసరికి తెల్లవా రింది. రాత్రి చూసిన కాంతి వెళ్ళిన దిక్కు వారిని తీసుకుపోయాడు కోందు. సూదిగా కనిపిస్తున్న కొండ అంచున నడిచి ముందు కెళ్ళారు. మనుషుల సవ్వడి విని తనవెంట వున్నవారిని అక్కడే వుండమని చెప్పి నిశ్శ బ్దంగా అటు నడిచాడు సూరి.

చెట్టుచాటున ఆగిపోయాడు. గెడ్డ ఒడ్డున ఇద్దరు మనుషులున్నారు. ఇద్దరిలో ద్వివే దిని గుర్తుపట్టాడు.

అప్పుడే గెడ్డ అవతల చెట్టు పక్కనుంచి రైఫిల్ పేలింది. తూటా తగిలిన వ్యక్తిని అమాంతంగా ఎత్తుకుని చెట్లమధ్యకు తీసు కొచ్చి పడుకోబెట్టాడు ద్వివేది. ఆ మనిషి కాసేపు బాధతో కొట్టుకుని ప్రాణాలు వది లాడు.

అదేసమయంలో సుబ్బారెడ్డి వచ్చాడు. పది నిముషాల వ్యవధిలో సిద్ధయ్య, పని వాళ్ళు అక్కడకు చేరుకున్నారు.

"పుల్లలు పోగుచెయ్యండి..." పనివారికి చెప్పాడు సుబ్బారెడ్డి.

అతని మనసులోని ఆలోచన గ్రహించి

వాళ్ళు ఆశ్చర్యపోయారు.

సిద్ధయ్య ఓ చెట్టుని ఆనుకుని కూర్చున్నాడు. బసవప్ప మరణం కలిగించిన షాక్ నుండి అతనింకా తేరుకోలేదు. శత్రువు జాడకోసం వెళ్ళి తిరిగొచ్చాడు ద్వివేది.

పనివాళ్ళు పుల్లలు ఒకచోట కుప్పగా పోశారు. వాటిని నేలమీద పేర్చి బసవప్ప శరీరాన్ని పుల్లలపైకి చేర్చారు. మిగిలిన వాటితో శరీరం కప్పి అంటించాడు సుబ్బారెడ్డి. ఎండి ఎప్పటినుంచో ఆ అడవిలో పడున్న ఆ కట్టెలు ముట్టుకున్నాయి.

అంతా దూరంగా జరిగారు.

మంట ఉధృతమై కట్టె దహనమవుతోంది. పదిహేను సంవత్సరాలు కలిసి తిరిగిన మనిషి దూరతీరాలకు సాగిపోయాడు. అతని మరణ వార్త వృద్ధులైన తల్లిదండ్రులకు ఎప్పటికీ తెలియదు. బతికినంత కాలం ఏదో రోజు కొడుకు తమకోసం వస్తాడని చూస్తూనే వుంటారు. బసవప్పకి సిద్ధాంతాలు తెలియవు. తనకి ఆశ్రయం ఇచ్చిన వారిపట్ల చివరివరకూ విశ్వాసంతో పనిచెయ్యడం మాత్రమే తెలుసు.

అతను లేకపోయినా జ్ఞాపకాలున్నాయి.

కళ్ళు తుడుచుకున్నాడు సిద్ధయ్య.

★ ★ ★

గెడ్డ పక్కన శవాన్ని దహనం చేస్తున్నారని ఆకాశంలోకి లేచిన పొగచూసి కొండపైనుంచి వాచ్ చేస్తున్న బెహరా గ్రహించి ఆశ్చర్యపోయాడు.

ఓ మనిషి చచ్చిపోతే స్వల్ప వ్యవధిలో తేరుకుని అలాంటి నిర్ణయం తీసుకోవడం చిన్న విషయం ఏమీకాదు.

పొగ రావడం తగ్గిన తరువాత స్నేహితునితోసహా గెడ్డ వద్దకు వెళ్ళాడు బెహరా. అప్పటికే సుబ్బారెడ్డి బృందం ఆ ప్రదేశం వదిలిపెట్టింది. చెట్లమధ్య ఆరడుగుల పొడవు, మూడడుగుల వెడల్పు జాగాలో నిప్పుతోపాటు బూడిద వుంది. రెండుగంటల క్రితం ప్రాణాలతో వున్న మనిషి బూడిదే అది అనుకునేసరికి అంతటి ప్రొఫెషనల్ కిల్లర్‌కి కూడా శరీరం జలదరించింది.

హత్య జరిగితే సహజంగానే కొంత హడావిడి చోటుచేసుకుంటుంది. దినపత్రికలు హత్య గురించి వివరంగా రాస్తాయి. పోలీసులు రంగప్రవేశం చేస్తారు. పోస్టుమార్టమ్ చెయ్యడం, అనుమానితుల్ని ప్రశ్నించడం వంటి తతంగాలు జరుగుతాయి.

ఇక్కడ అవేమీ లేవు.

పని అప్పగించిన మనిషి చెప్పినట్టు అక్కడ హత్య చెయ్యడం చాలా తేలిక. ఎంతమందిని హతమార్చినా బయట ప్రపంచానికి తెలియదు. అలా అనుకునేసరికి వుత్సాహం కలిగిందతనికి.

అక్కడనుంచి కదిలి సుబ్బారెడ్డి బృందాన్ని ఎడమవైపు చెట్లుచాటు చేసుకుని అనుసరించసాగాడు.

సూరి తన మనుషులతో కుడివైపు చెట్ల మధ్య నడుస్తూ ఆ బృందాన్ని దృష్టిపథం నుండి దాటిపోకుండా చూస్తున్నాడు.

అడవితల్లి అక్కడ జరుగుతున్న దానిని నిశ్శబ్దంగా గమనిస్తోంది.

★ ★ ★

దారికి ఎడమవైపు పట్టిపట్టి చూస్తూ నడుస్తున్నాడు సిద్ధయ్య.

అతని ఏకాగ్రత చెడగొట్టకుండా నిశ్శబ్దంగా అడుగులు వేస్తున్నారు మిగతావాళ్లు.

సుబ్బారెడ్డిని చూసి అన్నాడు సిద్ధయ్య.

"ఆరోజు నడవలేక నువ్వు ఇక్కడే కూర్చుండిపోయావు. ఆలస్యం చేస్తే మరింతగా చీకటి అవుతుందని ఎదురుగావున్న బాటవెంట వెళ్ళాను"

గుర్తులేనట్టు తల ఆడించాడు సుబ్బారెడ్డి.

ముందుకి వెళ్ళి తిరిగి వెనక్కి వచ్చాడు సిద్ధయ్య. ఆ ప్రాంతంలో ఎలాంటి బాట కనిపించలేదు. అతను మరింత ముందు కెళ్ళి వచ్చి చెప్పాడు.





"బాటలేదు"

అడవుల్లో తాత్కాలికంగా ఏర్పడే బాటలు కాలక్రమేణా అదృశ్యమవుతాయి. గిరిజనులు వర్షాకాలంలో ఎత్తైన ప్రదేశాల్లో గుడిసెలు వేసుకుని నివసిస్తారు. అప్పుడు అక్కడ బాట తయారై, ఆ కుటుంబం వెళ్ళిపోయిన తరువాత మూసుకుపోతుంది. అలాంటి బాట ఎన్నుకుని డబ్బు దాచివుండాలి.

ఇప్పుడెలా?

కర్ర ఒకటి తీసుకుని తుప్పల్ని అటూ ఇటూ కదుపుతూ వెళ్ళాడు. ఒకచోట తుప్పల మధ్య గడ్డి మొలిచి బాట అస్పష్టంగా కనిపించింది. ఉత్సాహంగా పనివాళ్ళని పిలిచి ఏంచెయ్యాలో చెప్పాడు.

"నువ్వు అటు వెళ్ళు, నేను ఇటు కవర్ చేస్తాను" ద్వివేదితో చెప్పి రివాల్వర్ తీసి బుల్లెట్స్ నింపాడు సుబ్బారెడ్డి.

అతను చెప్పినవైపు నడిచి ఓ చెట్టుకి ఆనుకుని సిగరెట్ వెలిగించాడు ద్వివేది. పనివాళ్ళు మొక్కల్ని నరకడం వినిపిస్తోంది. ద్వివేది ఆలోచనలు బసవప్ప ఫొటో చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. దానిపైన వున్న నెంబరులో ఏదో రహస్యం ఇమిడి వుంది. అది కనుక్కోవడానికి మెదడు తీవ్రంగా ప్రయత్నిస్తోంది.

హటాత్తుగా ఆలోచనలు తెగిపోయాయి.

అతను నిలుచున్న చెట్టు వెనుక పొదల్లో ఎవరో అతి నెమ్మదిగా కదిలేరు. అటువంటి పనిలో అనుభవమున్నట్టు అడుగులు మెత్తగా పడుతున్నాయి. శత్రువు పొంచివున్నాడనే ఆలోచనవల్ల మనసు ఆందోళనతో నిండిపోయింది.

సిగరెట్ పడేసి బూటుతో నలపబోయి చివరిక్షణంలో ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. సరిగ్గా వెనుకనే మాటు వేశారంటే ఈపాటికే సిగరెట్ వాసన గుర్తించి వుంటారు. తన కదలికలకోసం ఎదురు చూస్తూ వుండాలి చెట్టు వదిలి పక్కకు వెళితే కాలుస్తారు. ఆలోచిస్తూ తలెత్తి చూశాడు.

చెట్టు కొమ్మ ఒకటి చెయ్యెత్తున వుంది. గన్ భుజానికి తగిలించుకుని కొమ్మ అందుకుని ఆకులు కూడా కదలకుండా నిశ్శబ్దంగా పైకి చేరుకున్నాడు. తుప్పల వెనుక ఓ ఆకారం కూర్చుని కనిపించింది. శబ్దం రాకుండా అవతలి కొమ్మపైకి వెళ్ళి సరిగ్గా ఆకారం వెనుక నేలమీద వాలాడు.

ప్రమాదం గుర్తించి అవతలికి దూకబోయిన ఆకారం, గన్ వీపుకి తగలడంతో నిలబడిపోయింది.

"నువ్వా? " ఆకారాన్ని గుర్తుపట్టి అన్నాడు ద్వివేది.

చిన్నగా నవ్వింది పుబులి.

"ఎందుకొచ్చావ్? " విసుగ్గా అడిగాడు.

"అయ్య వచ్చాడు..." చెప్పింది.

పక్కపొదనుంచి నవ్వులు చిందిస్తూ లేచాడు హార్గుణసాహోతా. అతనితోపాటు ఆరడుగుల ఈటె కూడా లేచింది.

"బిడ్డా! చిరుతలా చురుకైనవాడివే. ." మెచ్చుకోలుగా అన్నాడు.

ద్వివేది అటు రావడం గమనించి చెట్ల మధ్య నడిచి వాళ్ళిద్దరూ అక్కడకొచ్చారు. సిగరెట్ కాలుస్తూ చెట్టు అవతల నిలుచున్నాడనుకుంటే పైనుంచి దూకాడు. శత్రువుకి తన కదలికలు తెలియకుండా సంచరించే నైపుణ్యం ఒక్క చిరుతకు మాత్రమే వుంది. అటువంటి సామర్థ్యం ద్వివేది వద్ద చూసి మెచ్చుకోకుండా వుండలేకపోయాడు జంతువుల గురించి క్షుణ్ణంగా తెలిసిన అరవై సంవత్సరాల హార్గుణ సాహోతా.

ఆ సమయంలో వాళ్ళు రావడం రుచించకపోయినా, మెరుపులాంటి ఆలోచన ఒకటి బుర్రలో కదిలి తల పంకించాడు ద్వివేది.

★ ★ ★

సుబ్బారెడ్డి బృందం నిలిచిపోవడం చూసి పక్కనే వున్న దిబ్బపైకి చేరాడు బెహరా. అక్కడనుంచి మనుషులు కనిపిస్తున్నా

మాటలు వినిపించడంలేదు. వాళ్ళల్లో తను చంపాల్సిన మనుషుల్ని గుర్తుపట్టి రైఫిల్ మౌంట్ చేసి స్నేహితునికి సైగచేశాడు.

వారు దేనిగురించో గాలించడం కనిపించింది. ఇద్దరు వ్యక్తులు తుప్పలు నరకడం ప్రారంభించారు. వాళ్ళక్కడ ఏం చెయ్యబోతున్నారో అర్థంకాలేదతనికి, గన్ పట్టుకున్న వ్యక్తి అవతల పక్కకు వెళ్ళి చెట్ల వెనుక అదృశ్యమయ్యాడు. మరోవ్యక్తి రివాల్వర్‌తో ఇవతలిపక్క అప్రమత్తంగా వున్నాడు.

ప్రమాదం వస్తుందని వూహించి దానిని ఎదుర్కోవడానికి వాళ్ళు రెడీగా వున్నారని గ్రహించాడు బెహరా. అక్కడనుంచి టార్గెట్‌ని కాల్చడం తేలిక కాబట్టి ఆ ఏర్పాట్లు చూసి ఆందోళన చెందలేదతను. ఆ వ్యక్తులు చురుగ్గా తుప్పలు తొలగించడం చూస్తూ ఆలోచనల్లో మునిగిపోయాడు.

ఆ ఎసైన్‌మెంట్ తరువాత సూరిని హతమార్చి ఆ వృత్తికి స్వస్తి చెప్పాలని నిశ్చయించుకున్నాడు. తన వునికి బయటపడే సూచన్లు కనిపిస్తున్నాయి కాబట్టి పలాయనం చిత్తగించడం మంచిది. పని పూర్తి చేసిన మరుక్షణం రాష్ట్రం వదిలిపెట్టాలి. ఆ అడవినుంచి తనొక్కడే తిరిగి వెళ్ళాలనుకుంటున్నాడు. అందుకే స్నేహితుని రైఫిల్ ఛాంబర్‌లో ఒక్క తూటా మాత్రం వుంచి మెగ్జిన్ ఖాళీచేశాడు.

"చేతులెత్తండి"

స్నేహితుని గొంతు విని వెనక్కి చూశాడు.

అతను రైఫిల్‌తో కొందరు మనుషుల్ని ఆపడం కనిపించింది. ఓసారి టార్గెట్‌ని చూసి అతని దగ్గరకొచ్చాడు. ఆ మనుషుల్లో సబ్ఇన్‌స్పెక్టర్ సూరిని చూసి వులిక్కిపడ్డాడు బెహరా. క్షణంలో తేరుకుని స్నేహితునితో చెప్పాడు.

"వీళ్ళని చెట్టుకి కట్టేయ్"

"మీరెవరు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సూరి. దిబ్బ పైనుంచి కిందవున్నవారిని గమనించడం తేలికని వచ్చాడు.

"చెబుతా... తొందరపడకు..." అని స్నేహితుని చేతిలోని రైఫిల్ తీసుకున్నాడు.

అతను అడవి తీగలు తెంపుకొచ్చి ఒక్కొక్కర్ని చెట్టుకి కట్టేశాడు.

"సబ్ఇన్‌స్పెక్టర్ సూరి అడవిలోకి ఎందుకొచ్చినట్టో?" వ్యంగ్యంగా అడిగాడు.

"నా పేరు నీకెలా తెలిసింది?" సూరి గొంతులో ఆశ్చర్యం.

నవ్వాడు బెహరా.

"వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్నావు. నీ విషయంలో మొదటిసారి నా పథకం ఫెయిలయింది. ఈసారి జడ్జి ఎదుట చంపి నా సామర్థ్యం రుజువు చేసుకోవాలని ప్లాన్ చేశాను. కాని వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టు ఇక్కడకొచ్చి శ్రమ తప్పించావు. మిగతావారితో పాటు నిన్ను హతమార్చి నా పని సంపూర్ణంగా పూర్తిచేస్తాను" అని రైఫిల్ గురిపెట్టాడు.

ఎదుట నిలబడిన అతన్ని నిశితంగా చూసి సూరి పెదాలు విడివడ్డాయి.

"రామ్ బెహరా!"

నిశ్చేష్టుడయ్యాడు బెహరా.

అతనికి పేరు ఎలా తెలిసింది? ఒకవేళ పేరు తెలుసుకున్నా తనని ఎలా గుర్తుపట్టాడు? సూరి మరీ ఇంత ప్రమాదకరమైన వాడని వూహించలేదు.

ఆ కాస్త వ్యవధిని అనుకూలంగా మార్చుకున్నాడు సూరి.

"రైఫిల్ పేలితే ఆ శబ్దానికి కింద వున్నవారు ఇటువస్తారు. తమ మనిషిని చంపింది నువ్వేనని గ్రహించి నిన్ను ఇక్కడ పూడ్చిపెడతారు" అన్నాడు. బెహరా అక్కడ తారసపడటంవల్ల కలిగిన విస్మయం పైకి కనిపించకుండా జాగ్రత్తపడ్డాడు.

సూరి మాటల్లో అసత్యం లేకపోవడంతో రైఫిల్ దించాడు బెహరా. ఇప్పుడు అతన్ని కాల్చి లేనిపోని సమస్యలు సృష్టించుకోవడం మంచిది కాదని తోచింది. అంతేకాకుండా




ఆ రైఫిల్‌లో ఒకే తూటా వున్న విషయం కూడా గుర్తొచ్చింది. రెండు గంటలు ఓపిక పడితే అక్కడ పనిపూర్తిచేసి సూరి బృందాన్ని హతమార్చవచ్చు. చివరగా స్నేహితుని పనిపట్టి అక్కడ జరిగిన విషయాలు బయట ప్రపంచానికి తెలియకుండా భూస్థాపితం చెయ్యవచ్చు.

"కాసేపు దైవప్రార్థన చేసుకో" బెహరా అన్నాడు.

"ఆ బృందంలోని మనిషిని ఎందుకు చంపావ్?" అడిగాడు సూరి.

"మరో ఇద్దర్ని కూడా చంపబోతున్నాను. ఈ ఫొటోలు చూడు..." అని కవరు సూరి జేబులో పెట్టాడు.

"ఈ హత్యలు చెయ్యమన్నదెవరు?"

"అతనెవరో నాకు తెలియదు. పని చెప్పి, అడ్వాన్సు ఇస్తే తెలుసుకోవాల్సిన అవసరం ఏముంది?"

జాగ్రత్తగా వుండమని స్నేహితునికి సైగ చేసి దిబ్బ చివరకు వచ్చాడు.

మొక్కలు నరికే పని ఆగిపోయింది.



చుట్టూ వున్న చెట్లను పరిశీలనగా చూశాడు సిద్ధయ్య.

"రెండు అడ్డగీతలు చెక్కిన చెట్టు ఎక్కడుందో వెదకండి" చెప్పాడు. పనివాళ్ళు చెరోవైపు నడిచారు.

త్వరలోనే డబ్బు తిరిగి తీసుకోవచ్చుననే వుద్దేశ్యంతో అప్పటికప్పుడు చెట్టుమీద ఓ గుర్తుపెట్టి వెనక్కి వచ్చాడు. పోలీసులకు పట్టుబడి జైలుకి వెళ్ళడంవల్ల పదకొండు సంవత్సరాలు పట్టింది రావడానికి. ఇప్పుడు డబ్బు దాచిన ప్రదేశం గుర్తుపట్టలేనంతగా మారిపోయింది. నీరు నిలవని ప్రదేశంలో సంచులు పాతి, ఆ చోటుకి ఇరవై అడుగుల దూరంలోని ఒక చెట్టుమీద అడ్డగీతలు చెక్కాడు. ఆ చెట్టునే వెదకమని పురమాయించింది.

పనివాళ్ళు నలువైపులా వెదికి అటువంటి చెట్టు కనిపించకపోవడంతో వచ్చి ఆ విషయం చెప్పారు. అదే సమయంలో సుబ్బారెడ్డి వచ్చాడు.

"ఏమయింది?" అడిగాడు.

విషయం చెప్పాడు సిద్ధయ్య.

"అది ఏ చెట్టు?"

"గంద్ర..."

సుబ్బారెడ్డి మౌనంగా వుండిపోయాడు. గంద్రజాతి కలపని గుమ్మాలు, కిటికీలు తయారుచెయ్యడానికి ఉపయోగిస్తారు. ఆ కలప లభించకపోతే ఇంటి నిర్మాణంలో చిన్న ముక్కనైనా వాడటం శుభమని కొన్ని ప్రాంతాల వారు విశ్వసిస్తారు. కలప వ్యాపారులు గంద్రని విరివిగా సేకరించి దాస్తారు. సిద్ధయ్య గుర్తుపెట్టిన చెట్టు అదృశ్యం కావడానికి అదే కారణం కావచ్చు.

"ఆ చెట్టు కనిపించకపోతే డబ్బు దాచిన ప్రదేశం కనుక్కోలేమా?"

"దానికి తుర్పువైపు నిలబడి ఇరవై అడుగులు నడిస్తే డబ్బు దాచిన ప్రదేశం వస్తుంది. అదే లేకపోతే ఎక్కడ తవ్వుతాం?"

నిజమే.

పచార్లు చేస్తూ ఆలోచించాడు సుబ్బా

రెడ్డి. హటాత్తుగా ఏదో స్ఫురించినట్టు మొక్కలు తొలగించిన భూమిని నిశితంగా చూశాడు. పనివాళ్ళని పిలిచి ఏవో సూచనల్లు ఇచ్చాడు. చెట్టు కొట్టిన పిదప నేలలో మిగిలిపోయిన మొదలు భాగాలనుండి చిన్న చిన్న ముక్కలు తీసి వారు సుబ్బారెడ్డికిచ్చారు. వాటిని పరిశీలించి ఒక మొదలు వద్దకు వెళ్ళాడు.

"నువ్వు గుర్తులు చెక్కిన చెట్టు ఇదే..." సిద్ధయ్యతో చెప్పాడు.

నమ్మలేనట్టు చూశాడు సిద్ధయ్య.

"ఇక్కడ వుండాల్సిన గంధ్రచెట్టు లేదంటే ఎవరో నరికి పట్టుకుపోయివుండాలి. చెట్టుని తొలగించినా కొంతభాగం భూమిలో వుండిపోతుంది. ఇక్కడ మొత్తం ఆరు చెట్లు నరికారు. వాటిలో గంధ్రజాతి చెట్టు ఒక్కటే వుంది. అంటే నువ్వు గుర్తుపెట్టిన చెట్టు అదేనన్నమాట"

సుబ్బారెడ్డి మేథస్సు అంచనా వెయ్యడానికి ఆ రీజన్ ఒక్కటీ చాలు. వయసు తెలివితేటల్ని ఏమాత్రం తగ్గించలేదు. పరిస్థితులు అనుకూలించక అనామకునిగా వుండిపోయాడు. లేదంటే రాష్ట్రంలో ఓ ప్రముఖ రాజకీయనాయకునిగా విరాజిల్లేవాడు.

"ప్రమాదం ముంచుకురాకముందే పని ముగించు. వీలైనంత తొందరగా ఇక్కడ నుంచి వెళ్ళిపోవాలి" ఆలోచిస్తున్న సిద్ధయ్యని హెచ్చరించి కదిలాడు సుబ్బారెడ్డి.

ఆ మొదలుకి తూర్పుకి నిలబడి ఇరవై అడుగులు నడిచాడు సిద్ధయ్య. అక్కడ దట్టంగా తుప్పలు పెరిగి వున్నాయి. ఆ తుప్పలు తీసేసి నేలని తవ్వడం ప్రారంభించారు పనివాళ్ళు. ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు సిద్ధయ్య. ఐదడుగులు లోతు తవ్వే సరికి పాలిథిన్ సంచులు వెలుగు చూశాయి. మరికొంచెం లోతు తవ్వి వాటిని బయటకు తీశారు.

సంచులు చెక్కు చెదరకపోవడం గమనించి వూపిరి పీల్చుకున్నాడు సిద్ధయ్య.

ఆ డబ్బు గురించే గిరిజన చైతన్య సమితి పునాదులు నేలమట్టమయ్యాయి. ప్రతీ గ్రామంలో కార్యాలయాలు ప్రారంభించి గిరిజనులకు సహాయపడి చైతన్యం తీసుకురావాలని పోగుచేసిన ఆ డబ్బు తనని జైలుకి పంపింది. ప్రజల విరాళాలతో సమకూడిన ఆ డబ్బు వ్యక్తులకు చెందినది కాదు. వ్యవస్థకి చెందినది.

ధన్

గుండెల్లోంచి తూటా దూసుకుపోయి ఎగిరిపడ్డాడు సిద్ధయ్య.

★ ★ ★

ద్వివేది వద్దనుండి అయిష్టంగానే కదిలింది పుబులి.

అతనికి సహాయపడాలని తండ్రిని ఒప్పించి తీసుకొస్తే కనీసం మంచి చెడ్డలు విచారించకుండా పంపివేయడం ఆమెకు కష్టం కలిగించింది. తను బాధపడుతున్న విషయం పసిగడితే తండ్రి వుగ్రుడవుతాడని తెలుసు.

హర్గుణసాహోతా మౌనంగా కూతుర్ని అనుసరిస్తున్నాడు. అతనికి గ్రామ ప్రజలు, కూతురు పుబులి తప్ప మరో విషయం పట్టదు. కూతురునే కొడుకులా పెంచాడ తను. పుబులి విల్లంబులు చేపట్టి ఒంటరిగా అడవిలో సంచరిస్తుంది. ఆమె బాణం వేటు తిన్న జంతువు ప్రాణాలు వదలాల్సిందే!

గృహదేవత పండుగనాడు జన్మించిన కూతురు అడిగింది ఇవ్వడం మాత్రమే అతనికి తెలుసు. ద్వివేదిని కోరుకుంటే కాదనకపోవడానికి అదే కారణం. ఆరోజు ద్వివేది కదలికలు చూసి గృహదేవత తనకి తగ్గవాడినే ఎంచుకుందని తృప్తిపడ్డాడు.

హర్గుణసాహోతా మిటిం గ్రామస్తులకు దేవుడుతో సమానం. మంచితనంలో మిటింవారి అభిమానం చూరగొన్న వ్యక్తి. అతని మాట కాదనే మనిషి గ్రామంలో లేడు. అయితే కన్నకూతురు ముందు మాత్రం సాధారణ కోందు. పుబులికి జన్మ




నిచ్చి పురిట్లో భార్య చనిపోతే తట్టుకోలేక సారాయిని ఆశ్రయించాడు. చిన్నారి పుబులి బోసి నవ్వులు అతన్ని మేలుకొల్పి మనిషిని చేశాయి.

కూతురు నవ్వితే చాలు, ఎంత కష్టమైనా మర్చిపోతాడు.

ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయి తండ్రీకూతుళ్ళు, అడవిలో పుట్టి పెరగడం వల్ల వచ్చిన సాన్నిహిత్యంతో చెట్లమధ్య అత్యంత నేర్పుగా నడుస్తున్నారు. ఒకచోట ఆగిపోయి చప్పున చెట్ల వెనక్కి జరిగారు.

వారికి ఓ వ్యక్తి రైఫిల్‌తో కనిపించాడు.

అతనెవరో, అక్కడెందుకున్నాడో అర్ధంకాలేదు. నాగరీకులు వేటకోసం అడవికి రావడం తెలిసిన విషయమే. కాని అతన్ని చూస్తుంటే వేటకొచ్చిన మనిషిలా కనిపించడంలేదు.

కాసేపు అతన్నే జాగ్రత్తగా గమనించి చెట్లకి ఎవరినో కట్టేసి వారికి కాపలాగా అక్కడ వున్నాడని పసిగట్టింది పుబులి. ఆ దిబ్బ దాటి అవతలికి వెళ్ళాలంటే అతన్ని ఏమార్చాలి. తండ్రిని అక్కడే వుండమని కదిలిందామె. చెట్లకి కట్టేసివున్న మనుషుల్ని గుర్తుపట్టి తిరిగొచ్చి తండ్రికి ఆ విషయం చెప్పింది.

అతను ప్రశ్నార్ధకంగా చూశాడు.

పుబులి దృష్టి దగ్గరలోని పొదపైన పడింది. మనుషుల అలికిడికి పొదలో దూరింది పాము ఒకటి. బయటకు కనిపిస్తున్న తోకనిబట్టి దాని జాతిని గుర్తించిందామె. మరుక్షణం చెయ్యిసాచి తోకపట్టుకుని పాముని వెలుపలికి లాగింది. మెలికలు తిరుగుతున్న దానిని సూటిగా రైఫిల్ పట్టుకున్న వ్యక్తిపైకి విసిరింది.

మెడలో పడిన పాముని చూసి ఒక్కవుదుటున గెంతి రైఫిల్ వదిలేశాడతను.

పులి నిశ్శబ్దంగా కదిలి ఒక చెట్టుకి కట్టిన తీగలు చురకత్తితో తెంచి మెరుపులా తండ్రివద్దకు వచ్చింది. అదును చూసుకుని దిబ్బదాటి అవతలి పక్క చెట్లలో అదృశ్యమయ్యారు.

★ ★ ★

చూస్తుండగానే రైఫిల్ వదిలి కింద పడిపోయాడా వ్యక్తి.

ఏం జరిగిందో గ్రహించకముందే కట్లు విడిపోయాయి. వెనక్కిచూసి అక్కడ ఎవరూలేకపోవడంతో ఆశ్చర్యపోయాడు సూరి.

కిందపడిన వ్యక్తి కొట్టుకుంటున్నాడు. నేల ఆసరా దొరికిన మరుక్షణం శరవేగంతో తుప్పల్లోకి జారుకుంది పాము. అందుచేత అక్కడి పరిస్థితి తారుమారు కావడానికిగలకారణం గ్రహించలేకపోయాడు సూరి. ఆలస్యం చెయ్యకుండా తనవారి కట్లు విప్పేశాడు.

ఆ వ్యక్తిని సమీపించి కళ్ళు తేలేసి వుండటంచూసి నాడి పరీక్షించి ప్రాణాలు పోయాయని గ్రహించాడు. వెంటనే రైఫిల్ అందుకుని బెహరావైపు కదిలాడు. సరిగ్గా అప్పుడే రైఫిల్ ఫైర్ చేశాడు బెహరా. టార్గెట్ పడిపోవడం చూసి లేచి వెనక్కి తిరిగాడు.

ఎదురుగా రైఫిల్‌తో సూరి.

అతని వెనుక నేలమీద కదలకుండా పడున్న స్నేహితుని శరీరం కనిపిస్తోంది. క్షణాలలో పరిస్థితి అంచనావేశాడు.

"రైఫిల్ చేతికి చిక్కితే అందులో తూటాలు వున్నాయో, లేదో చూసుకోవద్దా" నవ్వుతూ అన్నాడు.

సూరి నొసలు ముడివడింది.

"నా దగ్గిర నీ తెలివితేటలు చూపించకు" కటువుగా అన్నాడు.

"నేను అబద్ధం చెప్పడంలేదు. ఆ రైఫిల్‌తో పనిలేదని మెగ్జైన్‌లో తూటాలు నింపలేదు. కావాలంటే ట్రిగ్గర్ నొక్కి చూడు"

సందిగ్ధంలో పడిపోయాడు సూరి.

మెగ్జిన్ తీసి చూస్తే తప్ప తూటాలు వున్నదీ లేనిదీ తెలియదు. ట్రిగ్గర్ నొక్కి ఆ విషయం తెలుసుకోవచ్చు అయితే ఆ రెండు పనులు చెయ్యడం సాధ్యంకాదు. మెగ్జిన్ తియ్యాలంటే రైఫిల్ దించాలి. అందుకోసమే చూస్తున్న బెహరా తనని కాలుస్తాడు. ట్రిగ్గర్ నొక్కితే అందులో ఒక్క తూటా మాత్రమే వుంటే రైఫిల్ తిరిగి వుపయోగపడదు. అసలు తూటాలు లేకపోతే తనని కాల్చకుండా ఆ విషయం ఎందుకు చెప్పినట్టు?

సూరి ఆలోచనలు పసిగట్టి రైఫిల్ ఎత్తి ట్రిగ్గర్ నొక్కాడు బెహరా. సెన్సాఫ్ డైరెక్షన్‌లో కాల్చడంవల్ల ఆ తూటా సూరి భుజాన్ని రాసుకుంటూ పోయింది. మెరుపులా పక్కకి పడిపోతూ ట్రిగ్గర్ నొక్కాడు సూరి. బెహరా చేతిలోని రైఫిల్ ఎగిరిపోయింది.

అతను మెరుపు తీగలా చెట్లలోకి గెంతాడు. అటు తిరిగి ట్రిగ్గర్ ప్రెస్‌చేసి రైఫిల్ పేలకపోవడంతో దాన్ని వదిలి పోచ్‌నుండి రివాల్వర్ తీశాడు సూరి. అప్పటికే బెహరా చెట్లమధ్య అదృశ్యమయ్యాడు.

అతన్ని పట్టుకోవడానికి పరిగెత్తారు సిబ్బంది.

రైఫిల్ శబ్దం విని ద్వివేది, అతని వెనుక సుబ్బారెడ్డి పరిగెత్తుకుని వచ్చారు.

గొయ్యి పక్క పడున్నాడు సిద్ధయ్య. అతని ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయని గ్రహించడానికి ఎక్కువసేపు పట్టలేదు. ఛాతీకి ఎడమ పక్క తూటా చేసిన రంధ్రం స్పష్టంగా కనిపిస్తోంది. బసవప్పకి కూడా అక్కడే తగిలింది తూటా.

మతిపోయినట్టు వుండిపోయాడు సుబ్బారెడ్డి. సహచరుడ్ని కోల్పోవడంవల్ల కలిగిన దిగ్భ్రాంతి ముఖంలో కనపడుతోంది. విపత్కర పరిస్థితిలో కూడా ఆత్మవిశ్వాసం ప్రదర్శించే మిత్రుడి మరణం జీర్ణించుకోలేకపోతున్నట్టు నిశ్చలంగా వుండిపోయాడు.




ద్వివేది కళ్ళు అశ్రువులతో నిండిపోయాయి.

సిద్ధయ్యతో అతని పరిచయం స్వల్పమేకావచ్చు ఆ స్వల్ప పరిచయంలో ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. గురువు నంబియార్ బతకడానికి మెళుకువలు నేర్పితే అసలు మనం ఎందుకు బతకాలి? అని ప్రశ్నించి ఆలోచనలు రేకెత్తించాడతను.

అటువంటి మనిషి వూపిరి ఆగిపోయింది. తెరిచిన నోటినుండి ప్రాణాలు ఎగిరిపోయాయి. విజ్ఞానం నిక్షిప్తం చేసుకున్న మస్తిష్కం శాశ్వతంగా పనిచెయ్యడం మానుకుంది. పుస్తకాలు చదివి అలిసిన నేత్రాలు మూసుకుపోయాయి. విప్లవ రాజకీయాలతో కొట్టుకున్న గుండె ఆగిపోయింది.

స్వంత ఆస్తిలేని పంథాకోసం జీవితం త్యాగంచేశాడు. ప్రజలకి ఏదో చెయ్యాలనే తపన, సమాజాన్ని మార్చాలనే భావన నరనరాన్న నింపుకున్న అతను ఎన్నడూ సుఖంగా నిద్రించలేదు. ఆశయసాధనకు నడిచిన అడవిలోనే ప్రాణాలు విడిచాడు.

"పని వాళ్ళేరి? "

సుబ్బారెడ్డి ప్రశ్నించడంతో ఆలోచనల నుండి తెప్పరిల్లాడు ద్వివేది. క్షణాలలో తేరుకున్న అతనివైపు విస్మయంగా చూశాడు.

గొయ్యి పరీక్షించి అన్నాడతను.

"సంచులు తీశారు. కాని అవి లేవు"

సరిగ్గా అప్పుడే రెండుసార్లు రైఫిల్ పేలింది. ద్వివేది నేలని కౌగలించుకోవడం చూసి సుబ్బారెడ్డి కూడా కిందపడుకున్నాడు. అదే సమయంలో చెట్లలో ఎవరో పరిగెడుతున్న సవ్వడి వినిపించింది.

"పనివాళ్ళు డబ్బుతో పారిపోతున్నారు. నువ్వు దిబ్బపైకి వెళ్ళి చూడు. నేను పనివాళ్ళని పట్టుకోవడానికి వెళతాను" చెప్పి జవాబుకోసం చూడకుండా ఒక్క వుదుటన లేచి చెట్లవైపు దూసుకుపోయాడు.

సిద్ధయ్య శరీరంవైపు ఓసారి చూసి దిబ్బని సమీపించాడు ద్వివేది. పైనుంచి చూసినా తను కనిపించనని నిర్ధారించుకుని సిగరెట్టు వెలిగించాడు. చుట్టూ తిరిగి దిబ్బ మీదకు వెళ్ళేసరికి పది నిముషాలు పట్టింది. అక్కడ సూరి ఒంటరిగా వున్నాడు.

ద్వివేది రావడం గమనించి తను చూస్తున్న ఫొటోలు అందించాడు సూరి. సిద్ధయ్యతోపాటు తన ఫొటో కూడా వుండటం చూసి వులిక్కిపడ్డాడు. అంతకు ముందు కొండవద్ద దొరికిన ఫొటో ముక్కలు తీశాడు. అన్ని ఫొటోలమీద ఎరుపురంగు అంకెలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆ వరుస ప్రకారం మిగిలింది తనొక్కడే!

మిగతావారిని చంపడానికి కారణముంది. తనని హతమార్చాలనుకోవడానికి కారణం కనిపించడంలేదు. అసలు తన ఫొటో ఎలా వచ్చింది? జవాబులేని ప్రశ్నలు మనసుని దొలిచేస్తుంటే కిందపడున్న మనిషిని చూసి అడిగాడు.

"అతను గోర్కీయేనా? "

తల అడ్డంగా వూపి ప్రశ్నించాడు సూరి.

"గోర్కీ ఎవరు? "

"సుబ్బారెడ్డి మనుషుల్ని హతమార్చి డబ్బు హస్తగతం చేసుకోవాలనుకున్న వ్యక్తి పేరు గోర్కీ"

బసవప్ప హత్య జరిగినప్పుడు ద్వివేదిని కలిసి మాట్లాడాడు సూరి. క్లుప్తంగా విషయం తెలుసుకుంటున్నప్పుడు సుబ్బారెడ్డి రావడంతో పక్కకి తప్పుకున్నాడు.

"అతను నాలుగు నెలలక్రితం చనిపోయాడు"

పక్కన బాంబు పేలినట్టు అదిరిపడ్డాడు ద్వివేది.

"నా జ్యూరీస్ డిక్షన్‌లోని ఓ ప్రైవేటు నర్సింగ్‌హోమ్‌లో సిరోసిస్ ఆఫ్ లివర్ అనే వ్యాధితో మరణించాడు. పేరు మార్చుకుని



హాస్పిటల్లో చేరడంవల్ల నెలరోజులు చికిత్స చేయించుకున్నా బయటి ప్రపంచానికి తెలియలేదు. గోర్కీ చనిపోయిన తరువాత ఓ సీనియర్ జర్నలిస్టు దినపత్రికలో వార్త రాశాడు. ఆ న్యూస్ వెలుగు చూసేసరికి అంత్యక్రియలు పూర్తయ్యాయి"

గోర్కీ లేకపోతే హత్యలు చేయించిందెవరు?

"గోర్కీ బతికున్నట్టు సిద్ధయ్య చెప్పాడు. అతనికి అబద్ధం చెప్పాల్సిన అవసరంలేదు"

"గోర్కీ మరణం గురించి వారికి తెలియకపోవచ్చు"

అది కూడా నిజమే అనిపించింది ద్వివేదికి.

"ఇతనెవరు? "

"మిమ్మల్ని హతమార్చడానికి ప్రొఫెషనల్ కిల్లర్ వచ్చాడు. అతనితో వచ్చిన మనిషి"

"గోర్కీ లేనప్పుడు ఇదంతా ఎవరు చేయించినట్టు? ముఖ్యంగా నన్ను చంపాలనుకోవడానికి కారణమేమిటి? "

"డబ్బుకోసం మరెవరో ప్రయత్నిస్తూ వుండాలి. మీరు ఎంచుకున్న మార్గంలో ఇక్కడికి రావడానికి నాలుగు రోజులు పడుతుంది. ప్రయాణ సాధనాలు వుపయోగించుకుంటే ఒకే రోజులో రావచ్చు ఆ మార్గంలోనే ప్రొఫెషనల్ కిల్లర్ వచ్చాడు. అంటే డబ్బు గురించి, ఈ ప్రదేశం గురించి క్షుణ్ణంగా తెలిసిన వారెవరో ఈ పథకం రూపొందించారు. వాళ్ళకి మీ బృందంలో ఎవరెవరు వున్నారనే సంగతి కూడా తెలుసు. ఇప్పుడు మనం ప్రమాదంలో వున్నాం"

"ప్రమాదమా? "

"అవును... ప్రొఫెషనల్ కిల్లర్ని పురమాయించిన వాళ్ళు ఇక్కడే వున్నారు. ఇప్పుడు మనని వాచ్ చేస్తున్నా ఆశ్చర్యపడక్కర్లేదు"

ఉలిక్కిపడ్డాడు ద్వివేది.

"ఇప్పుడే వస్తాను. సుబ్బారెడ్డి ఒంటరిగా వెళ్ళాడు. అతనికి సాయపడాలి" అని అక్కడినుండి దిబ్బ కిందకు పరిగెత్తాడు.

అతని గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి. బసవప్ప, సిద్ధయ్యల హత్య తను ఆపలేకపోయాడు. కనీసం సుబ్బారెడ్డిని అయినా రక్షించాలి.

బీప్... బీప్...బీప్

ఆ చప్పుడుకి బ్రేక్‌వేసినట్టు టక్కున ఆగిపోయాడు ద్వివేది. ఉద్వేగాన్ని అణుచుకుంటూ శబ్దం వెలువడుతున్న పొదని సమీపించాడు. పొదలో సెల్‌ఫోన్ కనిపించింది. దానిపైన దుమ్ము పేరుకుని లేదు కాబట్టి అక్కడపడి ఎక్కువసేపు అయివుండదు. సెల్ చేతిలోకి తీసుకుని బటన్ ప్రెస్‌చేశాడు.

"రామ్‌బెహరా! నీ లొకేషన్ ఎక్కడ? "

చర్మంపైన వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

"దిబ్బమీదున్నాను..."

"అక్కడ ఏదైనా విశేషం జరిగిందా? "

జవాబు చురుగ్గా ఆలోచించాడు.

"ఎలుగుబంటి వస్తే కాల్చి చంపాం"

"భూమినుంచి సంచులు తీసిన తరువాత టార్గెట్‌ని కాల్చావు కదూ? "

"ఆ..."

"ఆ సంచులు ఎవరు తీసుకెళ్ళారు? "

చాలా క్లిష్టమైన ప్రశ్న. జవాబుకోసం తడుముకోలేదు ద్వివేది.

"గొయ్యి తవ్విన మనుషులు తీసుకెళ్ళారు"

రెండు క్షణాలు నిశ్శబ్దం.

"నువ్వు వెంటనే కాలి బాటలోకి వచ్చి దక్షిణంవైపు నడు. టార్గెట్ నెంబర్ త్రీ ఎదురైతే కాల్చి పారేయి. నీ వెంట బైనాక్యులర్ తీసుకురా"

"అలాగే..."

కాల్ కట్ అయింది.

ద్వివేది మొహంనిండా చెమటపట్టింది. దారుణమైన నిజం తెలియజేసిన సెల్‌ని




చూస్తూ వుండిపోయాడు.

అద్భుతమైన ప్లాన్!

సూరి ప్రవేశించకపోతే ఈపాటికి పథకం సక్సెస్ అయ్యేది. డబ్బు స్వంతంచేసుకోవడం జరిగిపోయేది. నిజానికి సూరి పరోక్షంగా తన ప్రాణాలు రక్షించాడు. అతను రాకపోతే బసవప్ప, సిద్ధయ్య సరసన చేరేవాడు. పథకం మొత్తం అర్థమయ్యేసరికి పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

వేగంగా నడిచి దక్షిణంవైపు దట్టమైన అడవి మధ్య ఖాళీ ప్రదేశం చేరుకుని చుట్టూ కలియచూశాడు ద్వివేది. అక్కడ నిశ్శబ్దంగా వుంది. ఎల్లప్పుడూ కిలకిలారావాలతో సందడి సృష్టించే పక్షులు కూడా మౌనం దాల్చాయి.

"కదలకు... నా చేతిలో రివాల్వర్ వుంది" ఖంగుమని హెచ్చరిక వినిపించింది.

అటు తిరిగాడు ద్వివేది.

రివాల్వర్ గురిపెట్టి చెట్టుపక్కన వున్నాడు సుబ్బారెడ్డి. అతని మొహాన్ని, చేతిలోని రివాల్వర్ని మార్చిమార్చి చూశాడు ద్వివేది.

"నీ కంఠం విన్నపుడు నా గొంతు పోల్చుకుంటావని అనుకున్నాను"

ద్వివేది మౌనం వహించాడు. డబ్బు కోసం సహచరుల్ని తుదముట్టించిన అతన్ని చూస్తుంటే నోటమాట రావడంలేదు. సంవత్సరాల తరబడి కలిసి నడిచిన మిత్రుల్ని పొట్టనపెట్టుకున్న మానవమృగం అతనేనని నమ్మలేకపోతున్నాడు.

"ఇదంతా డబ్బుకోసమే చేస్తున్నప్పుడు మధ్యలో నన్నెందుకు ఇరికించావ్?" గొంతు పెగుల్చుకుని అడిగాడు ద్వివేది.

బిగ్గరగా నవ్వాడతను.

"అది కూడా పథకంలో భాగమే" అని, తల పంకించి చెప్పాడు.

"గోర్కీ చంపుతాడనే భయం కలిగించి, రక్షణకోసం ఒక మనిషిని తీసుకెళ్ళాలి కాబట్టి నిన్ను ఎన్నికచేశాను. ఇక్కడ జరిగిన దానికి కర్త, కర్మ, క్రియ నేనే"

డబ్బు తీసుకొచ్చేందుకు ఒక మార్గం సూచించి, మరోవైపు ప్రొఫెషనల్ కిల్లర్ని ఏర్పాటుచేశాడు. నలుగురిలో ముగ్గుర్ని కిల్లర్ హతమారుస్తాడు. అతనికి ఇన్‌స్ట్రక్షన్స్ ఇవ్వడానికి సెల్ ఫోన్ వుపయోగించాడు. ప్లాన్ సక్సెస్ అయితే డబ్బుతో మిగిలిపోతాడు సుబ్బారెడ్డి. ఊహాతీతమైన పథకం రూపొందించిన అతనిని విస్మయంగా చూశాడు ద్వివేది.

సుబ్బారెడ్డి నవ్వాడు.

"డబ్బు దాచిన చోటు నాకు తెలిసుంటే వీళ్ళని చంపాల్సిన అవసరం కలిగేదికాదు. పదకొండు సంవత్సరాలక్రితమే స్వంతం చేసుకునేవాడిని" అని గెడ్డంలో దాగిన మచ్చని ఓసారి తడిమి చెప్పసాగాడు.

"గిరిజన చైతన్య సమితి నాయకత్వం నుంచి సిద్ధయ్యని తప్పించాలని గోర్కీ మద్దతు కోరాను. అతను నామీద దాడిచేసి గాయపరిచాడు. అతన్ని తుదముటిస్తే తప్ప నాకు భవిష్యత్తు లేదని గ్రహించి దళం కదలికలు పోలీసులకు అందజేశాను. ఆ దాడి నుంచి తప్పించుకున్నాడు గోర్కీ. అప్పటికే అతని సోదరుడు సబ్ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేస్తున్న అంశాన్ని వుపయోగించుకుని గోర్కీ ద్రోహం తలపెట్టాడని ప్రచారం చేశాను. నేను అనుకున్నట్టు జరిగితే సిద్ధయ్య జైలుకి వెళ్ళిన మరుక్షణం డబ్బు నాకు చిక్కేది"

"సిద్ధయ్య జైలుకి వెళ్ళడంలో కూడా నీ హస్తం వుండి వుంటుంది" కసిగా అన్నాడు ద్వివేది.

అతనివైపు చురుగ్గా చూసి, ఓక్షణం తరువాత నవ్వాడు సుబ్బారెడ్డి.

"చక్కగా వూహించావు. డబ్బు దాచి రావడానికి ముందే ఆ స్థావరం గురించి పోలీసులకు సమాచారం వెళ్ళింది. దారిలో పురుగు కరిచి నేను నడవలేకపోవడంవల్ల డబ్బు దాచిన చోటు చూడలేకపోయాను"



"ఇదంతా గోర్కీకి తెలియదా? "

"తెలియదు. ఎన్‌కౌంటర్‌కీ, డబ్బు దాయ డానికీ మధ్య ఎక్కువ వ్యవధిలేదు. అతను తిరిగొచ్చినప్పుడే స్థావరం మీద పోలీసుదాడి జరిగింది. ఆ తరువాత తనపైన జరిగిన దుష్ప్రచారానికి రాజకీయ సన్యాసం చేశాడు. ఈమధ్యనే అనారోగ్యంతో చనిపో యాడు. జైల్లో వున్న సిద్ధయ్యకిగాని నాతో వున్న బసవప్పకిగానీ ఆ విషయం తెలి యదు"

"డబ్బుకోసం ఇన్ని సంవత్సరాలు వేచి వున్న నీ ఓపికను మెచ్చుకోకుండా వుండలే కపోతున్నాను. కానీ నీకు తెలియని విష యాలు కొన్ని వున్నాయి. పార్కులో మన మధ్య జరిగిన సంభాషణ ఒకతను విని సబ్ ఇన్‌స్పెక్టర్ సూరికి చెప్పాడు. నేరస్తుల్ని వదలడానికి ఇష్టపడని అతను మన కదలి కలు తెలుసుకుంటూ ఇక్కడకు వచ్చాడు. ప్రొఫెషనల్ కిల్లర్ని అడ్డుకుని అతనితో వున్న మనిషిని హతమార్చాడు. ఇప్పుడు నువ్వు తప్పించుకోవడం అసాధ్యం" తాపీగా చెప్పాడు ద్వివేది.

అదిరిపడ్డాడు సుబ్బారెడ్డి.

గన్ పైకెత్తాడు ద్వివేది.

"నీ గన్‌లో వున్నవి డమ్మీ రౌండ్స్... నిన్ను చంపి పనివాళ్ళ కోసం వెళతాను" అని ట్రిగ్గర్ నొక్కాడు సుబ్బారెడ్డి.

ద్వివేది తలవైపు దూసుకుపోయింది తూటా.

మాటలు ఆపి రివాల్వర్ పేల్చడానికి మధ్య లిప్తపాటు వ్యవధిలో ఎవరో బలవం తంగా నెట్టినట్టు పక్కకి పడిపోయాడు ద్వివేది. తూటా చెవిని ముద్దాడుతూ చెట్ల లోకి దూసుకుపోయింది. మరో తూటా కాల్చడానికి రివాల్వర్ తిప్పాడు సుబ్బారెడ్డి..

సరిగ్గా అప్పుడే గాలిని చీలుస్తున్న సన్నటి శబ్దమొకటి వెలువడింది. మరుక్షణం ఈటె ఒకటి రివాల్వర్‌కి తగిలింది. నిశ్చేష్టుడై ఈటె వచ్చినవైపు అక్కడెవరో వున్నట్టు, తనకి కనిపిస్తున్నట్టు తీవ్రంగా చూశాడు సుబ్బారెడ్డి. క్షణంలో ముఖకవళికలు మారి పోయాయి. ఏదో అర్థమైనవాడిలా పెదాలు వంకరగాపెట్టి పెద్దగా నవ్వాడు.

"తెలిసింది. డబ్బెక్కడుందో... అంతా పోయారు... నేనూపోతా" అని అరుచు కుంటూ చెట్లకి అడ్డంపడి పరుగందుకు న్నాడు.

అతన్ని పట్టుకోవడానికి కదలబోతున్న ద్వివేదిని అప్పుడే వచ్చిన సూరి ఆపేశాడు.

"తన పథకం ఫెయిలయ్యేసరికి అతని మతి చలించింది. డబ్బు పిచ్చితో అడవిలో తిరుగుతూ ఎప్పుడో, ఎక్కడో మట్టిలో కలి సిపోతాడు. ఏ న్యాయస్థానం విధించలేని కఠిన శిక్ష పడింది సుబ్బారెడ్డికి" అన్నాడు.

మనిషికి కోరికలు, ఆశలు వుండొచ్చు అవి హద్దుమీరి వక్రమార్గం పడితే పతనం కావడం తథ్యం. స్నేహితులకు ద్రోహంచేస్తే జీవితమే సమాప్తమవుతుందనే నిజం చాటుతున్నట్టు సుబ్బారెడ్డి పిచ్చి మాటలు వారిచెవుల్లో గింగురుమంటూనే వున్నాయి.

"ఇంతకీ డబ్బు ఏమయినట్టు? " అడి గాడు సూరి.

"అదే అర్థంకావడంలేదు" అన్నాడు ద్వివేది.

★ ★ ★

వెంటనే బయలుదేరకపోతే కోర్టు వాయి దాకి వెళ్ళలేనని తెలిసి ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, దారిలో చీకటిపడినా ఆగ కుండా అర్ధరాత్రి మిటిం గ్రామం చేరాడు సూరి. వాళ్ళు వస్తారని తెలిసినట్టు వంటలు చేయించి సిద్ధంగా వుంచాడు హార్గుణసా వోతా. కడుపునిండా తినే ఓపిక కూడా లేక పోవడంతో కాస్త ఎంగిలిపడి ఒళ్లు మరిచి అందరూ నిద్రపోయారు.

ద్వివేది కళ్ళు తెరిచేసరికి హార్గుణసా వోతా, పులి నవ్వు ముఖాలతో కనిపిం చారు.

"బిడ్డా! నీ కోసం నూతన గృహం సిద్ధం




చేశా. సందేళ నా బిడ్డ పుబులితో అందులో అడుగెట్టు"

విసుగ్గా చూసి విసురుగా అన్నాడు ద్వివేది.

"కన్నతల్లి జబ్బుతో హాస్పిటల్లో వుంటే నూతన గృహప్రవేశం చెయ్యాలా? అంత కంటే దారుణం ఎక్కడైనావుంటుందా? మీ కోందు సమాజంలో మనుషులు అలాగే ప్రవర్తిస్తారా? "

ఇద్దరి మొహాలు వెలవెలబోయాయి. దెబ్బతిన్న పులిలా అక్కడినుండి నిష్క్రమిం చాడు హార్గుణసావోతా. పుబులిని గుడిసె లోనే వదిలి గెడ్డకెళ్ళి స్నానంచేసి వచ్చాడు ద్వివేది. అప్పటికే సూరి ప్రయాణానికి సిద్ధంగా వున్నాడు. అతనికి తెలియదు గుడి సెలో జరిగిన వ్యవహారం.

ఎరుపురంగు సంతరించుకున్న కనులతో రచ్చబండపైన కూర్చుని వున్నాడు హార్గుణ సావోతా. గ్రామస్తులు గుమికూడి మంత నాలు జరుపుతున్నారు.

బయటకు రాబోతూ అక్కడే వున్న పుబు లిని చూసి ఆగాడు ద్వివేది. నీరు నిండిన కళ్ళతో చూస్తున్నదామె.

"నా తల్లికి వైద్యం చేయించి నూరేళ్ళూ నీతో కలిసి బతకడానికి తిరిగొస్తాను. ఈ గ్రామాన్ని తీర్చిదిద్దుకుందాం. అప్పుడు రంగురంగుల పూలు ఏరడానికి నీతో గెడ్డ కొస్తాను. ఇప్పుడు మాత్రం వుండిపొమ్మని అడక్కు" అన్నాడు.

ఆ మాటలు నమ్మినట్టు తలూపింది పుబులి. ఇద్దరూ గుడిసెనుంచి బయటకొ చ్చారు. హార్గుణసావోతా చుట్టుపక్కల ఎక్కడా కనిపించలేదు. ఒకచోట మూగి తీవ్రంగా చూస్తున్న గ్రామస్తుల్ని సముదా యించింది పుబులి.

అందరూ గ్రామంనుంచి బయలుదేరారు. ద్వివేది వెనక్కి తిరిగి ఎత్తైన గుట్టమీద నిలబడి చూస్తున్న పుబులిని గమనించాడు. బహుశా ఆ అమాయకురాలు విలపిస్తూ వుండొచ్చు. కొన్ని క్షణాలు అటే చూసి చెమ్మగిల్లిన కళ్ళతో భారంగా కదిలాడు.

ఆ రాత్రి మిణిఅపాయులో బసచేశారు. దివుడుసావోతా గుడిసెకు వెళ్ళి అతనికొ డుక్కి క్షమాపణ చెప్పాడు ద్వివేది. తమ మధ్య వైరం సమసిపోయినట్టు ముంతతో విప్పసారా ఇచ్చాడతను.

మరునాడు ఉదయం మిణిఅపాయు వదిలి చీకటివేళ దిగువ గ్రామం కూడలిలో బస్సెక్కారు. బరంపురం రైల్వేస్టేషన్‌వద్ద దిగిపోయాడు ద్వివేది. సూరి వెళ్ళేసరికి ఇంట్లో లైట్లు వెలుగుతూ కనిపించాయి. తలుపు తీసిన తండ్రిని అడిగాడతను.

"మీరెప్పుడొచ్చారు? "

"నాలుగు రోజులయింది. స్టేషన్‌లో అడి గితే వివరాలు చెప్పలేదు. ఎక్కడికెళ్ళావ్? " అడిగాడు తండ్రి.

"ఒక కేసు దర్యాప్తునిమిత్తం ఏజన్సీకి వెళ్ళాను"

ఇంతలో టీ కప్పుతో ప్రత్యక్షమయింది తల్లి.

"టీ తాగి స్నానం చెయ్యనివ్వండి. డైనింగ్ టేబుల్‌వద్ద మాట్లాడుకోవచ్చు" కప్పు అందిస్తూ చెప్పిందామె.

టీ కొద్దిగా తాగి తల్లిని అడిగాడు సూరి.

"ఇది నువ్వు చేసిందేనా? "

"అవును... ఏం? "

"రుచిలో తేడా వచ్చింది. టీలో ఏల క్కాయి వేసే అలవాటు నీకు లేదు" అని చెప్పి, కప్పు ఖాళీచేసి బాత్‌రూమ్‌లోకి దూరాడు. అక్కడ గోరువెచ్చటి నీళ్ళు స్నానానికి రెడీగా వున్నాయి.

తల్లి అంత తొందరగా పనులు ఎలా చేస్తుందో ఎప్పుడూ అంతుబట్టదు సూరికి. ఆమె సమర్థత ఎల్లప్పుడూ ఆశ్చర్యం కలిగి స్తూనే వుంటుంది. కిచెన్‌లో తండ్రి మాటలు వింటూ క్షణాల్లో వంట పూర్తిచే స్తుంది. వారం రోజులు తల్లి చేతివంట తింటే ఆ నెలలో కొత్త యూనిఫాం కుట్టిం

చుకోవాల్సిందే!

స్నానం చేసి అరగంటలో డైనింగ్ టేబుల్ వద్దకు వచ్చాడు సూరి. టేబుల్ మీద భోజన పదార్థాలు సిద్ధంగా వున్నాయి. అన్నం కలుపుకుని ఒక ముద్ద తిని ప్రశ్నార్థకంగా అన్నాడు.

"ఈ కూర? "

తల్లి నవ్వి చెప్పింది.

"నేను చెయ్యలేదు. మీ నాన్నగారు త్వరలో రిటైర్ కాబోతున్నారు. వంటగది నుంచి నాకు మాత్రం రిటైర్‌మెంట్ వుండదా? అందుకే ఓ అమ్మాయిని వంట చెయ్యడానికి తీసుకొచ్చాను"

అదే సమయంలో కిచెన్‌లోంచి ఆ గది లోకి వచ్చింది సంధ్య.

★ ★ ★

చాలాకాలంనుంచి నిర్మాణం ఆగిపోయిన అపార్ట్‌మెంట్స్ సముదాయాన్ని పరికించి చూసి, తననెవరూ గమనించడంలేదని గుర్తించి చప్పున లోపలికి అడుగేశాడు బెహరా. గబగబా మెట్లెక్కి మూడవ అంత స్తులోని ఒక రూమ్‌లోకి ప్రవేశించాడు.

కిటికీ సమీపించి కిందకు దృష్టిసారిం చాడు.

అక్కడ కోర్టు ఆవరణ చుట్టూ పోలీసు బలగాలు మోహరించి వున్నాయి. మఫ్టీ పోలీసులు జనంలో కలిసిపోయి డేగకళ్ళతో ప్రతీ మనిషిని పట్టిపట్టి చూస్తున్నారు. కోర్టుద్వారం వద్ద ఇద్దరు మెటల్‌డిటెక్టర్‌తో తనిఖీ చేస్తున్నారు.

తల పంకించి గది మూల కుప్పగా పడున్న గడ్డికిందనుంచి బ్యాగ్ ఒకటి బయ టకు తీశాడు. బ్యాగ్‌నుండి వెపన్ భాగాలు తీసి ఒకదానికొకటి కలిపాడు. సైలెన్సర్ ఫిక్స్‌చేసి ఛాంబర్‌లో బుల్లెట్ వుంచి బోల్ట్ క్లోజ్‌చేశాడు. కిటికీ పక్క గోడకి గన్ ఆనించి సిగరెట్ వెలిగించి వాచీ చూశాడు. పది కావడానికి రెండు నిముషాలు మాత్రం మిగిలుంది.

అతను తాపీగా సిగరెట్ కాలుస్తుంటే సెకన్లముల్లు చురుగ్గా కదులుతోంది.

అడవిలో సూరి నుండి తప్పించుకుని బరంపురం వచ్చేశాడు బెహరా. సూరిని చంపలేకపోయాననే ఆలోచన మనశ్శాంతి లేకుండా చేసింది. అతన్ని హతమార్చి నగరం విడిచి వెళ్ళాలని నిశ్చయించుకు న్నాడు. జీవితంలో తను చేసే చివరి హత్య ని వ్యక్తిగత వ్యవహారంలా పరిగణించాడు.

తెల్లవారుజామున వచ్చి అక్కడ బ్యాగ్ వుంచి వెళ్ళాడు. పని ముగించి ఆయుధం అక్కడే వదిలి ఉత్తచేతులతో వెళ్ళిపోతాడు. మరునాడు ఓ మనిషి వచ్చి వెపన్ కలెక్ట్ చేసుకుంటాడు.

మరికొన్ని సిగరెట్లు తగలేసిన తరువాత కోర్టు కార్యక్రమాలు ప్రారంభమయ్యాయి. సమయం భారంగా కదులుతోంది. బెహరా కదలకుండా కోర్టులోపలికి చూస్తున్నాడు.

సూరి బోనులోకి రావడం కనిపించింది.

ఎడమకాలు కిటికీపైన వేసి, శరీరాన్ని పూర్తిగా వంచి, ఎడమమోచెయ్యి మోకాలుకి ఆనించి, కుడిచేత్తో గన్ అందుకుని పొజి షన్ తీసుకున్నాడు. అప్రోచర్ హోల్ నుండి కోర్టు కిటికీకి అవతల బోనులోని సూరికి గురిపెట్టాడు.

సరిగ్గా అప్పుడు వినిపించింది చిన్న చప్పుడు.

ఉలిక్కిపడి తల వెనక్కి తిప్పాడు బెహరా. ఒక మనిషి గుమ్మంలో నిలబడి కనిపించాడు. అతను టార్గెట్ నెంబర్ త్రీగా గుర్తించి క్షణంపాటు విస్మయంలో మునిగిపోయాడు.

అదే అతను చేసిన తప్పు.

ద్వివేది మెరుపులా కదిలాడు. మూడు అడుగులువేసి గాలిలోకి లేచి బెహరా గుండెలమీద తన్నాడు. కిటికీ దగ్గర నిల బడి వుండటంవల్ల గాలికి కొట్టుకుపోయి నట్లు అవతలికి పోయింది శరీరం. ఎలాంటి ఆధారం లేకపోవడంతో రోడ్డువైపు





దూసుకుపోయి అటుగా వస్తున్న లారీ ముందు పడింది. డ్రైవరు జాగ్రత్తపడేలోపు చక్రాలకింద నలిగిపోయింది తల.

అది చూసి వెనక్కి తిరిగి మెట్లు దిగి వెనుకనుంచి అవతలి వీధిలోకి ప్రవేశించాడు ద్వివేది. ఓ ఆటోలో కూర్చుని బ్యాంక్‌కి వెళ్ళాడు. డబ్బు డ్రా చేసి రైల్వేస్టేషన్ చేరుకుని టిక్కెట్ తీశాడు.

పావుగంటలో ట్రైన్ వచ్చింది.

రెండులక్షల రూపాయలతోపాటు సూరి రుణం తీర్చుకున్నాననే తృప్తి వెంటపెట్టుకుని ఓ కంపార్టుమెంటు ఎక్కాడు.

సూరి కోర్టులో సాక్ష్యం చెప్పి బయటకు వచ్చేసరికి, ఆ ఏరియా పోలీస్‌స్టేషన్‌లో యాక్సిడెంట్ కేసు ఒకటి నమోదయింది. పోలీసులు ఎంత ప్రయత్నించినా ప్రమాదంలో మరణించిన మనిషి వివరాలు తెలియలేదు.



రెండురోజుల తరువాత ఓ లేబర్ కాలనీలోకి వెళ్ళాడు సూరి. ఒక పాకలోకి ప్రవేశించి నులకమంచంపైన వున్న వ్యక్తిని నిశితంగా చూశాడు. యూనిఫాంలో వచ్చిన సూరిని గమనించి భయపడిపోయాడతను. పక్కనేవున్న చెక్కపెట్టెమీద కూర్చుని అడిగాడు.

"సామాన్లు మొయ్యడానికి నిన్నెవరు పంపారు? "

"సుబ్బారెడ్డి మా మేస్త్రీని కలిశాడటసార్! రోజుకి ఐదు వందలు ఇస్తానంటే ఆశపడి వెళ్ళాను"

"గొయ్యి తవ్వి సంచులు తీసినప్పుడు ఏంజరిగింది? "

అతని మొహం తెల్లగా పాలిపోయింది. ఆ వివరాలు సబ్‌ఇన్‌స్పెక్టర్‌కి ఎలా తెలిశాయనే ఆలోచన అతనికి రాలేదు. కాసేపు మౌనంగావుండి గొంతు విప్పాడు.

"ఐదడుగులు తవ్వేసరికి పాలిథీన్ సంచులు కనిపించాయి. వాటిని తీసి గట్టు మీద పెట్టాం. సంచుల్ని చూస్తూ వుండిపో యాడు సిద్ధయ్య. అప్పుడే పెద్ద చప్పుడుతో తుపాకి పేలింది. సిద్ధయ్య కిందపడిపోవడం చూసి మేము పిక్కబలం చూపించాం..."

"ఆ సంచుల్లో ఏముంది? "

"తెలియదు సార్"

"ఇక్కడికెలా వచ్చారు? "

"కనిపించిన బాట పట్టుకుని పరిగెత్తాం. చీకటి పడుతున్నప్పుడు సోంపేట చేరాం. లారీలో బరంపురం వచ్చాం"

తరచితరచి ప్రశ్నించి అతను అబద్ధం చెప్పడం లేదని రూఢీ చేసుకున్నాడు సూరి. రెండోమనిషిని కూడా అదేరోజు ప్రశ్నించి వచ్చేశాడు.

అయితే డబ్బు ఏమయింది?

సూరి బుర్రలో మిగిలిపోయిన ఆ ప్రశ్నకి రెండు సంవత్సరాల తరువాత జవాబు లభించింది. దానితోపాటే తను కోర్టునుంచి వచ్చేముందు యాక్సిడెంట్‌లో చనిపోయింది ఎవరో కూడా.

రూరల్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా చార్జ్ తీసుకున్న కొద్దిరోజులకే ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ నుండి ఓ సమాచారం అందింది సూరికి. ఏజన్సీ గ్రామాల్లో తీవ్రవాదులు నివసిస్తున్నారని, గిరిజనులు సిబ్బంది మీద తిరగబడి కొడుతున్నారని దాని సారాంశం. ఫారెస్ట్‌వారితో వెళ్ళి ఆ గ్రామాలు రైడ్ చెయ్యమని వున్నతాధికారులు ఆదేశించారు.

సూరి తన సిబ్బందితో బయలుదేరాడు. బందికార గ్రామం వరకూ వాహనాల్లో వెళ్ళి అక్కడనుంచి కాలి నడకన మిణిఅపాయు చేరి గ్రామాన్ని చుట్టుముట్టారు.

గ్రామంలో ఇళ్ళు కొత్తగా నిర్మించినట్టు విశాలంగా వున్నాయి. చెత్తాచెదారం లేకుండా పరిసరాలు శుభ్రంగా కనిపిస్తున్నాయి. గ్రామం మధ్యలో బోర్‌వెల్ ఒకటివుంది. రెండు సంవత్సరాలకాలంలో మార్పు గమనించి సంతోషించాడు సూరి.

పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ వారి దగ్గరకు వచ్చాడు దివుడు సావోతా. సూరిని గుర్తుపట్టి ఆవేశాన్ని నిగ్రహించుకున్నాడు.

"అడవి నరికిపారేస్తూ సిబ్బంది గ్రామానికొస్తే కొడుతున్నారట. ఎందుకని? " దివుడ్ని అడిగాడు ఫారెస్ట్ అధికారి.

కోపంగా చూశాడు దివుడు సావోతా.

"మేం పుట్టింది ఇక్కడ, గిట్టేది ఇక్కడే! అడవి తల్లిని నమ్ముకుని బతికేటి పేదలకు తుప్పలు, డొంకలు నరికి వ్యవసాయం చేసి జీవించే హక్కుంది. ఎవరికీ సమాధానం చెప్పేపని లేదు"

"అడవి కొట్టడం, కలప అమ్మడం నేరం! చట్టాన్ని అతిక్రమిస్తే జైలుకి పంపుతాను" కుర్రవాడైన ఆ అధికారి తీవ్రంగా హెచ్చరించాడు.

దెబ్బతిన్నట్టు చూశాడు దివుడు. మొహం కందగడ్డలా తయారయింది.

"పెంచుకున్న కోళ్ళు, కూడబెట్టిన రూపాయలు మీకిస్తే అప్పుడు అడవి కొట్టడం నేరంకాదు. విప్పసారా తాగిన మిమ్మల్ని మా ఆడాళ్ళతో సరసం చెయ్యనిస్తే అప్పుడు మీకు చట్టం గుర్తురాదు. ఏడాది కష్టించిన పంట సంతలో తెగనమ్మి మీకోసం వాసన బియ్యం కొనుక్కొచ్చి దాయాలి. మేం మామిడి టెంకల్లోని జీడి ఎండబెట్టి ఆ పిండితో గంజికాసుకుని తాగి బతకాలి. ఇంకెంత కాలం మా రక్తమాంసాలు తినేస్తారు? ఇకనైనా మమ్మల్ని మనుషులుగా చూడండి. బతకనివ్వండి"

ఆ మాటలు తూటాల్లా తాకి ఫారెస్ట్ అధికారి ముఖం వివర్ణమైంది. అసలు మాటలే తెలియని అడవి మనిషి కుండబద్దలుకొట్టినట్టు మాట్లాడేసరికి దిక్కుతోచలేదతనికి.

పరిస్థితి గ్రహించాడు సూరి.

"దివుడు సావోతా! ఘర్షణ పెట్టుకోవడానికి, మిమ్మల్ని అన్యాయంగా జైలుకి పంపడానికి మేము రాలేదు. ప్రభుత్వ వ్యతిరేకు





లకు మీరు ఆశ్రయం కల్పించినట్టు మాకు సమాచారం వచ్చింది. మాతో సహకరించి ఇళ్లు చూపించు" అనునయంగా అన్నాడు సూరి.

ఆ మాటలు ఆవేశాన్ని తగ్గించడంతో తలూపాడతను.

ఒక్కొక్క ఇల్లు దగ్గిరుండి చూపించాడు దివుడు. నక్కగోతుల్లాంటి గుడిసెల స్థానంలో గాలి, వెలుతురు వచ్చేలా కిటికీలు అమర్చి ఇళ్లు కట్టుకున్నారు.

ఇంటి లోపల శుభ్రంగా వుంచుకున్నారు. మట్టిపాత్రలకు బదులు లోహ పాత్రలు వుపయోగిస్తున్నారు. వారి జీవన విధానంలో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది తేడా. పరాయి మనుషుల్ని చూసి పలాయనం చిత్తగించే కోందులు నేడు అధికారుల్ని నిలదీస్తున్నారంటే ఆ తేడా చిన్నదేం కాదు.

ఇళ్లన్నీ గాలించి నీరసపడ్డాడు ఫారెస్టు అధికారి. ఆ రాత్రి అక్కడే బసచేసి సిబ్బంది వంట ప్రయత్నం చేస్తుంటే వారించి అందరికీ భోజనాలు తయారుచేయించాడు దివుడు సావోతా. అర్ధరాత్రి వరకూ సూరితో ముచ్చటిస్తూ వుండిపోయాడు. ఒకప్పుడు ఆస్పత్రి అనే మాటకి అర్థం తెలియనివాడు నేడు ఎన్నో విషయాలపట్ల అవగాహన వున్న మనిషిలా మాట్లాడుతున్నాడు.

ఉదయం అందరూ మిటిం గ్రామం వైపు సాగిపోయారు. ఫారెస్టు అధికారి మొహం అప్పటికే కళ తప్పింది. దివుడు సావోతా మాటలకంటే సిబ్బంది తనకి తప్పుడు సమాచారం ఇచ్చారనే ఆలోచన అతన్ని క్రుంగదీసింది.

అందరూ కొండమీద ఆగి మిటిం గ్రామం వున్నవైపు చూశారు. అక్కడ గుడిసెలు లేకపోవడంతో సూరికి విస్మయం కలిగింది.

ఒకదాని ప్రక్కన ఒకటి నాలుగు వరుసల్లో గుడిసెల స్థానంలో పక్కా గృహాలున్నాయి. గ్రామానికి నాలుగువైపులా పచ్చటి తోటలు కనిపిస్తున్నాయి. కొండపై నుంచి చూస్తుంటే చెయ్యితిరిగిన చిత్రకారుడి రంగుల కలబోతతో రూపమిచ్చిన వర్ణ చిత్రంలా వుంది మిటిం గ్రామం.

సూరి తేరుకుని ఫారెస్టు అధికారిని అడిగాడు.

"అక్కడ ప్రభుత్వం ఇళ్లు కట్టించిందా? "

"లేదు"

కొండ దిగి మిటిం గ్రామాన్ని చుట్టుముట్టారు. వారి చర్యల్ని కొందరు కోందులు ఆశ్చర్యంగా చూడసాగారు. కుక్కలు మొరగడంతో సందడి మొదలయింది.

"నమస్కారం సార్"

ద్వివేదిని చూసి ఆశ్చర్యపడ్డాడు సూరి.

"నువ్వు ఇక్కడే వున్నావా? "

"ఈ గ్రామం పిల్లని చేసుకున్న తరువాత తప్పదుకదా! రండి... కూర్చుని మాట్లాడుకుందాం" ఆహ్వానించాడు ద్వివేది.

"డ్యూటీ"

"సిబ్బంది చేస్తారు... మీరు రండి"

ద్వివేదిని అనుసరించాడు సూరి. ఒక ఇంటి దగ్గరున్న కుర్చీల్లో ఇద్దరూ కూర్చున్నారు. ఫారెస్టు అధికారి ఇళ్లు సోదాచేసే పనిలో మునిగిపోయాడు.

ఇంటికీ ఇంటికీ మధ్య ఖాళీ వదిలి కట్టారు. ప్రతీ గృహం ముందు గెలలు దిగిన అరటి చెట్లు, వెనుక భాగంలో కొబ్బరి చెట్లు వున్నాయి. కాస్త ఎడంగా రెండు ఇళ్లకు స్కూలు, హాస్టల్ అనే బోర్డులు వేలాడుతున్నాయి. గ్రామం అలా తయారు చెయ్యడానికి ఎంతో శ్రమించి వుండాలి.

"కోందులు ప్రభుత్వ అధికారుల్ని ఎదిరిస్తున్నారని, తీవ్రవాదులకు ఆశ్రయం కల్పిస్తున్నారని సమాచారం వచ్చింది. దివుడు సావోతా మాటలు విని అందులో కొంత నిజం వుందని గ్రహించాను. అమాయకులైన కోందులు అలా తయారు కావడానికి కారణం ఎవరు? " అడిగాడు సూరి.

ఆ మాటలు ఖండిస్తున్నట్టు తల అడ్డంగా వూపాడు ద్వివేది.

"కోందులు తమ హక్కుల గురించి ప్రశ్నించడం, ఎదిరించడం కాదు. అధికారులు వస్తే ఒకప్పుడు వంగివంగి దండాలుపెట్టి మేము మీ బానిసలమని తెలియజేసేవారు. వారి అమాయకత్వానికి జాలిపడాల్సిన అధికారులు కాళ్లు పట్టించుకునేవారు. ఇప్పుడు తమ జాతి కూడా మనుషుల జాతేనని గుర్తించి నిటారుగా నిలబడి నమస్కారం చేస్తున్నారు. అది జీర్ణించుకోలేక కొంతమంది అసత్య ప్రచారం చేస్తున్నారు"

"ఈ గ్రామంలో ఇళ్లు ఎవరు నిర్మించారు? "

"కోందులే కట్టుకున్నారు"

"డబ్బెక్కడిది? "

"వారిదే... ఈ గ్రామంలో నివసించేవారికి స్వంత ఆస్తిలేదు. పండించే పంట గ్రామం తీసుకుంటుంది. సంవత్సరానికి సరిపడే తిండి గింజలు గ్రామం వారికి ఇస్తుంది. వైద్య సదుపాయం, పిల్లలకి విద్య వంటి విషయాలు గ్రామం చూసుకుంటుంది"

విభ్రాంతిగా చూశాడు సూరి.

"ఎవరికీ డబ్బు అవసరంలేదా? "

"అవసరాలన్నీ తీరుతుంటే డబ్బుతో పనేముంటుంది? "

పుట్టుకతోనే మనిషి తన వ్యక్తిత్వాన్నంతటినీ ప్రదర్శించలేడని, ఒక్కొక్క కోణం ఒక్కో సందర్భంలో బయటపడుతుందని ఎప్పుడో చదివిన వాక్యాలు గుర్తొచ్చాయి సూరికి.

ఇంతలో హోర్గుణ సావోతా వచ్చి సూరిని గుర్తుపట్టి అడిగాడు,

"దొరా! ఎట్టున్నావు? "

"బాగున్నాను. మీరెలా వున్నారు? "

అతను ద్వివేది వైపు చూశాడు.

"ఈ చిరుత గ్రామానికి వచ్చింది మొదలు విప్పసారా, నెమలిపిట్ట మాంసం రుచిచూడలేదు" అని ఈటె గుమ్మానికి చేరవేసి లోపలికి పోయాడు.

సూరి నొసలు ముడిపడింది. రెండు సంవత్సరాల నుంచి మనసులో వేధిస్తున్న ప్రశ్నకి సమాధానం బుర్రలో తళుక్కున మెరిసింది.

"డబ్బు ఎలా దొంగిలించావ్? " ద్వివేదిని అడిగాడు సూరి.

అతను చిన్నగా నవ్వాడు.

"హోర్గుణ సావోతా, పుబులి నాకోసం సూదికొండ దగ్గరకు వచ్చారు. ఎలాగైనా ఆ సంచులు తస్కరించమని వారికి చెప్పాను. ఆ పనిమీద వెళుతున్నప్పుడే చెట్టుకి కట్టేసిన మిమ్మల్ని విడిపించారు" ఆగి ఓ క్షణం తరువాత తిరిగి చెప్పాడు.

"ఆ డబ్బుతో ప్రతీ గ్రామంలో బోరు తవ్వించాను. నాలుగైదు గ్రామాలకు ఒక స్కూలు కట్టించాను. ప్రాథమిక వైద్యం అందరికీ అందుబాటులోకి తెచ్చాను. సంవత్సరానికి ఒక గ్రామం దత్తత తీసుకుని తీర్చిదిద్దే పథకాలు నావద్దున్నాయి. మీరనుకున్నట్టు ఇక్కడ తీవ్రవాదులు లేరు. గిరిజన చైతన్యం మాత్రమే వుంది"

ఇంతలో ఇంట్లోంచి వచ్చిన పుబులి ఓ గ్లాసు సూరికి ఇచ్చింది. ఆ గ్లాసులోని టీ చూసి అతని ముఖం ప్రసన్నంగా మారిపోయింది. పుబులి వెంట వచ్చి ఆమె చాటున దాక్కున్నారు ఇద్దరు పిల్లలు.

"నీ పిల్లలా? "

తలూపి చెప్పాడు ద్వివేది.

"కవల పిల్లలు"

"కాదు దొరా! పులి పిల్లలు" బయటకొస్తూ అన్నాడు హోర్గుణ సావోతా.

ఫారెస్టు అధికారి నల్లబడిన మొహంతో అక్కడకొచ్చాడు. ద్వివేది మరో కుర్చీ తెచ్చాడు.

"ఏమయింది? " సూరి అడిగాడు.

"మావాళ్లు తప్పుడు సమాచారం ఇచ్చారు. ఒక గార్డు అడవిలో కోందుపడుచుని అడ్డగిస్తే గ్రామస్తులు అతనికి దేహశుద్ధి చేశారు. అదే విషయం మరోలా చెప్పాడు" చెప్పి పుబులి ఇచ్చిన టీ గ్లాసు అందుకున్నాడు.

ఆ రాత్రి అతిథులకు మిటింగ్రామం విందు చేసింది.







# 'చీకటిలో చందమామ' పై సమీక్షలు

డిసెంబరు 'చతుర'లో ప్రచురితమైన మందపాటి సత్యం రచన
'చీకటిలో చందమామ'పై మాకందిన ఉత్తమ సమీక్షలు



## అద్భుత చిత్రణ

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

నేనో మోస్తరు రచయితను. పాత్రలను సృష్టించడం, వాటితో రకరకాల విన్యాసాలను చేయించడం, అన్ని వికారాలను ఆ పాత్రలకు ఆపాదించడం నా కలవాటే.

అంతే కాకుండా ఉద్యోగరీత్యా నా విధి నిర్వహణలో ఖచ్చితంగా వ్యవహరించాల్సి ఉంటుంది కాబట్టి నిర్మొహమాటంగా ప్రవర్తించగలను.

ఈ రెండు లక్షణాల మూలంగా నాలోని సున్నితత్త్వం మొద్దుబారిపోయిందనిపిస్తుంది నాకే. అందుకే ఏదైనా చదవడం మొదలుపెట్టగానే రచయిత నాడి తెల్సిపోయి ఓ పేలవమైన అభిప్రాయం ఏర్పడుతుంది నాలో.

'చీకటిలో చందమామ' నవల రాజు అనారోగ్యం అన్న కథాంశంతో, బేర్ ఫాక్ట్స్‌తో, సాధారణంగానే మొదలవుతుంది. రాజు అనారోగ్యం ముదురుతున్న కొద్దీ అతను, సరోజ, అతని స్నేహితులు ఏవిధంగా ఆందోళన చెందారో అదేవిధంగా నేనూ కలవరపడ్డాను. రాజు ఇక బతకడన్న విషయం సరోజ, రాజు ధైర్యంగానే తీసుకున్నా నా గుండె మాత్రం చెరువయింది. కొట్టాయం నుంచి ఉన్నిక్రిష్ణన్ తెప్పించబోయే మందు మూలంగానైనా చివరివరకైనా రాజు తాను బతుకుతానన్న నమ్మకంతో ఉండి కూడా తన చావు గురించి తాను చేసుకునే ప్రయత్నాలను రచయిత వర్ణించినపుడు నేను చలించలేదు. కానీ రాజు ఇక లేడు అని చదివాక, మళ్ళీ వెనక పేజీలు తిరిగేస్తే, గుండెలు నులిమేసినట్టయింది. ఏదో అవ్యక్తమైన బాధ గుండెల్లో సుళ్ళు తిరిగి గొంతుకు అడ్డంపడి విలవిలలాడాను.

కృష్ణశాస్త్రి కవిత, 'గీత'సారం కలిసి మన సును కలిచివేసింది. రాజు మరణం కుటుం బంలోని అప్పుడి ఎడబాటుగా తోచింది. మరుగున పడిపోయి, మరి లేదనుకున్న ఆర్ద్రత ఉప్పొంగింది. నవల చదివినంత సేపు ఎన్ని కన్నీళ్ళు కార్చానో లెక్కలేదు. ఇట్లాంటి సబ్జెక్ట్‌మీద ఓ కథో, నవలో రాయాలని ఎన్ని సార్లో అనుకున్నాను. కానీ నేను రాయగలిగేదాని కన్నా ఎన్నోవేల రెట్లు రాజు మరణయాతన, అతని భార్యా పిల్లలు అప్పుడప్పుడు ధైర్యంగా, అప్పుడ ప్పుడు బేలగా ప్రవర్తించడం, యాంత్రికత నిండిన అమెరికా నగరంలో మానవత్వపు మొలకలుగా స్నేహితులు, అపరిచితులు ఆదుకోవడం వంటి విషయాలు అద్భు తంగా చిత్రించిన రచయితకు అభినంద నలు తెలియచేస్తున్నాను.

–ప్రభాకర్ జైని
వరంగల్-506007.

## అనూహ్య స్పందన

*(ద్వితీయబహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

**పా**త్రలకుమల్లే పాఠకులను కూడా తన నవలాపఠనానికి మానసికంగా సిద్ధంచేసేసి మరీ చదివించగలిగారు 'చీకటిలో చంద మామ' రచయిత మందపాటి సత్యంగారు.

ప్రపంచ ప్రఖ్యాతమైన అమెరికాలోని హ్యూస్టన్ ఆస్పత్రిలోనే రాజు అరుదైన కాన్సర్‌కు మూలమేంటో అంతుచిక్కలేదు. అయితే అమెరికాలో 'అతి'(?) పరిశుభ్ర మైన జీవితానికి అలవాటుపడి, ఎప్పుడో ఇండియా వెళ్ళి ఉన్న కొన్ని రోజుల్లో అక్కడి 'అంతగా శుభ్రతలేని' ఆహారంతోనే అనా రోగ్యం ఆరంభమవుతోందని రచయిత నర్మ గర్భంగా చెప్పటం... మరీ అతిశయోక్తిలా గోచరిస్తుంది. అయితే సురేష్ పాత్రద్వారా "మనల్ని అమెరికాలోని ఈ శుభ్రత పాడు చేసింది. అతి శుభ్రతవల్ల అన్ని రకాల బాక్టీ రియాలు నశించి, శరీరంలో ఇమ్యూనిటీ తగ్గి... రోగాలొస్తున్నాయి" అని రచయిత వివరణ యిచ్చారు. అది వేరేసంగతి.

కంప్యూటర్, సాఫ్ట్‌వేర్‌లాంటి సాంకేతిక పర విజ్ఞానప్రగతిలో అమెరికా, ఆత్మ-పర మాత్మల అద్వితీయ సంబంధంతో భారత దేశం... వెరసి ఈ రెండు దేశాల జీవనవి ధానాలకు అలవాటుపడ్డవారి ఆలోచనా సర ళిని, కష్టసుఖాల్లో వారి అనూహ్య స్పందన లను రచయిత కళ్ళకు కట్టినట్లు చూప టంలో సఫలీకృతులయ్యారు.

ఎక్కువ సెలవులవలన ఉత్పత్తులు తగ్గి, కంపెనీలు ఆర్థికంగా దెబ్బతిని తద్వారా ఉద్యోగాలు తగ్గి, క్యాష్ సర్క్యులేషన్ తక్కువై, వినియోగదారుల కొనుగోలు శక్తి తగ్గి... ఫలితంగా దేశ ఆర్థికస్థితి దిగజా రటం వంటి విషయాలను ఈ నవల ద్వారా మనదేశ ఉద్యోగవర్గాలకి తెలుసు కునే అవకాశం లభించింది. నవలలో భార్య సరోజకు రాజు ఒక సందర్భంలో 'సెలవుల దుష్పరిణామా'ల గురించి చక్కగా తెలియ జెప్పిన తీరు ఎంతగానో నచ్చింది.

అమెరికా వైద్యసిద్ధాంతాల ప్రకారం చావ బోయే రోగిని, సంబంధీకులను డాక్టర్లు అందుకు మానసికంగా సిద్ధంచేసేయటం ఒక కోణంలో సమంజసం కావచ్చు. అయితే రోగి, అతని కుటుంబసభ్యులు, స్నేహితులు ఆ కాన్సర్ చావుకు అంత స్పీడ్‌గా మానసికంగా తయారైపోవటం... కాస్త సత్యదూరంగానే తోస్తుంది.

ఇదిలాఉంటే తెలుగు సినిమా క్లయిమా క్స్‌లో పోలీసుల ప్రవేశంలా రాజు కాన్సర్‌కు ఉన్నిక్రిష్ణన్ ఆయుర్వేద మందు 'హీరో' ఆఖరి ఘడియల్లో అందేలా జేసిన రచయిత సమయస్ఫూర్తిని కొనియాడకుండా ఉండలేం. ఆత్మవిశ్వాసంతో మృత్యుకోరల నుండి విముక్తి పొందవచ్చని, ఆయుర్వేద




ఔషధాలూ... అంతుచిక్కని రోగాలను నయంచేశాయని పేర్కొంటూ, 'ఇహ... రాజు, బతుకుతాడు' అని పాఠకులను ఊరించి, భ్రమించి... భగవద్గీత మరణ కాల అమూల్యశ్లోకంతో, తనదైన శైలిలో ముగింపునిచ్చిన రచయిత రచనాశక్తి గొప్పదే.

ఏదేమైనా... వైద్యపర విజ్ఞానంతో నవలనందించిన రచయితకు శుభాకాంక్షలు.

యం. లక్ష్మి
కరంజి-504312

## 'థ్రిల్' లేని నవల

*తృతీయ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'చీకటిలో చందమామ' నవలా రచయిత పాఠకులకు ఏమి చెప్పదలుచుకున్నారో స్పష్టంగా తెలియజేయలేదు. నవల చాలా సాదా సీదాగా సాగింది. ఎంతసేపూ అమెరికాలోని రాష్ట్రాలను, వాటి మధ్య దూరాన్ని, వాటి రోడ్లను, పాత్రలమధ్య నడిచిన ఫోన్ల సంభాషణలు వివరించడానికే సరిపోయింది. "మనిషి ఎక్కడ బతుకుతున్నాడన్నది ముఖ్యం కాదు, ఎలా బతుకుతున్నాడన్నదే ముఖ్యం". ఊరట కలిగించే అంశమేమిటంటే దేశంకాని దేశంలో, మనదేశంలోని ఏ మారుమూల (రాష్ట్రం) ప్రాంతం నుండి వెళ్ళిన వారైనా కలిసికట్టుగా, ఒకరికొకరు పూర్తి సహాయసహకారాలతో జీవించడం, స్నేహపూర్వకంగా, సోదరభావంతో కలిసిమెలిసి ఉండడం. ఇక్కడ సాధ్యంకాని "భిన్నత్వంలో ఏకత్వం" అక్కడ పాటించడం నిజంగా వారి 'ఇన్‌సెక్యూరిటీ'ని తెలియజేస్తుంది.

ఏ నవలైనా చదువుతున్నంతసేపూ ముగింపు గుప్తంగా ఉండి, కథ అనుకోని మలుపులు తిరుగుతూ సాగితే రసవత్తరంగా ఉంటుంది. కాని ఈ నవల ముగింపు రాజు మరణమేనని, దానికి ముందు అతని భార్య సరోజ, కూతురు వినీతల ఆవేదన, వారిని అతని అంతిమ యాత్రకు సర్వసన్నద్ధులను గావించడం, మధ్యలో ప్రకాష్, కమల, సురేష్, సంధ్య, నారాయణ, శ్యామలల పరామర్శలు, వారి సహాయసహకారాలు అంతా సరైన సరళిలో ఉన్నప్పటికీ కథకి పటుత్వం లేదు. అయితే జననం ఎంత సహజమో మరణం కూడా అంతేనని, కర్మ చేయడమే మానవుని ధర్మమని దాని ఫలితాన్ని తనకు వదిలేయమని అన్న శ్రీకృష్ణభగవానుని అమృతవాక్యాలను పాటించిన నాడు ప్రతిమనిషి జీవితం ఆనందమయంగా ముగుస్తుంది. రచయిత చెప్పాలనుకున్నది ఇదేనేమో.

అమెరికాలోని డాక్టర్లయొక్క దాపరికం లేని ప్రవర్తన, వృత్తియందు వారికున్న నిజాయితీని, ఉద్యోగస్తుల సిన్సియారిటి మొదలైన వివరణలు తప్ప నవల అంతగా రుచించలేదు.

-యం. చిన వెంకటరావు
మహాదేవపురం-507 203

## గొప్ప పాత్ర

*(నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

"జాతస్య మరణం ధృవం" అని గీత చెప్తోంది. అయితే ఈ "ధృవం" ఎప్పుడు ధృవపడ్తుందీ అన్నది చెప్పలేం. చావు, అమెరికన్స్, ఇండియన్స్ అనే మూడింటినీ ముడివేసి చక్కగా అల్లిన నవల 'చీకట్లో చందమామ'. అమావాస్య రాత్రి కూడా చందమామను తన దృఢ మనోనేత్రంతో చూడగల పాత్ర 'రాజు'ది. ఈ చందమామ చుట్టూ తిరిగే తక్కిన తారలు సరోజ, వినీతా, రాజు స్నేహితులూ వగైరా.

ఫ్యూనరల్ హౌస్‌కి ఫోన్‌చేసి తన క్రెడి

ట్ కార్డ్‌తో తన చావుకు తానే సర్వ సన్నాహాలు చేసుకున్న రాజు మనోనిబ్బరం గణనీయం. అయితే ఎంతమందికి వాస్తవంలో ఇది సంభవం అన్నది సందేహమే. కాన్సర్ వంటి వ్యాధితో మూడు నెలలే తన జీవిత కాలం, అన్ని నెలలే తన సెలవు కూడా అనుకొని, సైలంట్‌గా భార్యనీ, పిల్లనీ, స్నేహితుల్నీ, అందుకు మెంటల్‌గా ప్రిపేర్ చేయగల రాజు పాత్ర గొప్పది. నవల ప్రారంభిస్తే ఆఖరి వరకూ చదివించేటట్లుంది.

అయితే అందరూ రాజులాగ 'చీకట్లో చందమామ'ను చూడగలరా?

—వి. లలితాంబ
సీతంపేట -53443

## నిత్యసత్యం...

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

'ఏరుదాటినా, ఊరుదాటినా, ఖండాంతరాలు దాటినా పుట్టిన ప్రతి ప్రాణి గిట్టును' అని గీతలో శ్రీకృష్ణ పరమాత్ముడు చెప్పినట్లు మనిషి ఎంత చదివినా, ఎంత సాధించినా మృత్యువును జయించలేడన్న ఒక నిత్య సత్యాన్ని చక్కగా అర్థవంతంగా తెలిపారు రచయిత మందపాటి సత్యం.

నవల ప్రారంభంనుంచే రాజు అనారోగ్యంతో కాకుండ కాస్త మధ్యస్థంలో అతడి అనారోగ్యాన్ని ప్రారంభిస్తే బావుండేదేమో. ఇండియాలో ఇండియన్స్‌లో లేని ఐకమత్యం, స్నేహసౌభ్రాతృత్వం అమెరికాలోని ఇండియన్స్‌లో ఉండడం కనీసం ఇండియన్స్ ప్రగతిలోని ఒక లక్షణం. మామూలుగా ఎలాంటి జబ్బులైనా అమెరికాలో అయితే నయమౌతాయి. అనే ఇండియన్స్ అపోహ ఈ నవల చదివితే తొలగిపోతుంది. ఇండియాలో డాక్టర్లు కార్యసాధకులు కానట్లు, అమెరికాలో మాత్రమే డాక్టర్లు కార్యసాధకులైనట్లు భావించే పాఠకులకు మేల్కొలుపు ఈ చీకటిలో చందమామ నవల. అలాగే రాబోయే మరణాన్ని జయించాలని రాజు, సరోజ పడే పాట్లు చదివేటపుడు పాఠకులు నిజంగానే చాలా బాధకు గురి అవుతారు.

నేరుగా పేషెంట్‌తోనే డాక్టర్లు అతడి జబ్బు గురించి మాట్లాడటం నిజంగా అభినందించవలసిన విషయమే. పేషెంట్‌కు ఉన్న కాస్త సమయం మభ్యపెట్టడంలోనే కరిగిపోతే అతడు చేయాల్సిన పనులు చక్కపెట్టుకోడానికి ఆస్కారం ఉండదు. రోగి తన తదనంతరం చేసుకోవాల్సిన పనులకు డాక్టరు నిజం చెప్పడమే మంచి మార్గం. అలాగే వినీతతో తండ్రి రాజు జబ్బు గురించి సుధ వివరించిన విధానం ఎంతో బావుంది. పిల్లలు భయపడతారు అని నిజాన్ని దాచడంకంటే యిలా వివరించడమే మంచి పద్ధతేమో! రాజుకు వచ్చిన జబ్బు వివరాలు, డాక్టర్లు చేసే చికిత్సలు, శస్త్రచికిత్సలు చాలా చక్కగా రాశారు రచయిత.

అమెరికా నేపథ్యంగా ఎన్నో సినిమాలు నవలలు వచ్చినా ఇంతచక్కగా ఏ నవలలో మేము అమెరికా గురించి తెలుసుకోలేదు. చికాగోలో వెంకటేశ్వరస్వామి టెంపుల్ గురించే తప్ప హ్యూస్టన్‌లో మీనాక్షి టెంపుల్ గురించి మాకు తెలీదు. మీనాక్షి, దాని అనుబంధ టెంపుల్స్ గురించి, అమెరికా జీవన విధానాన్ని గురించి, క్లైమేట్ గురించి మాకు తెలీని ఎన్నో విషయాలు తెలియచేశారు రచయిత సత్యం.

అనివార్యమైన చావు, దానిని ఆహ్వానించాల్సిన పద్ధతి, రోగి తర్వాత ఎలా తట్టుకోవాలి అనే విషయాల్ని చక్కగా తెలిపారు రచయిత. జీవిత సత్యానికి మరో పేరు 'చీకటిలో చందమామ' నవల.

—డా.ఎమ్.ఎస్. జ్ఞానేశ్వర్
మదనపల్లి-517325




# చతుర ప్రపంచం

## మనిషికి బలైన కకాపు పక్షి

మానవుడి కారణంగా ప్రపంచంలో ఎన్నో రకాల పక్షులు కనుమరుగవుతున్నాయి. వాటిలో ఒకటి న్యూజిలాండ్‌లోని కకాపు. కకాపు అంటే ప్రాంతీయ భాషలో చీకటి చిలుక అని అర్థం. కారణం అవి పగలు బయట కనపడవు. కేవలం రాత్రుళ్లే విహరిస్తాయి.

60-70 ఏళ్లదాకా జీవించే ఇవి ఒకప్పుడు న్యూజిలాండ్‌లో లక్షల సంఖ్యలో వుండేవి. అయితే 1000 ఏళ్ల క్రితం పోలీనేసియాన్ జాతికి చెందిన మనుషులు న్యూజిలాండ్‌కి వచ్చారు. తేలిగ్గా వేటాడగలిగే, వేగంగా ఎగరలేని ఈ చీకటిచిలకలని వాళ్లు ఆహారం కోసం వేటాడసాగారు. వాటి రెక్కలు కూడా అలంకారంగా ఉపయోగించేవారు. దాంతో క్రమేపీ వాటి సంఖ్య తగ్గసాగింది.

14వ శతాబ్దంలో యూరోపియన్స్ న్యూజిలాండ్‌లో కాలు పెట్టాక అడవులని నరికి ఇళ్లు కట్టడంతో కకాపుల సంఖ్య ఇంకా తగ్గింది. 1970లో ఈ పక్షి పూర్తిగా అంతర్థానమైందని తెలుసుకొని కళ్లు తెరిచారు. దానికోసం తీవ్ర ప్రయత్నం చేస్తే అదృష్టవశాత్తు 1977లో దక్షిణ భాగంలోని స్టీవర్డ్‌లేండ్‌లో కకాపు పక్షులు కొన్నిటిని కనుగొన్నారు.




అయితే అక్కడి పిల్లులు వీటిని స్వేచ్ఛగా తినడం గుర్తించారు. 1982లో ప్రభుత్వం 22 కకాపులని లిటిల్ బేరియల్ ఐలండ్స్‌కి, 1987లో మరో 29 పక్షులని కాడ్‌ఫిష్ ఐలండ్‌కి తీసుకెళ్లి వదిలింది.

అక్కడ వీటి సహజ శత్రువులైన పిల్లుల్లేకుండా జాగ్రత్తపడ్డారు.

బాతు పరిమాణంలోవుండే ఈ పక్షి 2.5 నించి 3.5 కిలోల బరువుంటుంది. తడవకి



ఒకటినించి నాలుగు గుడ్లు పెడుతుంది. అయితే బరువువల్ల వేగంగా ఎక్కువ దూరం ఎగరలేని తల్లిపక్షి పొదిగిన తర్వాత పిల్లలకి ఆహారాన్ని సరఫరా చేయలేదు. న్యూజిలాండ్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ కన్సర్వేషన్ అధికారులు ఆ పిల్లలను సంరక్షిస్తున్నారు. ఇందుకు వీలుగా ప్రతీ కకాపుకి 30 గ్రాముల బరువుండే రేడియో ట్రాన్స్‌మీటర్‌ని అమర్చారు. ఆ రేడియో తరంగాలని బట్టి చలికాలం చివర్లో అవి ఎక్కడున్నా వాటిని కనుక్కుని అవి పొదిగిన పిల్లలని శ్రద్ధగా పెంచుతున్నారు. లేదా గుడ్లని జూలకి తరలించి ఆర్టిఫిషియల్ యంత్రాలతో ఆ గుడ్లని పొదిగి పిల్లలను పెంచుతున్నారు.

ఈ పక్షులు ఎంత రహస్యంగా దాక్కోగలవంటే మనిషి వీటి వునికిని కనుక్కోలేడు. అందువల్ల వీటిని వాసననిబట్టి కనుక్కునే శిక్షణ ఇచ్చిన ఆల్సేషియన్ కుక్కలని ఈ ప్రాజెక్ట్‌లో ఉపయోగిస్తున్నారు.

వెల్లింగ్టన్, ఆక్‌లాండ్ జూలలో వీటిని పెంచుతున్నారు. వీటి సంఖ్య కనీసం 500లకి చేరుకుంటే ఎండ్ బర్డ్ స్పీషీస్‌లిస్ట్ లోంచి వీటిని తీసేయవచ్చు

## మంచు మమ్మీలు

ఆండియన్ పర్వతాగ్రంలో ఈ మధ్యనే ముగ్గురు పిల్లల మృతదేహాలు దొరికాయి. అవి 500 సంవత్సరాల క్రితం చనిపోయిన వారివి. అయితే అవి ఒంటిమీద ఆభరణాలతో సహా చెక్కుచెదరకుండా వుండటం విశేషం.

అర్జెంటీనాలో లభించిన ఈ ఐస్ మమ్మీలు ఇంతవరకూ ప్రపంచంలో భద్రపరచబడిన మమ్మీలన్నిటిలోకీ తాజాగా ఉన్నాయంటున్నారు పరిశోధకులు. ఈ మూడింటిలో రెండు అమ్మాయిలివి, ఒకటి అబ్బాయిది. వీరి వయసు 8, 15 సంవత్సరాల మధ్య వుండొచ్చునంటున్నారు. ఆ కాలంలో పెరూలోని ఇన్‌కాక్ రాజ్యానికి సంబంధించిన ప్రజలు వారి దేవతలకి నరబలులను ఇచ్చేవారు. బలి ఇవ్వవలసిన వ్యక్తిని ఎత్తైన పర్వత శిఖరాగ్రానికి తీసుకువెళ్ళి వదిలేసేవారు. సముద్ర మట్టానికి 27,057 అడుగుల ఎత్తులో వున్న పర్వతాగ్రంపై ఆక్సిజన్ అందటం కష్టం. అలా ఆ బలి జరిగేది. ఈమధ్య 9 మంది ఆర్కియాలజిస్టులు



గంటకు 70 మైళ్ళవేగంతో వీచే గాలులను, భయంకర విషకీటకాలను లెక్కచెయ్యకుండా ఈ పర్వతాగ్రానికి చేరుకుని అక్కడ మంచులో కూరుకుపోయిన మమ్మీలను వెలికి తీశారు. నిజానికి ఈ పర్వతాగ్రం ఎవరెస్ట్ శిఖరంకన్నా 6,971 అడుగులు తక్కువే. అయినా ఇక్కడి వాతావరణానికి మెదడు ఉబ్బిపోయి, ఊపిరితిత్తులలో ఫ్లూయిడ్స్ పేరుకుపోయి క్షణాల్లో మృత్యువాత పడతారు.

నేషనల్ జాగ్రాఫికల్ సొసయిటీవారు స్పాన్సర్ చేసిన అమెరికన్ -అర్జెంటెయిన్ - పెరూలియన్ ఎక్స్‌పెడిషన్- 1983 నుంచి ఇప్పటివరకూ ఈ పర్వతంనుంచి 16 మమ్మీలను వెలికితీసింది. ఇవి ఐస్‌లో గడ్డకట్టి వున్నాయి. పర్వతాగ్రాల్లో పేరుకుపోయిన మంచును బాగా తవ్వి, ఒక మనిషిని తలకిందులుగా లోపలికిదింపి కాళ్ళు పైనుంచి పట్టుకుని ఈ మమ్మీలను బయటికి లాగించారు. వాటిని ఫోమ్‌లో చుట్టి అతి భద్రంగా కిందకు తెచ్చారు. పైన చెప్పిన ముగ్గురు పిల్లల మృత దేహాలపై నూనూగు వెంట్రుకలు కూడా ఎంతో తాజాగా కనిపించాయంటున్నారు శాస్త్రజ్ఞులు. ఇంకా లోపలి భాగాలు ఎలా వున్నదీ స్కానింగ్ చేయాల్సి వుందంటు

---

## నక్షత్రం పుట్టుపూర్వోత్తరాలు

పశ్చిమ ఆఫ్రికాలో డాగన్ అనే ఓ కొండ జాతి వుంది. ఈ తెగ కొన్నివేల సంవత్సరాల క్రితం ఈజిప్టునుంచి వచ్చి ఇక్కడ స్థిరపడిందంటారు. వీరు అనుసరించే పురాతన జ్యోతిశ్శాస్త్రం ప్రకారం ఆకాశంలోని అత్యంత ప్రకాశవంతమైన సిరియస్ నక్షత్రాన్ని ఆనుకుని మానవ నేత్రాలకి కనిపించని మరో నక్షత్రం వుంది. సిరియస్ చుట్టూ గల భాగాన్ని ఆక్రమించిన ఈ నక్షత్రం చాలా పెద్దదంటున్నారు అక్కడి జ్యోతిశ్శాస్త్రవేత్తలు.

దీనికి ఆధారమైన, ఖగోళ శాస్త్రవేత్తలు నమ్మదగిన ఓ చిన్నకథ వుంది. మర్సెల్ గ్రూయల్, జర్మన్ డిటెర్లిన్ అనే ఇద్దరు ఫ్రెంచి శాస్త్రవేత్తలు 1930లో డాగన్ తెగలోని నలుగురు పండితులను ఇంటర్వ్యూ చేసినప్పుడు వాళ్ళు అనుసరించే జ్యోతిశ్శాస్త్రాన్ని, ఖగోళ శాస్త్రాన్నీ బట్టి ఈ కొత్త నక్షత్రం పుట్టుపూర్వోత్తరాలు వెల్లడయ్యాయి. అయితే ఇది ఎంతవరకూ నమ్మగలమనేది చెప్పలేం. ఎందుకంటే ఎలాంటి అంతరిక్ష పరిశోధనలూ లేని ఆ కాలంలో కేవలం జ్యోతిశ్శాస్త్ర పాండిత్యాన్ని ఆధారంగా చేసుకుని ఇలాంటి శాస్త్రీయ విషయాల్ని చెప్పడం... వాటిని ఏ ఆధారమూ లేకుండా మనం నమ్మడం కష్టమయిన విషయమే. శాస్త్రవేత్తలు పిలిచే బి. సిరియస్ అనే నక్షత్రం మొట్టమొదట 1970లో పెద్ద టెలిస్కోప్ ద్వారా ఫొటో తీయబడింది. డాగన్ తెగవారు ఈ విషయం కూడా చెబుతున్నారు. ఇంకా వాళ్ళు చెప్పేదేమంటే సిరియస్ నుంచి నామస్ అనే తెగవారు వచ్చి వెయ్యేళ్ళక్రితం భూమి అంతా సంచరించారనీ, వాళ్ళు అనాకారులుగా, మత్స్యకన్యలుగా, మత్స్యపురుషులుగా వుండేవారని. ఈ రకమైన కల్పితగాధలు బాబిలోనియా, ఎకాడియన్, సుమేరియన్ జాతుల గ్రంధాలలో కూడా దొరుకుతాయి. మత్స్యకన్యలా కనిపించే ఐసిస్ అనే ఈజిప్షియన్ దేవత కూడా ఈ సిరియస్ నుంచి వచ్చిందనే ఓ గాథ వుంది.

ఈ నామస్ తెగవారు సిరియస్ సౌర కుటుంబానికి సంబంధించిన ఓ గ్రహంలో నివశిస్తారనీ, వారు భూమిపైకి వచ్చేటప్పుడు పెద్ద శబ్దం, గాలి ఏర్పడిందనీ, వాళ్ళే డాగన్ తెగలోని పండితులకి సిరియస్ నక్షత్రం గురించి, దాని వెనక కనిపించకుండా దాగే మరో పెద్ద నక్షత్రానికి సంబంధించిన సమాచారాన్ని ఇచ్చారని డాగన్ జాతిలోని కథలు చెబుతున్నాయి. ఈ నామస్‌వారు ఇంకా మన సౌరకుటుంబానికి చెందిన సమాచారం కూడా ఇచ్చారని డాగన్ తెగవారు అంటారు.



వీరి సమాచారం ప్రకారం మన సౌరకుటుంబంలో గురుగ్రహానికి చుట్టూ నాలుగు పెద్ద చంద్రగ్రహాలున్నాయనీ, శనికి చుట్టూ వృత్తాకారపు చక్రముందనీ, ఇవి సూర్యునిచుట్టూ తిరుగుతాయనీ తెలుస్తోంది.

ఈ డాగన్ జాతిగురించి, వీరి ఖగోళ శాస్త్ర పాండిత్యం గురించి, సిరియస్ నక్షత్రం గురించి వీరిచ్చిన సమాచారానికి సంబంధించిన ఓ గ్రంధాన్ని 1977లో రాబర్ట్, కె.జి. టెంపుల్ అనే రచయిత 'ది సిరియస్ మిస్టరీ' అనే పేరుతో రాశారు. శాస్త్రవేత్తలు కనిపించని ఈ నక్షత్రం గురించి సమ్మకంగా చెప్పడంలేదు.




అసలీ సిరియస్ నక్షత్రం ఆకాశంలోని అన్ని నక్షత్రాల్లోకి కాంతివంతమైనది. ఉత్తరార్థగోళంలో వుండే ఈ నక్షత్రం శీతాకాలం మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇది నీలి రంగులో వుంటుంది. దానికింద వరుసలో మరో మూడు నక్షత్రాలుంటాయి. వీటికి పైన దిజ్మండలంలోనికి కొంచెం ఎగువగా ఓ నక్షత్రం మెరుస్తూ వుంటుంది. భూమినుంచి 8.6 కాంతి సంవత్సరాల దూరంలో వుంది సిరియస్. డబ్ల్యు. లెస్సల్ అనే ఖగోళ శాస్త్రవేత్త సిరియస్ నక్షత్ర మార్గంలో కదలికలను గమనించి ఆ నక్షత్రానికి అనుగామిగా మరో కనిపించని నక్షత్రమున్నట్టు అనుమానాన్ని వ్యక్తం చేశాడు. ఆ తర్వాత అది నిజమేననీ, దాన్ని సిరియస్ బి.గా గుర్తించడం జరిగింది. అది తెల్లగా, పొట్టిగా వుండే మరగుజ్జు నక్షత్రం మాత్రమేనని తేల్చారు. ఈ నక్షత్రంయొక్క ఆకర్షణ శక్తికి సైరస్ నక్షత్రంలోని కదలికలు కనిపిస్తూ వుంటాయని తేల్చారు శాస్త్రజ్ఞులు. ఈ మరగుజ్జు నక్షత్రాలు దళసరిగా, పొట్టిగా వుండి తక్కువ కాంతిని కలిగి వుంటాయి. సిరియస్ బి. భూమికన్నా చిన్న నక్షత్రం. దీన్నిబట్టి చూస్తే డాగన్ తెగవారు చెప్పింది పూర్తిగా కొట్టిపారేసేలా లేకపోయినా, నూటికి నూరు శాతం మన పరిశోధనతో పోలి వుందని మాత్రం చెప్పలేం.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78






అసలైన రుచికి
సిసలైన జోడింప

# ప్రియ మసాలాపేస్ట్!

అన్ని మసాలా దినుసుల అతి చక్కని మేళవింపుతో నోరూరించే రుచ
మీకందిస్తాయి ప్రియ మసాలా పేస్టులు. మీరువం
వెజిటేరియన్, నాన్‌వెజిటేరియన్ కర్రీ అయినా,
బిరియాని అయినా – మీరు చేయవలసినద
ప్రియ నాణ్యతను జోడించడ
ఆ తరువాత అసలైన రుచులు
అందరిని అలరిస్తాయి, మిమ
అభినందనలు ముంచెత్తుతా



priya
Masala Past

• బిరియాని మసాలా పేస్ట్ • వెజ్ కర్రీ మసాలా పేస్ట్ • నాన్‌వెజ్ కర్రీ మసాలా పే

Mudra P. 20066 Tel

Ushodaya Enterprises Limited (Priya Foods Division), Eenadu Complex, Somajiguda, Hyderabad - 500 082, (A.P
Phone : +91-40-3323717, 3324727 Fax :+91-40-3393640 E-mail: priyaexp@hd1.vsnl.net.in www.priyafo